# నెల నెలా మీ ఇంట
# నిండు వెన్నెల పంట

నెలకోసారి వినీలాకాశంలో
విరబూసే పున్నమిచంద్రుడు
కెరటాల రెకులు విప్పుకుని
తెలినురగల మేలిముసుగు కప్పుకుని
యెగిసిపడే యెదతో కడలి కలువ
మాసం మాసం మనోవికాసం గుబాళించే
విశిష్ట మాసపత్రిక విజేత
ఆలోచనల కనులతో యెదురు తెన్నులు
చూసే విజ్ఞులైన పాఠకులు
జీవన సాగరయానంలో
పాఠకుల మధుర నేస్తం విజేత
కథాసాహిత్యానికి కలికితురాయి
తెలుగు పత్రికారంగంలో మరో మైలురాయి
ప్రతినెలా మీ యింట పండు వెన్నెలలు కురిసే
అక్షరాల జాబిల్లి విజేత

# విజేత

విశిష్ట మాసపత్రిక

**1/8 డెమ్మీ 200 పేజీలు  వెల 3/- రూపాయలు**

**నాంపల్లి స్టేషన్ రోడ్, హైదరాబాదు-500 001**

---

విజేత ప్రారంభ సంచిక ఉచితంగా పొందాలంటే

**జ్యోతిచిత్ర** వారపత్రిక చూడండి




లక్ష్మీ జ్యోతి పిలింస్

# చిల్లరకొట్టు చిట్టెమ్మ

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత ఆర్ యస్ రాజు

థ మాటలు దాసంగోపాలకృష్ణ ~ గీతం రమేష్‌నాయుడు

తాగ్యరామ నవభారత్ శ్రీతారకరామ

AKARAMA

సంస్థాపకులు
కీ॥ శే॥ వి వి రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి లీలావతి
రాఘవయ్య

సచిత్ర మాసపత్రిక
నవంబర్ 1977

సహకార సంపాదకుడు : వేమూరి సత్యనారాయణ

సంపుటి 15

విషయసూచిక

సంచిక 10


| | | |
|---|---|---|
| మయసభ | 13 | ఎ రామసంజీవి |
| భూమి గుండ్రంగావుంది (సీరియల్) | 16 | బీనాదేవి |
| బీ ఎ రోమన్ | 33 | నెల్లుట్ల నరసింహారావు |
| నవమౌక్తికమాల (కవిత) | 43 | రంగినేని సుబ్రహ్మణ్యం |
| స్వామీజీ సొల్యూషన్ | 44 | నాయుని కృష్ణమూర్తి |
| చెట్టూ-ఛాయా (సీరియల్) | 50 | ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి |
| నీలి నీడలు | 60 | పిహెచ్. మధు |
| జరిగిందే కథ | 71 | భమిడిపాటి రామగోపాలం |
| మరణంలో జీవితం | 80 | ఆర్ ఇందిర |
| మధురవాణి | 94 | కె వి నాగేశ్వరరావు |
| వివాహం వ్యాపారమా | 97 | ఎమ్ కరుణ |
| మనిషికి ఏం కావాలి? (సీరియల్) | 102 | కొమ్మూరి వేణుగోపాలరావు |
| పదబంధ ప్రహేళిక | 112 | శ్రీ శ్రీ |
| మీ ప్రశ్నకు మా జవాబు / మా ప్రశ్నకు మీ జవాబు | 122 | ధనికొండ హనుమంతరావు |

నవలానుబంధం

ఏడడుగుల విషాదం—పాలకోడేటి సత్యనారాయణరావు

జ్వాల రగిలించకు—జి ఆర్ కృష్ణ


ముఖచిత్రం 'గడుసు పిల్లోడు'లో శోభన్‌బాబు మంజుల

జ్యోతి, 17 B రాజారాం కాలనీ P B నెం 2650 మద్రాసు 600 024
ఫోన్ 423123 సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో) రు 42/-

# జ్యోతిమాట

'కుప్పుస్వామి అయ్యర్ మేడీజీ' అని నవ్వుతూ అన్న శ్రీశ్రీ తర్వాత పజిల్ అందిస్తూ 'కుప్పుస్వామి అయ్యర్ మేడ్ డిఫికల్ట్' చేసేశాను అన్నారు అది నిజంగానే చాలా కష్టమైనట్లుంది పాఠకులకు ఒక్క ఆల్ కరెక్ట్ ఎంట్రీరాలేదు అలా అని ఎవ్వరూ పూర్తిచెయ్యలేని 'అంశం ఒక్కటీ కన్పించలేదు కూడా రెండుమూడు 'రెండు మూడు తప్పులతో' వచ్చిన ఎంట్రీలు కలిపితే ఒక ఆల్ కరెక్ట్ ఎంట్రీ అయేలా వున్నాయి వచ్చిన ఎంట్రీలు కొందరు ఒకచోట తప్పు పూర్తిచేస్తే మరికొందరు మరొకచోట చేశారు ఏమైతేనేం ఈనెల మొత్తం వచ్చేనెల మొత్తానికి జతకలిసింది నవంబర్ 'ప్రహేళిక కు బహుమతి జాక్‌పాట్ రు 100/-గా వుంటుంది ఆల్ ది బెస్ట్ టు యూ-ట్రై టు గెటిట్

* * *

రాజకీయంగా సాంఘికంగా, సాంస్కృతి పరంగా సాహితీపరంగా - రకరకాల అంశాల వర్తమాన చరిత్రపై ఎ రామసంజీవి రసవత్తరమైన వ్యాఖ్యానం ఈ సంచికలో ప్రారంభమవుతోంది 'మయసభ శీర్షిక ఇది

* * *

దీపావళి నవలల పోటీ కొచ్చిన నవలల పరిశీలన జరుగుతోంది సాధ్యమైనంతవరకూ దీపావళి సంచికలోనే ఫలితాలు ప్రకటించేందుకు ప్రయత్నిస్తున్నాము అలా కాని పక్షంలో డిసంబర్ సంచికలో ప్రధమ బహుమతి నవలతోపాటు ఫలితాల ప్రకటనకూడ జరుగుతుంది

* * *

ఈ సంచికలో కబుర్లు ప్రచురించ లేక పోయాము వచ్చే సంచికనుంచీ యధావిధిగా ఈ శీర్షిక కొనసాగుతుంది

* * *

బీనాదేవి సీరియల్ పేరు మార్చడం జరిగింది ఆ సీరియల్ నవల 'పుణ్యభూమి కాస్సేపు కళ్ళు తెరవకు పేరుతో గాక 'భూమి గుండ్రంగా వుంది పేరుతో ప్రచురింపబడుతోందీ నెలనుంచీ

* * *

మీరు మెచ్చే జ్యోతి 'దీపావళి ప్రత్యేక సంచిక తయారీలోవుంది నవంబరు 1 కే మీ చేతుల్లో వుంటుంది

వె. రాఘవేంద్రరావు

# ఉత్తరాలు

## మరో కాపీ కథ?

జ్యోతి సెప్టెంబర్ సంచికలో ప్రచురించబడిన రాజీ కథ (రచయిత పి ఎస్ రావు) ఆంధ్రజ్యోతి వారపత్రికలో ప్రచురించబడి తర్వాత 'కడుపుకోత' కథా సంపుటిలో ప్రచురించబడిన 'కోళ్ళ పందెం (రచయిత దేవరాజు మహారాజు) కథను కాపీ అని మా దృష్టికి తెచ్చారు శ్రీ నందిని సిధారెడ్డి ఆ విషయంగా వివరణ కోరగా రాజీ రచయిత 'నా కథలు చాలావరకు నా జీవితంతో ఎదురైన వాస్తవిక సంఘటనలూ నా జీవితానుభవాలూ ఆధారంగా రచింపబడినవే గాని కల్పితాలూ కాపీలూకావు నేను ఈ కథను ఒక ప్రాంతంలో వాస్తవంగా జరిగిన సంఘటనను ఆధారంగా చేసుకొని రాశాను ఈ కథలో ప్రధానమైన విషయం -కన్నతల్లిచేతనే అబద్ధపు సాక్ష్యం చెప్పించి-కన్నకొడుకు ప్రాణానికి ఖరీదు కట్టి పెద్దలు డబ్బు ఇవ్వడం కలిమి ముందులేమి ఎలా సులువుగా తలవంచక తప్పదో నిరూపించడం మాత్రమే మిగిలినదంతా యీ విషయం చెప్పడానికి ఉపోద్ఘాతం మాత్రమే సమకాలీన రచయితలు సాధారణంగా సమకాలీన సాంఘిక రాజకీయ ఆర్థిక పరిస్థితులను చూసి చలించి కథలను రాయడం జరుగుతూంటుంది అటువంటప్పుడు ఒకే సంఘటన యిద్దరు రచయితలకు కథావస్తువు అయితే కొన్ని పోలికలు కనిపించడం సహజం అంతమాత్రాన కాపీ అనడం సమంజసంకాదు" అని రాశారు కాపీ అని ఆరోపించడానికి ఆస్కారం కలిగించింది కథావస్తువు ఒక్కటే కావడం కొందరు పాఠకులు కాపీ అని ఆరోపించడం అసమంజసం కాదని మేం భావించాము 'కోళ్ళపందెం కథనుకూడా చదివి చూశాక రాజీ కథా రచయిత వివరణ సహేతుకంగా ఉన్నదనే మేం భావించాము కోళ్ళపందెం తెలంగాణ మాండలికంలో రాయబడ్డ చిన్న కథ రాజీ కథకూ ఆ కథకూ యజమానుల కొరకు పనివాళ్ళు కొట్టుకోవడం చివరకు యజమానులు ఒకటైపోవడం చివరకు పనివాళ్ళే నష్టపోవడం అన్న అంశం మాత్రం ఒకటిగా ఉంది ఆ సంఘటనలు తెలుగు దేశంలోని ఎన్నో గ్రామాలలో జరిగే అవకాశాలూ ఉన్నాయి ఈ కారణాలవల్ల రాజీ కథా రచయిత వివరణ సహేతుకమేనని మేం భావిస్తున్నాము

—ఎడిటర్

"జ్యోతికి విమర్శనా సమీక్షలు సమీక్షగానే కాదు మీకు నచ్చని అంశంపై విమర్శలు పంపవలసిందన్న ఆహ్వానం మా పాఠకులకు ఎల్లప్పుడూ వుంటుంది" అనే ఈ అందమయిన అలంకరణ బోర్డును ఇహనైనా కాసింత చాటుచేస్తే ఇంక నా బోంట్ల తెలివిలేని పాఠకులకు సౌకర్యం కలిగించినవారు అవుతారు నిజంగా అబ్బా! ఇంత సహృదయంతో



# దీపావళి ప్రత్యేక సంచిక
# 1977
## నవంబర్ 1 కి విడుదలవుతుంది!

విమర్శలను ఆనందంగా స్వీకరించే కెపాసిటీ గల పత్రికలు వున్నాయా? అని మొదట్లోనే కావలసినంత బోలెడంత చెప్పలేనంత అనుమానం వచ్చింది అయినా ఏదో ఓమూల చూద్దాం ఓతపా అనిపించి ఆగష్టు నెల నవలానుబంధం పునర్జన్మసు గూర్చిన 'విమర్శను ఎమర్శగా, విమర్శించాను "నో రెస్పాన్స్"

కొంగర ఉమామహేశ్వరరావు తెనాలి

[ ఇంకా చాలా పెద్దదైన పాఠకుని ఉత్తరమంతా విమర్శను స్వీకరించే సాహసంలేని జ్యోతిపై విమర్శగానే ఉన్నది విమర్శకు కృతజ్ఞతలు అయితే మూడు నెలలుగా అసలు ఉత్తరాల శీర్షికే ప్రచురణ జరగడం లేదన్నది గమనించి ఉండవలసింది పాఠకుడు అయితే మా విజ్ఞప్తి ఒకటుంది జ్యోతి ప్రచురిస్తున్న రచనలపై మీ విమర్శలు కేవలం విమర్శను విమర్శగా విమర్శించేవిగా గాక సహకారంగా నిర్మాణాత్మకంగా ఉండేలా చూడమని మనవి —ఎడిటర్]

అక్టోబరు సంచికలోని "ఇదిగో కన్నీళ్ళు దోసిళ్ళు పట్టండి" అంటే హృదయ కవాటం తెరిచి దోపిలిపట్టాను —ఊహుఁ గుండెల్లో రగిలి ఉప్పొంగి కన్నీరుగా మారి ప్రవహించే లావాను ఎన్ని దోసిళ్ళు ఆపగలవు ఈ దిక్కుమాలిన భారతదేశంలో లక్షలాది భర్తృహీనం గుండెలు మండి శెగలై రగిలి తిరిగి అదొక మహాప్రవాహమై ఏ దోసిలికీ అందక ఏదో ఒకనాడు ఈ కుళ్ళిన సమాజాన్ని ముంచెత్తుతే ఆ మహా ప్రవాహంలో ఈ కుళ్ళంతా కొట్టుకుపోయినప్పుడుగాని మళ్ళీ క్రొత్త నాగరికత ఉద్భవించినపుడుగాని ఈ దేశం ఆడపడుచుల—కన్నీటికి అంతం ఉండదేమో !

'ఇందనగారికి నా హృదయపూర్వక అభివందనములు —కల్పన ఖమ్మం



# మయసభ

ఔను మరి మయసభే!

నిజం అబద్ధంగాను, అబద్ధం ఒద్దం గానూ చలామణి అవుతున్న మన రాజకీయాలు, మన సమాజం, మన సాహిత్యం ఇదంతా ఒక 'భారీ ఎత్తు టెక్నికలర్ మయసభ కాదుటండీ!

మరిందులో దుశ్శాసను లెవరో ధర్మరాజు లెవరో చెప్పడం కష్టంగా వుందిప్పుడు

ఆనా డెప్పుడో (పాపం చచ్చి ఏ లోకాన వున్నాడో గురజాడ అప్పారావు) 'దేశమంటే మనుజులోయ్' అన్నాడు కాని 1976 లో 'దేశమంటే ఇందిరా గాంధీయేనోయ్' అన్నాడు దేవకాంత బారువా (పాపం ఓడి ఏమూల దాగి వున్నాడో—)

77 మార్చి ఆఖరి వారానికెల్లా ఈ దేశంలోని సుబ్రారావులూ, సుశీలలూ అప్పలకొండలూ వరహాలమ్మలూ కలిసి- 'గురజాడ నిర్వచనమే రైటు' అని ఘాటుగా నిరూపించారు తమ ఓటుతో

వాళ్ళింకో విషయంకూడా నిరూపించారు

"Power flows from the barrel of a gun" అన్న మావో సూక్తిని మన వాళ్ళు—

"Power can also flow from the ballot box" అని సవరించారు.

ఈ చరిత్రాత్మక మయిన 77 లో (77 అన్నది ఒక్క చల్లటి తీయని తాజా పానీయం కూడా నండోయ్ అది 'కోకో కోలా'కు చరమగీతం పాడిన అసలు సిసలు స్వదేశీ పానీయం కూడానూ—) అటువంటి ఈ 77 లో కురుపాండవుల మధ్య విభజనరేఖ అంత స్పష్టంగా లేదు అందులోవారిందులోను ఇందులో వారందులోనూ కనపడుతున్నారు అర్జునుడి ప్రక్కన కర్ణుడున్నాడు సహదేవుడు అశ్వత్థామ ప్రక్కన నిల్చున్నాడు

కొంతమంది 'దూరదృష్టి గల నాయకమ్మన్యులకు ఇప్పుడిప్పుడే 'కాంగ్రెసులో నియంతృత్వ ధోరణులు కన్పిస్తున్నాయి అంచేత వారొక సుదీర్ఘమయిన పత్రికా ప్రకటన ఇచ్చేసి అవతల పార్టీలోకి వెళ్ళి పోతున్నారు ఈ విధమైన వూసరవెల్లులకు చోటివ్వము అన్న జనతా పార్టీ వారు తమ 'మడి'ని కొంత సడలించినట్లున్నారు రాజకీయ పక్షాల

---

ఎ. రామసంజీవి

---

మార్పిడికి వ్యతిరేకంగా బిల్లు 'ఇదుగో విడుదల! అదుగో విడుదల అంటున్నారే తప్ప ఆ కాస్త పనిచేయడం మాత్రం వాయిదా వేస్తున్నారు ఈలోగా గోడ మీద మార్జాలాలు ఎక్కువగా తిరుగు తున్నాయి

నాకు బాగా గుర్తు రాష్ట్రపతిగా 1969 లో శ్రీ నీలం సంజీవరెడ్డి తమ అభ్యర్థి పత్రాన్ని దాఖలు చేస్తుండగా ఆయన పత్రం మీద సంతకాలు పెట్టి దిన పత్రికలో ఫొటోలో శ్రీ రెడ్డి ప్రక్కన నిల్చుని నవ్వుతూ కనపడిన ఒకానొక నాయకుడు సరిగ్గావారం తిరక్కముందే - 'అబ్బే! నీలం సంజీవరెడ్డా? ఎవరండీ ఆయన? అన్నట్లుగా అమాయకంగా మొహం పెట్టాడు కారణం ఏమిటి అంటే—శ్రీమతి ఇందిరాగాంధి. రాష్ట్రపతిగా తమ పార్టీ అభ్యర్థిగా శ్రీ సంజీవ రెడ్డిని బలపరచిన శ్రీమతి ఇందిరాగాంధీకి రాత్రుగా (తెలుగు సినిమాల్లోలా)అంత రాత్మ ప్రబోధం వినబడింది

ఆ అంతరాత్మ ఏం చెప్పి వుంటుంది?

"ఇదిగో చూడమ్మాయ్! ఈ అనంత పురం రైతు బిడ్డను రాష్ట్రపతి చేస్తావా? ఎంత పొరబాటు చేస్తున్నావు? లే! నిద్ర మేలుకో! ఇప్పటికయినా మించిపోయిం దేమీ లేదు వెంటనే నన్ను సాక్ష్యంగా ఒక ప్రకటన చేసెయ్యి సంజీవరెడ్డి నీ అభ్యర్థికాదని చెప్పేసెయ్యి' —అని చెప్పి వుండాలి

ఆవిడ 'డిసిప్లిన్‌డ్ సోల్జర్' గనుక వెంటనే అంతరాత్మ చెప్పినట్లు చేసి పారేసింది

[ఒప్పుకున్నానండీ! మీకు నాకూ అంతరాత్మలున్నాయి! తెలుగు సినిమా నాయికీ నాయకుల్కు వుంటాయి మనం దరిపి సాదా వెరైటీవి! ఇందిరాగాంధీ అంటే జవహర్లాలంతటివాడి ఏకైక సంతానం పైపెచ్చు నాయకురాలు ఎంత సోషలిజమయినా ప్రధానమంత్రి అంత రాత్మా. మనబోడి అంతరాత్మలూ ఒకటవు తాయి టండీ ఆవిడ ఆవిడగనుక అలా చేయగల్గింది దేశ చరిత్రను మార్చి వేసింది]

ఇంతకూ అసలు కథ వెనక పడి పోయింది శ్రీమతిగాంధి అంతరాత్మ ప్రకటనకు పత్రికల్లో చూడగానే. సంజీవ రెడ్డిగారి పక్కన నిలబడి ఫోటో తీయించు కున్నాయన 'కోటుమార్చి ప్లేటు మార్చి కులుకు విలాసంగా 'అంతరాత్మ' పార్టీలో చేరిపోయాడు

బాగుంది జీవితంలో ఎవరయినా తప్పులు చేయవచ్చు దిద్దుకోవచ్చు

కాని ఇదే 'ప్లేటు ఫిరాయింపు నిపుణుడు మార్చి 77 ఎన్నికల తర్వాత నాలుగు నెలలయ్యాక ఏకంగా కాంగ్రెసుకే ఎగనామం బెట్టి దానిని నాలుగు తిట్టి. జనతా జెండానీడను చేరిపోయాడు!

రేపు ఇంకో నాలుగయిదేళ్ళకో అంత కన్న ముందుగానో ప్రభుత్వం ఇంకో పార్టీ చేతికి వస్తుందనుకోండి పైన ఉదాహరించిన 'పరుగు పందెం వీరుడు' అతడిలాటి వారూ 'రాక్కన' ఆ పార్టీ లోకి వెళ్ళిపోతారన్న మాట

అంటే పార్టీకాదు ముఖ్యం పదవి

ముఖ్యం అన్నమాట ఒక అయిదేళ్ళ పదవికోసం బహిరంగంగా సిగ్గు శరం విడిచి పరుగులుతీసే ఈ గుణహీనులు మనకు ప్రతినిధులా? వారిలోంచి మనకు నాయకులా? వాళ్ళు చేసేది పరిపాలనా? అందులో న్యాయంవుంటుందని నమ్మ మంటారా?

మీరూ, మీరూ నేనూ నా వాళ్ళు మనం అందరం చేతకాని ప్రేక్షకుల్లా వుంటేనే కదండీ ఈ రాజకీయపు మర్కటాలు ఆ కొమ్మమీద నుండి ఈ కొమ్మ మీదకు గెంతుతోంది?

ఇది ఎవరికి పట్టిందిలే అని వూర్కొబట్టేగా రాజకీయాలంతా బెర్నార్డ్ షా అన్నట్లు స్కౌండ్రెల్స్'కు వేట భూమి అవుతూంది?

మనం మన పద్ధతులను మార్చుకోవాలి మన రియాకన్స్‌ను సభ్యతతోనే కానివ్వండి, స్పష్టంగా తెలియ పర్చడం నేర్చుకోవాలి మన పత్రికలు రేడియోలు కూడా మౌలిక మయిన విలువలకే హాని జరుగుతున్నప్పుడు వుత్తుత్తినే 'వీణ'లు మీటడంకాదు ఘంటాపథంగా ఇది తప్పు అని చెప్పగలగాలి ఇక్కడ వ్యక్తులు అప్రధానం, విలువలు ప్రధానం

మనం ప్రజాస్వామ్య దేశంగా ఎదగాలంటే నాలుగు కాలాలపాటు నిలబడాలంటే వేళ్ళల్లో చీడ పురుగులుండరాదు ఆకులమీద గొంగళులు పనికిరావు ప్రజలుగా బాధ్యతగల ప్రజలుగా 'మన నిరసన అన్న క్రిమి సంహారిణిని తగు మోతాదులో చల్లి తీరాలి అయిదేళ్ళకో సారి జరిగే ఎన్నికల్లో ఒక బలీయమైన 'అధికార రోగపూరిత బదిరాంధత ప్రభుత్వాన్ని ఎలా కాలదన్ని పారవేయవచ్చో 77 మార్చిలో తెలుసుకున్నాము ఎన్నికకు ఎన్నికకు మధ్యకాలంలో మన ప్రతినిధులనబడే వాళ్ళు వెర్రివేషాలు వేయకుండా చూచేశక్తి మనకుంది దాన్ని మనం వాడుకోవాలి అంతే।

అంతవరకూ 77 మార్చి విప్లవం అసమగ్రమే। అసంపూర్ణమే। □□

---

అక్టోబరు '77 సంచికలో ప్రత్యేక పారితోషికం

పొందిన కథలు

గురి —రచన యం. రామకోటి

గొర్రెలు —రచన 'అర్నాద్'

---

## గ మ ని ం చ ం డి

## ‘పుణ్యభూమీ కాస్సేపు కళ్ళు తెరవకు’

## సీ రి య ల్

## పేరు మార్చబడినది

## ఈ సంచికనుంచీ ఈ సీరియల్ పేరు



# భూమి గుండ్రంగా వుంది

బీనాదేవి సీరియల్

జరిగిన కథ :

జగన్నాథం జానకి ముచ్చటగా సంసారం చేసుకుంటున్న దంపతులు. జగన్నాథం పిల్లల సంగతి పట్టించుకోనందుకు భార్య నొచ్చుకుంటే, ఈయన నచ్చజెప్పే ముచ్చట్లే ఎక్కువ వారిమధ్య. పొరుగింటి భ్రమరాంబ మాటల మధ్యలో జగన్నాథానికి ఊళ్ళో ఇల్లుందని చెప్పేసరికి జానక్కి మరీ కోప మెచ్చింది, భర్తమీద. ఊళ్ళో ఇంటి విషయం లాభసాటిగా పరిష్కరించేందుకు బలవంతానే అయినా భర్తను ఒప్పించి బయలేరతీసింది జానకి.

# 6

శలవులు బజార్లో దొరకవు డబ్బుపెట్టి కొనుక్కోవడానికి బేంకుల్లోనూ దొరకవు చెక్కురాసి తెచ్చుకోవడానికి మరెలా?

కిందివాడు పైవాడ్ని అడుక్కోడవేఁ ఇవ్వడం ఇవ్వకపోవడం పైవాడిష్టం ఈ అడుక్కోవడంలో కూడా రకాలున్నాయి జవానుగాడికి శలవు ఆఫీసరు బాబు సేంక్షనుచేస్తే తప్ప వాడు అడుగుతీసిగాని తియ్యకుండాగాని మరో అడుగు వెయ్యడానికి వీల్లేదు ఓ మోస్తరు ఆఫీసరైతే శలవు చీటీరాసి ఆఫీసరు మొహాన పారేసి చక్కాపోవచ్చు ఆపై ఆఫీసరుకే శలవు కావలిస్తే తనే రాసుకొని తనే సేంక్షను చేసుకొని పోతాడు

ఇదీ లోకరివాజు

జగన్నాధం యీ లోకంవాడే

తన శలవు తనే తీసుకోవచ్చు

రాయడానికి పెన్ను, పెన్నులో యింక్ కాయితం కూడా వున్నాయి మరే విఁటి అడ్డు?

అతని కొలీగ్ శలవులో వుంది

ఇద్దరూ ఒక్కసారె లేకపోతే హాస్పటల్లో పేషెంట్ల సంగతేఁవిఁటి?

(ఇద్దరం వుండి మాత్రం ఏం ఉద్ధరిస్తున్నాం అన్నిటికీ పట్నం పెద్దాసుపత్రికి తీసుకుపో అనడం తప్ప-అన్నది జగన్నాధం స్వంత అభిప్రాయం)

ఆ కొలీగ్ వచ్చేసరికి వారం పట్టింది ఈ వారం రోజులూ జగన్నాధం మూడ్ మారిపోకుండా జానకి చాలా జాగ్రత్తలు తీసుకుంది ఎలాగైతేనేం అనుకున్న పది రోజులకి స్వంత ఊరు బైల్దేరేరు జానకీ జగన్నాధం పిల్లల్ని పక్కింటి వాళ్ళకి అప్పచెప్పి

డైరెక్టు బస్సుగాని ట్రైనుగాని వుంటే అమలాపురంనుంచి అమెరికా వెళ్ళిపోవచ్చు కాని ట్రైనుదిగి బస్సెక్కడం బస్సుమారి బస్సెక్కడం, వాటికోసం వైటింగు వున్నాయ్ అబ్బబ్బ హారిబుల్ అందులోనూ ట్రాన్సఫరైనప్పుడు తప్ప ఎక్కడికీ కదలడం అలవాటులేని జగన్నాధానికి మరీను

వాళ్ళ ఊరుమీదుగా ప్లేన్ వెళ్తుంది కాని అక్కడ ఆగదు ఏరోడ్రోమ్ లేనందువల్ల

ట్రైను వాళ్ళ ఊరిమీదుగా వెళ్ళదు అసలు మొదట ట్రైను వేసినప్పుడు వాళ్ళ ఊరిమీదుగానే వేస్తానంది గవర్నమెంటు "ట్రైనువేస్తే యింకేమైనావుందా? ఊరంతా నాశనం అయిపోదూ? ధరలన్నీ మండిపోవూ? ససేమిరా మాకు ట్రైను వద్ద'న్నారు ఆ ఊరి పాలిటీషియన్లు పెద్ద మనుషులు మరంచేత ఆ ఊరికి పదిహేనుమైళ్ళు పక్కనుంచిపోతుంది ట్రైను ఆ పదిహేనుమైళ్ళు బస్సులో

వెళ్ళాలి

పలుకుబడితోనో, పెట్టుబడితోనో మెడికల్ సీటైనా సంపాదించవచ్చేమో కాని ట్రైన్లో బెర్తు మాత్రం సంపాదించడం కష్టం మినిమమ్ వారంముందు రిజర్వు చేసుకోకపోతే "లేడికి లేచిందే ప్రయాణం" గాళ్ళకి నిల్చోడవేగతి

జగన్నాథం ముందుగా రిజర్వు చేయించుకోలేదు ప్రయాణం ఎప్పుడో ఖచ్చితంగా తెలీకపోవడంవల్ల అతనికి పలుకుబడిలేదు పెట్టుబడి పెట్టడం యిష్టంలేదు అంచేత అతికష్టంమీద అర్ధరాత్రి దాటేక కూర్చోవడానికి మాత్రం చోటు దొరికింది

మర్నాడు సూర్యోదయంవేళకి ట్రైనుదిగి బస్స్టాండు చేరేరు ఇద్దరూ

ఆ ఊరి మేప్లో అది మున్సిపల్ రోడ్డు

ఆ ఊరి ప్రజలకది బస్స్టాండు

ఆ రోడ్డంతా ఒకదానివెనకొకటి ఒకదాని కడ్డంగా యింకొకటి అడ్డదిడ్డంగా బస్సులు వుంటాయి

వర్షాకాలంలో బస్సుస్టాండు నీళ్ళలో వుంటుంది మిగతా కాలాల్లో నీళ్ళు బస్సుస్టాండులో వుంటాయి రోడ్డుకి కుడివైపునున్న చిన్న ఖాళీ స్థలంలో ఓ పాక వుంది ఆ పాకకి కింద పదిరాటలు పైన ఓ పాతిక తాటాకులు వున్నాయి

అది ప్రయాణీకుల సౌకర్యార్థం లేటు సూరిశెట్టిగారి కుమార్థు లయన్ శ్రీ రామిశెట్టి అండ్ సన్స్ క్లాత్ మర్చంట్స్ వారిచే ధర్మం చెయ్యబడింది

ఆ పాకలో పగలు పశువులు, రాత్రి ముష్టివాళ్ళు మరియు పశువులు వుంటాయి

దానికి పక్కన కొంచెం లోపలికి "బ్రాహ్మణ కాఫీ హోటలు"ంది దాని ముందు ఓ సిమెంటు బెంచీ, ఓ కర్ర బెంచీ వున్నాయి ఆ రెండు బెంచీల వెనక ఓ అద్దాల బీరువావుంది బీరువామీదున్న లక్ష్మీదేవి వంటపొగకో ఊదొత్తులపొగకో మసిబారిపోయి హోటలు పనిమనిషిలావుంది

ఆ బీరువాలో పొగచూరిన అద్దాల వెనక నాచురంగు ఇత్తడి పళ్లేలలో నిన్నటి పకోడీలు, మొన్నటి వడలు వున్నాయి సిమెంటు బెంచీకి కొంచెం వెనగ్గా కుర్చీమీద కూర్చొన్న నలభై నెంబరు నేతపంచె కట్టుకున్నతను ఆ హోటలు ప్రొప్రైటరే యీ హోటలు నిజంగా బ్రాహ్మలదే అనుకోవడానికి నిదర్శనం అతని నుదుట అడ్డంగా వున్న విబూదిరేఖలు మెళ్ళోవున్న జంధ్యం బ్రాహ్మణ చిహ్నంగానే కాకుండా, దురదేసినప్పుడు వీపు గోక్కోవడానిక్కూడా పనికొస్తోంది జంధ్యం

సిమెంటు బెంచీనానుకునే వున్న కాసులు కిల్లీకొట్లో కిల్లీలే కాకుండా సిగరెట్లు, బీడీలు, చుట్టలు, పదిపైసల సోడాలు రూపాయి సోడాలు కూడా అమ్మబడును యీ బడ్డీకొట్టుని ఆనుకునే వున్న వరాలమ్మ కిల్లీషాపులో పైన చెప్పినవే కాకుండా అదనంగా డిటెక్టివ్ పుస్తకాలు అద్దెకి దొరుకుతాయి వరాలమ్మ కాసులమ్మ వ్యాపారం




లోనే కాకుండా జీవితంలో కూడా పోటీదార్లే వాళ్ళిద్దరి జమిలి మొగుడు జగ్గారావు రెండుకొట్ల మధ్య కూర్చుని యిద్దర్నీ తిడుతూ, యిద్దరి దగ్గర డబ్బు వడుక్కొని పోతాడు

రోడ్డుకి అవతల పక్కన ఓ టిన్‌రేకుల షెడ్డుంది ఆ రేకులు క్రితం జన్మలో తారుడబ్బాలు ఆ షెడ్డు ఓనరు పూర్వాశ్రమంలో P W D లో రోడ్డుమీద పని చేసే మేస్త్రీ ఆ షెడ్డుకి ముందు ఓ రాటకి కట్టిన బోర్డుమీద "రాజుల మిలటరీ భోజన హోటలు" అన్నబోర్డు దానికింద "మీల్స్‌రెడీ" అన్నబోర్డు కూడా వుంటాయి ఆ హోటలుకి రాజులు మిలటరీవాళ్ళు వస్తారో రారో తెలీదు కాని కండక్టర్లు క్లీనర్లు, డ్రైవర్లు మాత్రం వస్తారు

"యివేళ మన అదృష్టం బావుంది" అనుకున్నాడు జగన్నాధం బస్టాండులో తనూరు వెళ్ళే బస్సుని చూడగానే

"బైల్దేరిన వేళ మంచిదే" అనుకుంది జానకి ఆ బస్సు ఖాళీగా వుండడం చూసి

"ఇంకా ఎంతసేపట్లో బైల్దేరుతుందోయ్" అడిగేడు జగన్నాధం అక్కడే వున్న ఓ కుర్రాడ్ని

ఆ కుర్రాడు తొడుక్కున్నది పైజామావో, పేంటో చెప్పడం కష్టం దాన్ని వాడికెవరో "మారాజు యిచ్చేడు కుట్టించినప్పుడది ఏ రంగులో వుందో కాని ఇప్పుడు మాత్రం బ్లాక్ ఎండ్ వైట్‌లో తీసిన సినీమాకి పంచరంగుల ప్రింటు

షేసినట్టుంది లేటెస్టు తెలుగు సినీమాలోని సెక్సుపాట పాడుకుంటూ బస్సుకి స్నానం చేయిస్తున్నాడు వాడు

పాట మంచి తారస్థాయితో వుందేమో జగన్నాథం మాటలు వాడికి వినిపించలేదు

మళ్ళీ అడిగేడు జగన్నాథం

"అబ్బో ఇప్పుడప్పుడే బైలెల్దండి" అన్నాడు వాడు బానెట్ పాలిష్‌చేస్తూ

"ఎన్నిగంటలకి వెళ్తుంది?"

"పేట బండి రావాలగదండి మరి"

"అదెప్పుడొస్తుంది?"

ఆ కుర్రాడు బానెట్ పాలిష్ ఆపి జ్ఞాపకం చేసుకోవడానికా అన్నట్టు ఓసారి బుర్ర గోక్కున్నాడు. జ్ఞాపకం రాలేదు

ఓసారి ఆకాశంలోకి చూశేడు అక్కడ పేట బండి కనిపించలేదు కాని మండిపోతున్న మందార పువ్వులా సూర్యుడు కనిపించేడు

"అబ్బో శానా పొద్దెక్కద్దండి" అన్నాడు బానెట్ దిగిపోయి.

"పోనీ ఊరెళ్ళే బస్సు ఎప్పుడొస్తుందో తెలుసా?" అని తన ఊరిపేరు చెప్పేడు జగన్నాథం

"తవఁరుగోరు ఆవూరెళ్ళాలేటండి!" అని పరామర్శించి "అలగైతే ఎనిమిది గంటల బూరాటయాముకి పట్నం బండొస్తాదండి అదిక్కేయండి శార్జీ కుసింత ఎక్కువే అయినా పద్దిటయాముకెల్తారు" అని తరుణోపాయం కూడా చెప్పేడు

టైము చూసుకున్నాడు జగన్నాథం ఏడైంది

"అబ్బ! ఇంకా గంట కూర్చోవాలా?" గొణుక్కుంది జానకి

బస్సెక్కడ దొరకదో అన్న తొందర్లో రైల్వే స్టేషన్లో కాఫీ అయినా తాగలేదు వాళ్ళిద్దరూ అంచేత ఆకలి దహించేస్తోంది మామూలుగా ఇంటిదగ్గరైతే కాఫీ కప్పు చూస్తేనే కాని మంచం దిగడు జగన్నాథం అందుకే పొద్దున పాలు వచ్చేవరకు అతన్నెవరూ లేపరు కాఫీ ఆలశ్యం అయితే అతనికోపం డేంజర్ లెవెల్ దాటిపోతుంది అంచేత—

"పోనీ కాఫీ తాగితే " అని ఆపేసింది జానకి

అతనికీ తాగుదావఁనే వుంది. కాని ఆ బ్రాహ్మణ కాఫీ హోటలు చూస్తే. అక్కడ ఓసారి కాఫీ తాగితే మరింక జన్మలో కాఫీ ముట్టుకోనేమో—అన్న భయం పట్టుకుంది. కాఫీ దాగుదావా? మానేద్దావా? అన్న దైలమాలోంచి జగన్నాథం బైట పడకుండానే "పట్నం బండొ"చ్చేసింది

దూరంగా ఎక్కడో కూస్తున్న సైరను పిచ్చివాడి ఏడుపులా విషాదంగానూ, దీనంగానూ వినిపిస్తోంది.

జగన్నాధానికి బస్సు కనపళ్ళేదు మనుషులే కనిపిస్తున్నారు మనుషులంతా చేరి బస్పాట ఆడుకుంటున్నారా అన్నట్లు, ఆ బస్సుకి పైనా, కిందా, బైటా, లోపలా ఎటుచూసినా మనుషులే వాళ్ళని చూసిన జగన్నాధానికి తక్షణం వెనక్కి తిరిగి కనిపించిన రైలెక్కి పారిపోదావఁనిపించింది

ఇంతలో ఆ ప్రవాహంలోనుంచి "ఎవరూ దిక్కండి బండెల్లిపోద్ది" అని అరుస్తూ తనుమాత్రం దిగి ఎదురుగావున్న బ్రాహ్మణకాఫీ హోటలు బెంచీమీద కూలబడి "ఓ టీ అత్రా" అన్నాడు కండక్టరు

అగ్రనటుడి చుట్టూ ఆటోగ్రాఫుకోసం మూగిన అభిమానుల్లా అతన్ని జనం చుట్టేసేరు

అలనాడు అభిమన్యుడికి పద్మవ్యూహంలోకి వెళ్ళడం తెలుసు బైటికి రావడవేఁ తెలీదు కానీ యీనాడు జగన్నాధానికి యీ పద్మవ్యూహంలోకి వెళ్ళడంకూడా తెలీదు

"టికెట్ తీసుకోండి" అంది జానకి బస్సెళ్ళిపోతుందేమోనన్న భయంతో

"ఎటి బాబూ అలానిలబడి పోనారు?" అంటూ పలకరించేడు యిందాకటి కుర్రాడు

"జనం తగ్గనీ" గొణిగేడు జగన్నాధం,

"వెనకటి కెవరో మీలాంటి ఇల్లాలే యీ కెరటాలు తగ్గితే స్నానంచేస్తాను అని సముద్రపుటొడ్డున కూర్చుందిట" మనసులోనే విసుక్కుంది జానకి

"నాను బట్టుకొస్తా ఇలాగియ్యండి" అని అభయం యిచ్చిన ఆ కుర్రాడు జగన్నాధం దగ్గర డబ్బుతీసుకొని పద్మవ్యూహంలోకి జొరబడిపోయేడు అభిమన్యుడిలా

రెండునిమిషాలు గడిచేయి.

అభిమన్యుడు రాలేదు.

మూడోనిమిషం సగం గడిచింది

"వాడా డబ్బులుతీసుకొని పారిపోలేదు కదా?" పైకే భయపడింది జానకి

"నోర్మూసుకో"

మూడోనిమిషం పూర్తయింది

"చొక్కాజేబీ సింపేసినారు ఎదవ నాకొడుకులు" అంటూ రెండు టికెట్లతో ప్రత్యక్షమయ్యేడు అభిమన్యుడు "మహాప్రసాదం' అన్నంత భక్తిగా ఆ టికెట్లని తీసుకొన్న జగన్నాధం ఓ రూపాయి వాడికివ్వబోయేడు

వాడోసారి ఆ రూపాయివేపు ఆశ్చర్యంగా చూసేడు

ఆ తరవాత చిరిగిన జేబునోసారి సరిజేసుకున్నాడు

"మంచోరే యిదోపెద్ద పనేటి?" అంటూ సిగ్గుపడిపోయి రూపాయి తీసుకోకుండానే వెళిపోయేడు

వాళ్ళ ఊళ్ళో గాస్ సిలిండర్ తెచ్చినప్పుడల్లా రూపాయి పుచ్చుకొనే గాస్ వాడు జ్ఞాపకం వచ్చేడు జానక్కి—

యిచ్చినా పుచ్చుకోలేదు వీడు

యివ్వకపోతే వూరుకోడు వాడు

ఎంత తేడా!

అంతవరకు టికట్ ఎలా దొరుకుతుందా అన్న బెంగ యిప్పుడు బస్సు ఎలా ఎక్కడం అన్న బెంగగా పెరిగింది

అప్పటికి ఆ బస్సులో వున్న జనం రెండు బస్సులకి సరిపోతారు.

కొంపతీసి టాపుమీద కూర్చోమనడు కదా!

అసలు వీళ్ళని అని ప్రయోజనంలేదు

వీళ్ళదగ్గర డబ్బుకొట్టేసి రూట్లు యిచ్చిన ఆ మహానుభావుల్ని యీ బస్సు కిందే తొక్కించం చెయ్యాలి

కాఫీతాగేసి, కారాకిల్లీ నవుల్తూ బస్సువేపు నడిచేడు కండక్టరు

జానకీ, జగన్నాథం అనుసరించేరు

"టికట్లు అయిపోయినాయి బాబూ" అన్నాడు వాడు

చూపించేడు జగన్నాథం

వెంటనే కిటికీలోంచి బుర్రపెట్టి "కుసింత సర్దుకో మామ్మా అంత సోటుంచుకొని అలా కర్రోలులా నిలబడి పోతావేటి అమ్మడూ జరుగు జరుగు ఒరే గుంటడా నువ్వా మూటమీద కూకో సూడు అమ్మన్నా నువ్వా బొట్టిడ్ని బళ్ళో కూకడుబెట్టుకో " అంటూ జనాన్ని నోటితోనే సర్దేసి వాళ్ళకి బస్సెక్కడానికి మాత్రం చోటు చూపించేడు

జగన్నాథం పక్కన నిల్చున్నావిడ

ఆవిడ

ఒంటికి బంగారం రంగుంది.
ఒంటి నిండా బంగారం వుంది.
వాల్జడలో ఎర్ర చేమంతి పువ్వుంది.
నెత్తిమీద చంద్రవంక వుంది
పక్కనే పాపిడిపిందెలున్నాయి
పాదాలకి మామిడి పిందెలున్నాయి
పాదాలపైన పట్టుపరికిణీ వుంది.
దానిపైన సిల్కువోణీ వుంది

ముద్దంటే ఏఁవిఁటి?

ఆడదాని చెంపకి మొగాడిపెదిమలు తగలడం (అట్నుంచి యిటైనాసరే)

ముద్దయితే, జగన్నాధం తనపక్కన నిల్చున్న ఆ యాభయ్యేళ్ళ రాజుల ఆడమనిషిని ముద్దు పెట్టుకుంటున్నట్టే లెక్క అంత కిక్కిరిసిపోయింది బస్సు

"లాగించీ గురూ" గావుకేక పెట్టాడు కండక్టరు

లాగించేసేడు గురుడు

"టికట్ లేనోళ్ళంతా దిగేయండి అవతల సెకింగుంది మమ్మల్నట్టుకొని కొట్లో బడేస్తే మరింక ఒగ్గించడానికే బాబూ రాడు అందులోనూ ఆ బాబున్నాడే కడుపుతోవున్న ఖడ్గమృగంలా వుంటాడు బాబుకి ఒళ్ళంతా కడుపే కడుపు నిండా ఆశే " శతకం ప్రారంభించేడు కండక్టరు

"చెక్కింగు టికట్లకేగాని ఓవర్‌లోడ్‌కి లేదేంవిఁటోయ్?" ఒకడి ధర్మ సందేహం

దగ్గర్లో ఎక్కడేనా భూకంపంగాని వచ్చిందా బస్సు అంతలా కుదిపింది? బస్సులోవున్న ఆ పసిపిల్ల ఎందుకలా కెవ్వుమంది చీమ ఏదైనా కుట్టిందా?

ఏంకాదు. కండక్టరు నవ్వేడు!

అలా ఓ ఆరు నిమషాలసేపు నవ్వేక "ఇది ఓవర్‌లోడింగా? ఇంకా నయ్యం! నూకాలమ్మ సంబరాలప్పుడు సూడు అదీ ఓవర్‌లోడింగు అదిగో ఆ ఎనకాల కంట్రాక్టరి కనకయ్యగాడి బండొస్తది సూడు అదీ ఓవర్‌లోడింగు " అని ఓవర్ లోడింగంటే ఏంవిఁటో వివరించేడు

ప్రభువు వారొస్తూంటే సలాంచేస్తున్న సేవకుల్లా తప్పుకుంటున్నాయి రోడ్డు కిటు అటువున్న చెట్లు

ప్రభువువారు అలిసిపోతే విశ్రాంతికోసం పరిచిన పచ్చతివాసీల్లా వున్నాయి అక్కడక్కడ నారుమళ్ళు

వరదటైములో నిండుగోదావరిలా తాపీగా, భారంగా వెళ్తోంది బస్సు

దగ్గర్లో ఎక్కడా గోదావరి లేకపోయినా ఎక్కడినుంచో వస్తున్న చల్లగాలి మాత్రం ఓల్డ్‌వైన్లా మత్తుగా తగుల్తోంది.

సీటుమీద కూర్చున్న పిల్లని పెట్టెమీదకి మార్చి జానక్కి కూర్చోవడానికి చోటు చూపించేడు కండక్టరు

బస్సంతా చుట్టపొగతోను, చుట్టవాసనతోను నిండిపోయి చుట్టల ఫేక్టరీలో కూర్చున్నట్టుంది జానక్కి ఖాళీ కడుపుకి చుట్టవాసన తోడై కడుపులో తిప్పేస్తోంది

జానకి పక్కన కూర్చొన్న ముసలమ్మకి అరవై ఏళ్ళుంటాయి వయసులో వున్నప్పుడు ఎంత బరువు మోసేయో కాని యిప్పుడు మాత్రం కావిడిబద్దలు దూరే టంత పెద్దవిగా ఉన్నాయి చెవులకన్నాలు

ఇప్పుడు బద్దల్లాగే వున్న భుజాలు వయసులో గుండ్రంగానే వుండేవి

కాలంలోని కడవంత కొప్పు యిప్పుడు ఊరు చిండివడియంలా వుంది.






వయసులోవున్న మంచితనం మాత్రం యింకా అలాగేవుంది

ఆవిడ నోట్లో మూరెడు చుట్టపెట్టుకొని—(నిప్పుపైపు నోట్లోవుంది) గుప్పు గుప్పున రైలింజన్లాగ పొగవదుల్తూ మధ్య మధ్య కిటికీలోంచి తుపుక్కున ఉమ్మ్తోంది

"ఏవూరు మన్దిః" పలకరించింది పక్కనున్న ఓ పాతికేళ్ళ పడుచుని, ఉమ్ములకి దమ్ములకి మధ్యలో

ఆపిల్ల పుట్టింది పల్లెటూర్లో పెరిగిందీ అక్కడే. కాపరం మాత్రం పట్నంలో. పట్నం ఆ అమ్మాయికి ఒళ్ళంతా కనిపించే నైలెక్సు చీర నేర్పింది ఆ చీరలో ముణుకులవరకే పరికిణీవుంది మెళ్ళో రూపాయి, రూపాయి పూసల దండలు చాలా రంగులున్నాయి తల్లో తట్టెడు చేమంతి పువ్వులున్నాయి

ఈ పల్లెటూరి ముసలమ్మతో తనకి మాట్లేవిఁటన్నట్టు ఆ పిల్ల జవాబు చెప్పలేదు

"ఏడకెల్లాలిః" మళ్ళీ అడిగింది పల్లె, పట్నం భేదం తెలీని ముసలమ్మ

చెప్పక తప్పలేదు

"ఏటిపని నీ మొగోడికిః"

ఆ పిల్లకి మహా చికాగ్గావుంది ముసలమ్మ యింటర్వ్యూకి.

"ఆర్పీస్లో ఉజ్జోగం "

"బావుందమ్మా బావుంది" అని పట్నంలో ఉద్యోగం చేస్తున్నందుకు

# నేషనల్ బుక్ ట్రస్టు కొత్త ప్రచురణలు

మన జాతీయ భాషల్లోని కొన్ని ఉత్తమ గ్రంథాలని యితరభాషల్లోకి అనువదించి, తద్వారా, ప్రజలలో సాంస్కృతిక, భావాత్మక ఐకమత్యం పెంపొందించటమే నేషనల్ బుక్ట్రస్ట్ ప్రచురించే అంతరభారతీయ పుస్తకమాల శీర్షిక ముఖ్యాశయం ఈ శీర్షికలో వెలువడిన ఈక్రింది పుస్తకాలని తప్పక చదివి ఆనందించండి

**మలినాంచలం.** సమకాలిక హిందీ కథా రచయిత ఫణీశ్వరనాథ్ రేణు తొలినవల బీహారులోని ఒక వెనుకబడిన గ్రామం ఈ నవలకు కధాక్షేత్రం జీవిత యదార్థాలూ, బ్రతుకు భారాలూ, ఆకలి ఆరాటాలు—ఈ సమస్యల్ని సజీవపాత్రలతో చిత్రించే గొప్ప నవల దండమూడి మహీధర్ అనువాదం

పేజీలు **400** రూ **12-75.**

**మనిషి రూపాలు.** విప్లవవాది యశ్పాల్ మన సంఘంలో ప్రబలివున్న వైరుధ్యాలనీ, తారతమ్యాలనీ కడు సమర్థతతో చిత్రించిన నవల కొండవాపి ఒక వితంతు యువతి కరుణామయ కథ దిట్టకవి రామేశం అనువాదం

పేజీలు **390** రూ **13-00**

**నీలశైలము.** ప్రఖ్యాత ఒరియా రచయిత సురేంద్రమహంతి రచించిన ఈ నవల 1969 సాహిత్య అకాడమీ బహుమతిని అందుకుంది పద్దెనిమిదో శతాబ్దపు చరిత్ర పుటలనుంచి సంగ్రహించిన ఈ నవల, జగన్నాధ మందిర వర్ణనలు, మనోరంజక ఘట్టాలు, మరపురాని పాత్రలతో నిండివుంది తాడిగడప మార్కండేశ్వరరావు అనువాదం

పేజీలు **430** రూ **13-50.**

**నవాన్న** బెంగాలీ నాటక రచయితలలో వైతాళికుడిగా ప్రసిద్ధి చెందిన బిజన భట్టాచార్య రచన రెండవ ప్రపంచ యుద్ధానంతరం బెంగాలుని పీడించిన ఘోరక్షామం ఇతివృత్తంగా గల ఈ నాటకం దర్శకుల, విమర్శకుల మన్ననలని విశేషంగా అందుకుంది వేదుల సత్యనారాయణశాస్త్రి అనువాదం

పేజీలు **116** రూ **5-75**

**అద్దం** ప్రసిద్ధ మళయాళీ రచయత కేశవదేవ్ తొలిరచన. సాంఘిక దురాచారాలనీ, శ్రామిక ధనికవర్గాలమధ్య ఘర్షణనీ, కళ్లకి కట్టినట్లు చిత్రించే కరుణామయ కథ

పేజీలు, **148** రూ **6-50.**

ముఖ్య విక్రేతలు

విక్రేత అధికారి
నేషనల్ బుక్ ట్రస్ట్,
ఎ-5 గ్రీనుపార్కు,
కొత్తఢిల్లీ-16.

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతి రోడ్డు,
సికింద్రాబాదు

మెచ్చుకుంది. ఆ తరవాత కాలుస్తున్న చుట్ట ఆర్పేసి కొంగున ముడేసింది.

"కన్నోరింటి కెళ్తన్నావేటి?"

ఔనన్నట్టు తలాడించిందా పిల్ల.

ఆ పిల్ల చెప్పింది సగమే సత్యం ఆ పిల్లపుట్టినూరూ, పాత రంకు మొగుడి దగ్గరికీ వెళ్తోంది

"అవును మరి. అల్లుడికి అత్తోరాళ, ఆడబొట్టికి కన్నోరాళ" మళ్ళీ అభినందించింది ముసిల్ది

ముసిల్దాని అభినందనకి ఆ పిల్ల మొహం కొంచెం విడింది

"ఎన్నో ఏడు బొట్టుడికి?" ఆ ముసిల్దిక్రితం జన్మలో మేస్టరై వుంటుంది జానకి

బొట్టుడు జీళ్ళుతింటూ పాకం సీటుకి రాసేస్తున్నాడు

"మొన్న సంకురేత్తిరికి మూడు జొరబడింది"

ముసలమ్మ యింకా ఏం ప్రశ్నలు వేసునో కాని యీలోగా బస్సాగింది తను దిగాల్సిన ఊరు అదేనేమో ఆ పట్నం పిల్ల చంకన పిల్లడ్ని ఎత్తుకొని, చేత్తో సంచీ తీసుకొని "ఎళ్ళొస్తానవ్వా" అని ముసలమ్మతో చెప్పి, 'టా' 'టా' సెప్పరా" అంటూ కుర్రాడిచేత "టా టా" చెప్పించింది ఆ కుర్రాడి తెలివికి చుట్టూవున్న వాళ్ళు మురిసిపోయేరు

"ఎళ్ళిరా అమ్మా ఎళ్ళు నువ్వేళ్ళేతోవ సల్లగా వుండాలి అమ్మ కడుపు సల్లంగ సుకంగా ఎళ్ళిరా" అంటూ దీవించింది ముసలమ్మ అంతలో జ్ఞాపకం వచ్చినట్టు గబగబా కొంగు ముడివిప్పి ఓ అర్ధరూపాయితీసి "ఇందరా బాబూ మిఠాయి కొనుక్కో" అంటూ ఆ పిల్లడి చేతిలో పెట్టింది

ఆ పిల్ల బస్సు దిగ్గానే ఓ డజనుమంది ఎక్కేసారు పదమూడోవాడు ఫుట్‌బోర్డుమీద ఓ కాలుపెట్టి, రెండోకాలు గాలిలోకెత్తి వామనావతారం పోజులో "యీ అడుగెక్కడ వెయ్యమంటావ్" అన్నట్లు కండక్టరువేపు చూశేడు ఎక్కడ పెట్టడమో చెప్పకపోతే బస్సు దిగేస్తాడేమో నన్నట్టు ఆ కాలు గట్టిగా పట్టుకొని "పోనీ గురూ" అని ఓ పొలికేక పెట్టేడు కండక్టరు

పోనిచ్చేసేడు గురుడు

కండక్టరు కాలు వదిలేసేడు

బలిచక్రవర్తి యింత మోసం చేస్తాడనుకోలేదు పదమూడోవాడు

అంచేత మూడో అడుక్కి బలిచక్రవర్తి బుర్ర దొరకని వామనావతారంలా గాలిలో వుంచేడు కాలు

"గజం గట్టికో పట్టుకో సామీ మద్దె దార్లో గనక యాక్సిడెంపైతే, మాపిటేలదాకా కూడుండదు పాసింజర్లకి" అంటూ పాసింజర్ల తిండి విషయం చాలా

విచారించేడు. కండక్టరు

"బాబ్బాబూ! బండాపు-దిగిపోతాను బతికుంటే మరో బండెక్కుతాను" బతిమాలేడు వామనుడు

"మద్దె స్టేజీలో బండాగదు" రూలు చెప్పేడు

ఈ వాదాపవాదాల్తో తనకేం సంబంధంలేనట్టు నిదానంగా వెళ్తోంది బస్సు

"గిద్ద పావలా అండి పేరం నాకాడ వుండదండి" అన్న వేరుశనక్కాయల వాడి గొంతుక్కి తుళ్ళిపడ్డాడు డ్రైవరు

"ఓరి సవటసన్నాసీ నువ్వుండిపోనావేట్రా?"

"ఎటి! నన్ను దిగనిచ్చినాడేటి కండక్టరు బాబు ఒకటే కుక్కడం బస్సాలో వంకాయలు కూరిపినట్టు మరిప్పుడు నాను దిగాలంటే బస్సంతా ఒంపాల్సిందే" వివరించేడు వేరుశనక్కాయలు. ఓ వైపు బేరం చేస్తూనే

మొత్తాని కెలాగైతేనేం జగన్నాథం వాళ్ళ ఊరు చేరేసరికి తొమ్మిది దాటింది డైరెక్టుగా స్వంత యింటి కెళ్ళడం యిష్టంలేదు మరంచేత చిన్నప్పటినుండీ ఫ్రెండు. ఆ వూరి డాక్టరు రాజేశ్వర్రావు యింటికి వెళ్ళేరు

## 7

"జననీ జన్మభూమీ" అన్నారుట పెద్దలు ఈ పెద్దలకేం పనున్నట్టు లేదు ఏదో ఒకటి అనడం తప్పిస్తే ఎన్నో ఏళ్ళతరవాత స్వంత ఊరెళ్ళిన సంతోషం ఆవగింజంతకూడా కలగలేదు జగన్నాథానికి అసలు సంతోషవేఁ కలగలేదు బోదకాళ్ళొచ్చిన చిన్ననాటి ప్రియురాల్ని చూసినట్టు బాధవేసింది నిజానికి ఊరు యీమధ్య కాలంలో ఊహించలేనంతగా అడ్డదిడ్డంగా పెరిగిపోయింది ఊరినిండా పైరాఫీసు. ఫేమిలీ ప్లేనింగు. జూనియర్ కాలేజీ. కమర్షియల్‌టాక్స్ ఆఫీసు. ఆడపిల్లల హైస్కూలు. ఆడవాళ్ళక్లబ్బు. వీధికొకవైన్‌షాపు. పేటకో సినిమాహాలు. ఒకటే విఁటి నానా గోత్రభ్యః వచ్చేశేయి

ఇవన్నీ విలేజ్ డెవలప్‌మెంటు దృష్ట్యా బాగానే కనిపిస్తాయి కాని ఎఁవిటో యీ అభివృద్ధి అంత ఆరోగ్యకరం అనిపించలేదు జగన్నాథానికి ఎనీమిక్ పేషెంటుకి సడన్‌గా ఒళ్ళువచ్చేస్తే. చూడ్డానికి బాగానేవుంటాడు కానీ లోపలంతా నీరే ఆ మాటే అన్నాడు అతనారోజు సాయంత్రం తనఫ్రెండు రాజేశ్వరరావుతో మాటల సందర్భంలో.

దానికి రాజేశ్వర్రావు వయసులోవున్న సెలయేరులా గలగల నవ్వేడు నవ్వడం అయిపోయేక తనకుర్చీ జగన్నాథానికి దగ్గరగా లాక్కొని "ఒరే అబ్బాయ్ నీకీ ఊరుగురించి కొంచెం చెప్పాలి. మళ్ళీ నాకు జ్ఞాపకం వుండదు టాపిక్ వచ్చింది గాబట్టి యిప్పుడే చెప్పేస్తాను. నా ఊరిగురించి నాకు చెప్పాలా అనకు అప్పటికీ ఇప్పటికీ మారనిది పేరొక్కటే మన చిన్నప్పటి ఊరుకాదు అసలు నిజం చెప్పా




లంటే ఊరేకాదు. పావుఁలపుట్ట అదృష్టవంతుడివి కాబట్టి బైటికి దాటుకున్నావు. నేను బైటికి రాలేనంతగా కూరుకుపోయేను

ఏదో స్వంతఇల్లు, కన్నతల్లి అంటారు కూటికి ఫరవాలేదుకదా అని ఆశ పడ్డాను స్వంత ఇల్లు సంతకెళ్ళింది కన్నతల్లి కాలంచేసింది క్షణం సుఖంలేదు కాణీ ఆర్జనలేదు నా నర్సింగ్‌హోమ్ చూశేవుకదా ఓహ్! వాడికేవిటండీ రోరింగ్ ప్రాక్టీసు అంటారు కానీ చూసేవూ! జనం రోరింగేకాని డబ్బుకాదు నేనెలాంటి వాడినో నీకు తెలుసు డబ్బుకోసం ఏడవటంలేదు అదేఁవిఁటో ఒక్కవెధవా మన స్ఫూర్తిగా డబ్బివ్వడు నా చాకిరీది యివ్వకపోతేపోయె. కనీసం మందు ఖరీదయినా యివ్వకపోతే మనకేం మందుల కంపెనీలున్నాయా ఊరందరికి ఉచితంగా మందులివ్వ డానికి! గోడౌన్నునిండా మందులున్నాయనుకుంటారు పూర్వంలాకాదు ఇప్పుడు మందులుకంపెనీలూ తెలివి మీరిపోయేయి ఆ రిప్రజెంటేటివ్‌గాడు వాడి అబ్బసొమ్మేదో పోయినట్టు గీపి గీపి, మూడుటాబ్లెట్లు, ముప్పయి పాంప్లెట్లు యిస్తాడు వాడిచ్చేవి మా ఆవిడ మింగటానికే చాలవు యీ నిజం ఎవరికీ తెలియదు చెపితే నమ్మరు. ఎవడూ మందు కొనడు అందరికీ సేంపిల్సు కావాలి ఎవడూ అణా విదల్చడు. అందరికీ ఉచితవైద్యం కావాలి. పోనీ నోరు, పిగ్గువిడిచి అడుగుదావంటే మనం ఈ ఊరివాళ్ళం సగంమంది వేలు విడిచిన మేనమావఁలు, కాలుపట్టుకొన్న మేనల్లుళ్ళూను మిగిలిన సగం స్నేహితులు.

డబ్బెలాగూలేదు కనీసం శరీరసౌఖ్యం వుందా అంటే చచ్చిపోవడానికూడ తీరికలేదు యు ఆర్ ఎ లకీ ఫెలో ఇష్టముంటే చేస్తావు లేకపోతే మానేస్తావు నీ హాస్పిటల్లో అంతా ఒక్కసారే చచ్చినా నీకొచ్చే పరువునష్టంగానీ డబ్బునష్టంగా!

ఏంవుండదు నీ పేషెంట్సుకి జబ్బుతగ్గినా, తగ్గకపోయినా మునిగి పోయేదేంవుండదు ఇక్కడ అలాక్కాదు వేసుకున్న మాత్ర నాలికమీదుండగానే ఒంట్లోవున్న జబ్బు తగ్గిపోవాలి లేకపోతే మనకేం చేతకానట్టే లెక్క దీనికితోడు ప్రయివేటు విజిట్సు ఈమధ్య మనూర్లో చాలామంది అకస్మాత్తుగా పెద్ద లీడర్లయిపోయేరు ఎవడింటికి రానంటే వాడికే మూడుమైళ్ళకోపం శనక్కాయలమ్ముకునే వెధవ షావుకారై పోగానే ఎక్కిళ్ళుకూడా ఎమర్జన్సీ అనుకుంటాడు

మన చిన్నప్పుడు స్కూలుదగ్గర పకోడీలమ్ముకొనే సుబ్బులు వెధవ జ్ఞాపకం వున్నాడా "

జగన్నాధం జ్ఞాపకశక్తిని ఎవరూ శంకించ నవసరంలేదు అలా శంకిస్తే అతను అవమానం ఫీల్ అవుతాడుకూడా

"చిన్నమెల్ల ఉండేదికదూ " జ్ఞాపకం చేశేడు జగన్నాధం

" ఉండేది కాబోలు వెధవకి నేనేం వాడి లవర్నా ఏఁవిఁటి కళ్ళలో కళ్ళు పెట్టి చూడ్డానికి? వాడిప్పుడు సుబ్బారావుబాబై పోయేడు 250 పౌన్ల బరువై పోయేడు. ఈ ఊరికిపెద్ద బిజినెస్ మాగ్నెట్ అయిపోయేడు రేపో ఎల్లుండో మినిష్టరయి పోయినా ఆశ్చర్యపడక్కర్లేదు "

"నువ్వీమధ్య ఏవైఁనా కిధలుగాని రాస్తున్నావేవిఁట్రా?" అడ్డొచ్చేడు జగన్నాధం అసలింతసేపు యింకొకడు చెప్తున్నది వినడమే ఆశ్చర్యం వేసింది జానక్కి

"కుళ్ళు జోకులుమాని విను " మళ్ళి ప్రారంభించేడు రాజేశ్వర్రావు " ఎలా అయ్యేడో చెప్తావిను వాడు కాలంవచ్చేక పకోడీలమ్మటం మానేసి ఓ పాక హోటలు పెట్టేడు పెట్టినవెధవ పెట్టినట్టూరుకోకుండా పక్కవీధి మిలియనీర్ముండని పట్టేశేడు ఆముండకి వీడి మెల్లకన్నే చచ్చిందో, మిరపకాయల బజ్జీలే నచ్చేయో తెలీదుకాని మరి వీడ్నివదల్లేదు, పురుగును పట్టుకొన్న బల్లిలాగ

దాంతో వీడు తపస్సుచేసిన రాక్షసుళ్ళా పెరిగేశేడు

వీధికో మందులషాపూ, మలుపుకో ముండలకంపెనీ పెట్టేసి, కంట్రాక్టరయి పోయి, ఛేర్మెన్ అయిపోయి, ఆనాటి ఐ పి వెధవ యిప్పుడు వి ఐ పి అయి కూర్చున్నాడు కాని ఏమాట కామాటే చెప్పుకోవాలి శెనక్కాయల్నాడూ నేనే వాడి డాక్టర్ని ఛేర్మెన్నాడూ నేనే

అప్పుడూ ఫీజులేదు ఇప్పుడూలేదు

భేదం ఏవిఁటంటే అప్పుడు ఏంవచ్చినా మనదగ్గరకు వాడొచ్చేవాడు ఇప్పుడు ఎం రాకపోయినా మనం వాడిదగ్గిర కెళ్ళాలి

మేడలు కట్టేగానేసరా మెంటాలిటీ లెక్కడికి పోతాయి?

మొన్నేమైందో తెలుసా? వాడికూతురు అంటే వాడిముండగారి మొదటిమొగుడి కూతురి కుక్క కడుపుతోవుందట, నన్ను పశువుల డాక్టరనుకున్నాడో ఏవిఁటో

కుక్కని చెకప్‌కి పంపిస్తానన్నాడు

"ఎవడబ్బివాడు గుర్తుకు రావడంలేదు" అన్నాడు మధ్యలో జగన్నాధం.

"మధ్యలో నన్నాపకు ఆ వెధవని తలుచుకుంటే నాకు ఒళ్ళుతెలీదు క్రితం వారం ఏవయిందో తెలుసా? ఆస్పత్రిలో చచ్చిచచ్చి మధ్యాన్నం మూడయింది పిండాకూడు కోసం కొంప చేరుకునేసరికి రాగానే "సుబ్బారావుగారు మీకోసం మూడుసార్లు ఫోన్‌చేశేరు మిమ్మల్ని రమ్మని" అంటూ మా ఆవిడ సందేశం అశ్రద్ధ చేద్దామంటే వాడికి పావుగంటకోసారి పాల్పిటేషను, అరగంటకోసారి అస్మాను, దానికి తోడు హార్టు ఎటాక్‌వచ్చి ఆర్నెల్లుకూడా కాలేదు ఈ ఆర్నెల్లలోనూ వాడిచేత పది పౌన్లు తగ్గించేసరికి, నేను వందపౌన్లు తగ్గిపోయేను ఏం ఎమర్జన్సీనోనని ఫోన్ చేద్దామంటే ఫోను చెడిపోయింది చచ్చినట్టు మండుటెండలో వాడింటికివెళ్ళిచూద్దును గదా—ముగ్గురు పెళ్ళాలూ కడుపుతో వున్నప్పటి దశరధ మహారాజులా నిండుగా వున్నాడు గాడిదకొడుకు మీదుమిక్కిలి వెళ్ళగానే పాలిటిక్స్‌లోకి దిగి నక్సలైట్ల గురించి మాట్లాడ్డం మొదలు పెట్టేడు నేనే నక్సలైటైతె ఒక్కపోటు పొడిచేద్దామను కున్నాను వెధవని, వాడు లెక్చరాపేక

"ఎందుకు రమ్మన్నారట" అన్నాను

"గేదీస్తున్నాది " అన్నాడు ఆ పుట్టబోయే దూడకి తనే తండ్రినయినంత సంతోషంగా

"పశువుల డాక్టరుకి కబురు చెయ్యండి" అంటూ లేచాను

"అబ్బే, అదికాదు జున్ను తినొచ్చునేమో అడుగుదావ(ని " నసిగేడు

ఆ అప్రాచ్యపు వెధవ జున్ను తినొచ్చునో కూడదో చెప్పడానికి, వేసంగి మిట్ట మధ్యాహ్నం మూడుగంటలకి కబురుపెట్టాలా?

వీడ్ని జున్నుతినొద్దంటే నాకోపంతీరదు అంచేత "నవి(లి ఉమ్మెయ్యండి, మింగొద్దు" అని వచ్చేశేను

వాడికదే పనిష్మెంటు

జున్ను నవి(లి మింగకుండా ఉమ్మెయ్యడం ఎంత శిక్షో ఊహించుకో

ఇంతకీ వాడి ఒక్కడ్నీ అనుకొని ఏంలాభం? ఊరంతా అలాగే వున్నారు, ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే నువ్వు ఇక్కడ నాతోసహా ఎవర్నీ నమ్మవద్దుని చెప్పడానికి మీ రీపూటకి రెష్టుతీసుకోండి రేపు ఆలోచిద్దాం ఏం చెయ్యాలో " అంటూ వెళ్ళబోయినవాడు వెనక్కి తిరిగి "అన్నట్టు ఆ ప్రకాశరావుగాడికో కబురు పెట్టు రేపు ఇల్లుచూసుకోవడానికీ, మాట్లాడ్డానికీ వస్తున్నావ(ని. నా అంచనా తప్పు కాకపోతే వాడీపాటికే ఊరు దాటెయ్యాలి" అని వెళ్ళిపోయేడు

అతని మాటలు జానక్కికూడా అర్ధం అయేయి జగన్నాధానికి సగవే( అర్ధమయ్యేయి

# 8

రాజేశ్వర్రావు అంచనా తప్పు కాలేదు

నరుడుకంట నే పడకూడదు, నాకంట నరుడు పడకూడదు అనుకుంటుందిట నాగుపాము

ప్రకాశరావు నాగుపాముకాదు

అయినా అతను నరుడు జగన్నాధం విషయంలో నాగుపాము అభిప్రాయాన్ని అనుసరించాలనుకున్నాడు

ఏదైనా సరే అనుకొన్నాక ఆలస్యం చెయ్యడం అతని పద్ధతికాదు అంచేత ఆలశ్యం చెయ్యకుండా అత్తారింటి కెళ్ళిపోయేడు, జగన్నాధం ఊర్నించి వెళిపోయేక కబురు చెయ్యమని పెళ్ళాంతో చెప్పి

మర్నాడు పొద్దున్న

ఈ సంగతి తెలిసిన జగన్నాధం పైకి చికాగ్గా కనిపించినా, లోపల్లోపల సంతోషించేడు

రాజేశ్వర్రావు మాత్రం చిందులు తొక్కేడు

"డబ్బు తీసీడం అనుకున్నాదేఁవిఁటి రాస్కెల్ ఎదుటపడ్డం అంటే మొహం చెల్లొద్దూ నీ మాటెలావున్నా నేను మాత్రం డెట్టాల్ వేసి కడిగేసేవాణ్ని దొరికితే, మీన్ ఫెలో కనీసం ఎదుటపడి "సారీరా బ్రదర్ బుద్ధి డబ్బతింది క్షమించు" అని వుంటే వాడి నిజాయితీకి మెచ్చుకునేవాడిని తప్పుడుపన్లు చెయ్యడానికీ, వెధవ్వేషాలు వెయ్యడానికీ కలేజా వుండాలి పిరికి వెధవలు వెధవపన్లు చెయ్యకూడదు " అంటూ అరగంట తిట్టేడు.

"మరింక వాడు లేకపోతే నేనెందుకు జానకీ నువ్వేవెళ్ళి ఆ ఇంద్రభవనాన్ని చూసేసిరా" అంటున్న జగన్నాధాన్ని ఏ భాషలో తిట్టాలో తెలీలేదు రాజేశ్వర్రావుకి

బిక్కమొహం వేసుకున్న జానకిని చూస్తే జాలేసింది

"సిగ్గులేదురా నీకు ఆ మాట అనడానికి? నువ్వు దంపు నేను భుజాలెగరేస్తాను అందిట నీలాంటిదే ఖర్చులు దండగ కాకపోతే నువ్వెందుకొచ్చినట్టు?"

"నేనేం చెయ్యనన్న కండిషను మీదేవచ్చేను" డిఫెండు చేసుకున్నాడు జగన్నాధం

"కండిషనూలేదు కాకరకాయాలేదు నీ ఇల్లునువ్వు చూసుకోవడానికి వాళ్ళ పర్మిషను అనవసరం ఆ హీరోగాడే వుండాలా? వాళ్ళవాళ్ళతో చెప్పు" అంటూ జగన్నాధాన్ని లేపి తగిలేడు

జగన్నాధ రథం కదలక తప్పలేదు

"మేవేం యుద్ధానికి వెళ్తున్నావాఁ ఏఁవిఁటి? వీడుకూడా ఎందుకూ," అన్న జగన్నాధాం సణుగుడు లక్ష్యపెట్టకుండా, వాళ్ళింట్లోని బంట్రోతు అప్పికొండని తోడు యిచ్చేడు రాజేశ్వర్రావు (సశేషం)

# తీ ఎ రొమన్

## నెల్లుట్ల నరసింహారావు

ఇది విన్నావా?' అంటూ ప్రవేశించాడు శ్రీపతి నా ఇంట్లోకి - పొద్దున్నే తన ముఖంలోని ఆరాటాన్ని కప్పిపుచ్చుకోవ డానికి ప్రయత్నించేస్తూ.

ఆరోజు శెలవు కావడం మూలాన తాపీగా సిగరెట్టుముట్టించి నేను దినపత్రిక తిరగేస్తూ తలెత్తి అన్నాను 'ఏదీ ఇంకా నువ్ చెప్పందే—' కుర్చీ గుంజుకుని దగ్గిరగా కూర్చుంటూ - 'రంగనాథంగారి రెండో అమ్మాయి రహమాన్‌తో లేచి పోయిందట' అన్నాడు శ్రీపతి.

'రంగనాథం గారి అమ్మాయా? యే రంగ నాథం? శ్రీపతి చెప్ప బోయేది అబద్ధం' అయి వుంటే బావుండనే ఆశతో అన్నాను-కొంత అనుమానంతోనే.

'అదే-డాక్టర్ రంగ నాథం-నీ సాహితీ మిత్రుడు'.

'ఏంటేంటి కాస్త సవిస్తరంగా ఏడువ్వా' చనువుతో. దుర్వార్తవిన్న అసహనంతో ఆతురత కనబర్చా నేను.

'డా॥రంగనాథం రెండో కూతురు వనజ గురువుగారయిన కాలేజీ లెక్చరర్ రహమాన్‌తో నిన్నరాత్రి చెప్పాపెట్టకుండా లేచిపోయింది.'

'నమ్మకమేవిటీ - ఇంకెక్కడైనా వేరేపని మీదెళ్లుండొచ్చుగా' అన్నాను.

'ఆధారంలేందే ఈశ్రీపతేదీ చెప్పడని మరోసారి గుర్తుచేస్తున్నాను-వనజ పోతూ పోతూ తండ్రికో వుత్తరం రాసిపెట్టి మరీ వెళ్ళింది - అయినా వాళ్ళది మాయింటి పక్కిల్లేగా?' తనమాట నిరూపించుకునే ఉద్దేశం శ్రీపతిది.

* * *



అదొ చిన్నటౌను - ఆనాటికి అంటే షాతికేళ్ళకి పూర్వం అన్నమాట-ఇప్పుడు కాసింత పెద్ద టౌనే అయిందిలెండి-మా వూరునుంచి బయలుదేరి బస్సులో వస్తూ పోతూ సెంటర్లో రోడ్డుప్రక్క సైన్ బోర్డు చదువుతుండేవాడిని,' డాక్టర్ రంగ నాథం. M B B S ' అని ఉండబట్ట లేక ఓరోజు మానాన్న నడిగాను M B B S అంటే ఏవిటని-'అదోపెద్ద వైద్యం చదువులే' అన్నాడు నాన్న అప్పట్నించీ ఆమాటే నాలో బాగా నాటుకుపోయింది— పెద్ద వైద్యం చదువుఅని అవుతే నేను చదువుకునే రోజుల్లో డిగ్రీలూ వాటి విలు వలూ తెల్సుకునేపాటి పరిజ్ఞానం వచ్చేనా టికి ఆ M B B S ఎంతపెద్ద చదువో తెల్సొచ్చింది ఎప్పుడు బస్సులో ప్రయా ణం చేయాల్సొచ్చినా ఆటౌను మీదుగానే గనుక 'రంగనాథం M B B S ' అనే మాటలు నాలో బాగా ముద్రవేసుకున్నాయ్ అడపా దడపా ఆ క్లినిక్‌లో మెళ్ళో స్టెత స్కోపుతో ఆ రంగనాథం అనబడేవ్యక్తి కనుపించేవాడు గూడా

నేనెవరో రంగనాథానికి తెలియకున్నా రంగనాథానికి మాత్రం నేనేకలవ్య శిష్యు ణ్నయిపోయి - ఏనాటికయినా ఆ చదువు చదివి అంతటివాడ్నికావాలనుకునే వాడ్ని వయసుతోపాటే ఆ కోరికా పెరుగుతూ వచ్చింది

కోరింది కోరినట్లుగా జరిగేట్టయితే సమాజం ఈ రూపంలో ఎందుకుంటుంది? భగవంతుడనేవాడు మాటిమాటికీ ఎందుకు జ్ఞాపకం వస్తాడు?

ఎలాగయితేనేం చచ్చీచెడి డిగ్రీ చేత బుచ్చుకుని టీచర్ ట్రైనింగ్ అయ్యేసరికి నాకు తాతలు దిగొచ్చారు-యాదృచ్ఛికంగా అదే టౌన్‌లో పోస్టింగ్ ఇచ్చారు గౌరవ నీయ గవర్నమెంటువారు

మధ్యతరగతి కుటుంబాల్లొ ఒకవ్యక్తి ఉద్యోగంలో ప్రవేశించాడూ అంటే జీవితం రొంపిలో కాలుబెట్టాడనే అర్థం-అందులో కాలుబెట్టాడూఅంటే ఆశయాల సమాధికి పునాదులు వేస్తున్నాడనే అర్థం, సంఘంలో సామాన్యుడుగా నేను ఈ ఫార్మాలిటీస్‌కి అతీతుడ్ని కాలేకపోయాను

ప్రతి మనిషీ ఏదోఒక రకంగా బ్రతు కుతూనే వుంటాడు ఆజీవన విధాన ములో తనకున్న పరిధిలోనే బ్రతుక్కి ఓ పరమార్థం నిశ్చయించుకుంటాడు— అసంతృప్తి పడ్డవాడూ ఆశల్ని పెంచుకున్న వాడూ శక్తియుక్తులున్నవాడూ మాత్రం ఒకేరకంగా సాగిపోకుండా ఎప్పటి కప్పుడు మారుతూ-ఆత్మవిశ్వాసంతో తన పరిస్థితులను మార్చుకుంటూ ముందుకు సాగిపోతాడు—అక్కరకొస్తే ప్రగతీ— లేకుంటే దానిపేరే అధోగతి

నేనూ నా అభిరుచులకీ స్థాయికీ తగి నట్టుగా ఆటౌన్‌లో ఓ సర్కిల్ ఏర్పరచు కున్నాను-అందులో ఎక్కువమందీ సమ కాలీన సాహిత్యంతో సంపర్కమూ అభి రుచీ వున్నవారే-అలాంటి రెక్కలే గలి గిన పక్షుల్లో రంగనాథంగారు ఒకరు

* * *

అంతవరకూ వృత్తిరీత్యా ఎన్నడూ ఏర్పడని అవసరం డా రంగనాథం గారితో ఆరోజేర్పడింది-ఒళ్ళు కొంచెం సుస్తీగా వుండటం మూలాన

'రండి మేష్టారూ - రండి' అంటూ సాదరంగా ఆహ్వానించారు

నమస్కరించి ఎదురుగావున్న కుర్చీలో కూర్చుని క్లినికంతా కలియజూశాను— కంపౌండర్ కుర్రవాడు తప్ప యెవరూ లేరు

'ఊ ( చెప్పండి' అన్నాడు డాక్టరు గారు గొంతు సవరించుకుంటూ

'తలనొప్పి - కొంచెం టెంపరేచర్ గూడా వస్తోంది ' నా రోగలక్షణాలన్నీ ఏకరువు బెట్టబోయాను

'అదిగాదండి బాబూ-మీ రచనా వ్యాసంగం ఎంతవరకొచ్చిందీ — ఈమధ్య నేమైం రాశారూ-అదిజెప్పండి-' అన్నారు రంగనాధంగారు మధ్యలోనే కల్పించుకుని చేతిలోవున్న మాపె నవల ది రేజర్స్ ఎడ్జ్ రాక్ లో సర్దుతూ

ఈయనతో ఇదేచిక్కు - పేషెంట్ల గురించి ఎక్కువగాపట్టించుకోడు సరిగదా! ఎవడయినా ఎరిగున్న తెల్లబట్టలవాడయితే సాహిత్య రోగం అంటించి మరీ వదులుతాడు

'అబ్బే ఈమధ్యనేం రాయలేదండీ' అన్నాను ఇబ్బందిగా మొఖంపెట్టి

'సామ్యూల్ రెండు స్ట్రాంగ్ టీ పట్టించుకురా' అని కంపౌండరుకు పురమాయించి నావేపు దిరిగి—మందులూ— మందులూ-అంటారుగానీ మేష్టారూ చాయ్ మాత్రం సర్వరోగ నివారిణి అంటాన్నేను-రంగనాధంగారు ధోరణిమారుస్తూ అన్నారు

చాయ్ తాగింతరువాత చర్చ కోకొల్లలుగా వస్తున్న స్త్రీల రచనల గురిచీ— ఆధునిక సాహిత్యం తీరుతెన్నుల గురించి వద్దెర చండీదాసు 'హిమజ్వాల' గురించీ ఒక్కమాటలో చెప్పాలంటే 'నా ఆరోగ్యం గురించి తప్ప' చాలా చాలా విషయాలమీద రెండు గంటలసేపూ నిర్విరామ చర్చసాగింది

చివరికి మీకేం జబ్బులేదూ—వక్కపూట వుపవాసం చేస్తే చాలనే సలహా ఇచ్చి పంపించారు రంగనాథంగారు నన్ను

* * *

క్లినిక్ నుంచి బయటికొచ్చినా నా ఆలోచనలన్నీ రంగనాధంగారిచుట్టే తిరుగుతున్నాయ్ పాతికేళ్ళబట్టేను-అంటే నాబుద్ధి తెలిసినప్పట్నించీ చూస్తూన్నా-అదే అద్దె క్లినికూ—అదే వ్యవహారం—అదే అవతారం తనుంటున్న ఇల్లుగూడా అద్దె కొంపే అని తరువాత తెల్సింది

మొదట్లో ఏం సంపాదించాడో ఏమో గాని - ఈ అయిదారేళ్ళబట్టీ చూస్తున్నా ఎడగూ బొదుగూలేని ప్రాక్టీసుతో-బొటాబొటీగా తిండికి సరిపోయేదే మహాకష్టం అనిపిస్తుంది-పైగా గంపెడు సంసారం అందులో నిప్పులు గడుక్కునే బాపత్తు శుద్ధశ్రోత్రియ కుటుంబం

పాతికేళ్ళ క్రిందటే అంత చదువు చదివినవాడు ఈ కాలం రేట్లప్రకారమైనా కనీసం పదిలక్షలు సంపాదించాల్సిందె-అది వేలల్లోనైనా వుంటుందనుకునే పాటు ధైర్యంకూడా నాకులేదు

అసలు రంగనాధంగారు వైద్యవృత్తినే ఎందుకు ఎన్నుకున్నారో అర్థం కాదు ఒక రకంగా ఆలోచిస్తే వైద్య

వ్యతిరేక ప్రచారం చేస్తున్నట్టనిపిస్తా రాయన

నీకేం రోగంలేదు—

ఉపవాసముంటే తగ్గుతుంది—

శొంటి మిరియాల చారువాడు పోతుంది—

పెన్సిలిన్ పదేపదే వాడటం హానికరం—

ఆస్పిరిన్ వాడితే గుండె జబ్బులొస్తాయి—

శరీరాన్ని మందులకు అలవాటు చేయవద్దు—

తప్పని సరయితే తప్ప యింజెక్షన్ వాడొద్దు-లాంటి ఉచిత సలహాలిస్తాడు నాడిబట్టుకు చూసే వృత్తైనా-ప్రజలనాడికి అనుగుణంగా పైసలు సంపాదించేమార్గం వెతకడు-ఎప్పుడూ ఏదో ఓ పుస్తకం చదువుతూంటాడు-అందులో తనకు నచ్చినదేదయినావుంటే నాలాంటివాడికి చెప్తేగాని తృప్తిపడడు

డాక్టరుగారు జ్ఞాపకమొచ్చినప్పుడల్లా నన్నో విషయం వేధిస్తుంది ఎటుదిరిగీ అవసరాల్ని కనుక్కోడానికి, ఆశయాల్ని అమలుపర్చుకోవడానికీ నాబోటి తాలు నౌకరీగాళ్ళకి అవకాశం లేదాయె—మరి అన్నీవుండి ఆర్థిక ఇబ్బందులు బడుతూ వయస్సు మీరిపోతున్నా ఈనకి డబ్బు కాంక్ష లేదేమిటి? అని

ఏదో ఒకసమయంలో లక్ష్మీదేవి ప్రతివాడింటి తలుపూ తడుతుందట - ఆ సమయానికి తలుపు తెరచి ఆహ్వానించితే తరింపజేస్తుంది-ఇంట్లో లేకనో తలుపు తెరవకనోపోతే ఆఇల్లు దాటవేసిపోతుంది మరి అల్లాంటి మహదవకాశం ప్రతివాడి జీవితంలో ఏదో ఓ లిప్తమాత్రంలోనే ఉంటుంది అదృష్టానికీ దురదృష్టానికి అడుగుదూరమే తేడా అని ఎక్కడో చదివాను అది గుర్తుకొస్తుందీ డాక్టరుగారి విషయంలో

దీన్ని గురించే ఆలోచించుకుంటూ నడుస్తున్న నన్ను రోడ్డుమలుపులో ఎదురుగా విశాలమైన కాంపౌండులో వున్న పచ్చమేడ ఆకర్షించింది-ఇదివర్లో ఎన్నో మార్లు దాన్నిచూస్తూనే వుండినప్పటికీ ఈరోజు ఎందుకో కొత్తగా అనిపించింది రంగనాథంగారి గురించే ఆలోచిస్తూ వైద్యవృత్తీ-డబ్బు సంపాదన-చిట్కాలు అదృష్టం మొదలైనవాటిమీద డాక్టరేటుకు సరిపోయేంత శోధనలోవున్న నేను ఆ మేడ నివ్వాళో కొత్త కోణంలోంచి నూతన దృక్పథంతో చూడగలిగానేమో! కొట్టవచ్చినట్టుగా గేటుకు ఓ నల్లబల్లంత బోర్డు వ్రేలాడగట్టబడివుంది 'డా వెంకటయ్య, ఆర్.ఎం పి, వైద్యవిద్వాన్ భిషగ్వర చింతామణి', ఇచ్చట సమస్తవ్యాధులకూ గ్యారంటీగా చికిత్స చేయిబడును' అనే అక్షరాలతో మెరసిపోతూ

నాకేదో జబ్బుందనే అనుమానంతో రంగనాథంగార్ని చూడబోతే 'జబ్బేంలేదు' పొమ్మన్నాడుగాని నాఅనుమానం నివృత్తిగాలేదు-ఏదో వుండవచ్చుననే భయం పీడిస్తూనే వుంది-ఎందుకయినా మంచిదని వెంకటయ్యగారిఆస్పత్రిలో ప్రవేశించాను. ముందుహాలే గాకుండా వరండాగూడా జనంతో కిక్కిరిసివుంది. రెండుగంటలు తరువాతగాని డాక్టరుగారి దగ్గరకెళ్ళేవంతు రాలేదు




నమస్కరిస్తూ డాక్టరుగార్కి నన్ను నేను పరిచయం చేసుకున్నాను నోట్లు లెక్కబెట్టుకుంటూ వంచిన తలెత్తకుండానే 'ఉఁ ' అని తనపనిలో నిమగ్న మయ్యారు సదరు వెంకటయ్యగారు

పెద్దటేబులూ దానిమీద మడతవిప్పని ఓ నాల్గయిదు ఇంగ్లీషు, తెలుగూ ఉర్దూ దినపత్రికలూ, ట్రేలో స్టెతస్కోపూ, బి పి అపరేటసూ వున్నాయి సీలింగ్ ఫ్యాన్ నిర్విరామంగా తిరుగుతుంది, ఓ అయిదు నిమిషాల తరువాత నామీద అనుగ్రహం కలిగింది గాబోలు—

'ఏంటయ్యా పంతులూ ఏం సంగతి' అన్నారు డాక్టరుగారు నన్నుద్దేశించి రివాల్వింగ్ ఛేర్‌లో పైమూలగా తిరిగి విలాసంగా.

నా అనారోగ్య లక్షణాలు ఏకరువు బెట్టాను నన్ను తన దగ్గరగా రమ్మని ఛాతీ, పొట్టా వీపూ కంటిరెప్పలూ, నాలుకా నాడీ అన్నీ చూశాడు తిరిగి నన్ను కూచోమని సావకాశంగా ప్రశ్నించసాగాడు

'సిగరెట్లు కాలుస్తావా?'

'ఆఁ కాలుస్తాను'

'సరే! ఆకలి ఎలావుంటుందీ?'

'పెద్దగా ఆకలనిపించదు-ఏదో వేళకు యాంత్రికంగా తినడవే తప్ప '

'మూత్రమెలా వస్తుందీ?'

'ఉదయమూ, సాయంత్రమూ కాస్త పచ్చగనే వుంటుంది'

'తలనొప్పిగా గానీ, భారంగా గానీ వుంటుంది గదూ!'

'ఆఁ అవునండీ వుంటుంది-పైగా దినంలో ఎక్కువ కాలమూ నీరసంగా వుంటుంది'

'ఆఁ ఆఁ నేనను కుంటూనే

వున్నాను' రోగనిర్ధారణ జరిగిపోయినందట్టుగా.

'ఏం జబ్బయ్యుంటుందండీ' ఆతృత నణచుకోలేక ప్రాణంమీది తీపితో అడిగాను.

'చూడు పంతులూ-నీ వయస్సెంతుం దేవిటీ' అన్నాడు చుట్టముట్టిస్తూ ధోరణి మార్చి-

'ముప్పయ్యొక్క-టెళ్ళాయండీ'

'సరిగ్గా వైద్యవృత్తిలో నా సర్వీసూ అంతే'-పొగవదల సాగాడు (యిలాగే యింకెందరితో అన్నాడోమరి) చూడూ! విద్యార్థికి గురువుమీద గురివుంటే పాఠం ఎలా బోధపడుతుందో-రోగికి కూడా వైద్యుడిమీద అలాగవుంటేనే రోగం బాగవుతుంది - ఇది నా అనుభవంమీద మాటనుకో'బహుగంభీరంగా ధ్వనించింది కంఠం—వెంకటయ్యగారిది.

"సరేనండీ నిజవేఁ" నాన్చుతూ—నాలో నేననుకున్నాను ఇదేదో దీర్ఘోపన్యాసానికి ఉపోద్ఘాతమని.

"అయితే చూడూ! నామీద నమ్మకముంటే-నాదగ్గిరే వైద్యం చేయించుకునే వాడివైతే నేన్నీ రోగం ఏమిటో చెబుతాను-ఏవంటావ్?''

"సరేనండీ" ఉచ్చులో చిక్కిపోతున్నానురా భగవంతుడా అనుకుంటూ—మొహమాటం తెచ్చిపెట్టిన ఇబ్బందితో.

"ఏదీ ఓ అయిదు రూపాయల ఫీజు ఇలా ఇవ్వు" నిర్మొహమాటంగా అన్నాడు.

అవును మరి ఆహారం దగ్గిరా వ్యవహారం దగ్గిరా మొహమాటం పనికి రాదనేగా పెద్దలనేది.

జేబులో వున్న ఒక్కగానొక్క పది నోటిస్తూంటే-పులినోట్లో తలదూరుస్తున్నాననే భావన లీలగా నాలో చోటు జేసుకుంది.

మిగతా అయిదు రూపాయలు తిరిగి నాకిస్తూ-"చూడు పంతులూ ఆర్థికఇబ్బందులందరికీ వుంటాయ్—నేన్చెప్పేది బాగా విను-ఓ వారం రోజుల్లో జబ్బు నయం చేస్తాను. మందులూ అవీ మాత్రం తెచ్చుకో-ఇక నాఫీజు విషయం అంటావా! నీజీతం అందుకున్నాకే ఇద్దువులే—నేనేం మిగతా వాళ్ళలాగా డబ్బుకు కక్కుర్తిపడే రకంగాదు-అయినా ప్రాణం ముఖ్యం గాని పైస శాశ్వతమా పంతులూ! అశ్రద్ధ చేయకేం ఇప్పుడిప్పుడే క్షయ వ్యాధి లక్షణాలు ప్రారంభమయ్యాయ్ - ప్రాణాలతో పని సుమా! వెనక ముందాడి పిల్లలకు అన్యాయం జేయకు" అంటూ ఓ గజంన్నర ప్రిస్కిప్షనిచ్చాడు-మందులు కొనుక్కొచ్చుకుంటే వాడే విధానం చెబుతాననే షరతు విధిస్తూ.

నమస్కరించి ఈవలికొస్తూ అనుకున్నాను "వైద్యో నారాయణో హరీ" గదా అని ఓ పదిహేను రోజుల తరువాత డెబ్భైఅయిదు రూపాయల ఖరీదుతో నా సోకాల్డు జబ్బు కుదిరింది-అలాగే నాతిక్క గూడాను.

చాలా రోజులుగా రంగనాథంగార్ని కలవక పోవడంతో కాళ్ళు అటే లాక్కెడితే తీరుబాటుగా క్లినిక్‌లో కూర్చుని డాక్టరుగారితో బాతాఖానీ వేస్తున్నాను. (నా అనారోగ్యం వెంకటయ్యగారి ట్రీట్

మెంటుల ప్రస్తావన రాకుండా జాగ్రత్త పడతూ)

ఇంతలో ఓ పల్లెటూరి నడి వయస్కుడు ప్రవేశించాడు. గొంగళీ. నెత్తికి రుమాలూ, రెండు బారల చేతికర్ర ధరించి, నోట్లోని చుట్టను గుమ్మంలోనే గిరవాటేసి తుపుక్కున ఉమ్మేసుకుంటూ

అతనివేపు సాభిప్రాయంగా చూశారు రంగనాధంగారు సంగతేమిటన్నట్లు "దాని మొదలార పదొద్దుల్నించి పానం నవ లేత్తాంద్రుండి—ఒల్లంత ఒకటే తీపులు. సలసల కూకోనీయదు. నిలబడనీయదు—ఒక్క గాసైన ఇంజిసనియ్యద్రి—దెబ్బకే పోవాల్నద్రి రోగం దీనియవ్వ—" ఏక బిగిని దంచేశాడు రంగనాధంగారి మనస్తత్వానికి సెల్ఫ ప్రిస్కిప్షన్ నిచ్చుకునే పేషంట్లంటే మహా చిరాకు—

"ఎన్కటికోపాలి గిట్లనే ఒత్తె మా వూరి వొయిద్దుడు "అది" త్తెనే కత్వయింద్రి మల్లగదే ఇత్తిరా ఇక పోకేం శేసుద్ది" అతని ధోరణి సాగిపోతూనే వుంది

"ఏదీ ఇలా దగ్గరికిరా! నన్ను పరీక్షించనీ అసలు జబ్బేంటో" అసహనంగా అన్నారు రంగనాధంగారు

"జబ్బు దేవుండుండి—నేజెప్పిన గాసైన సూదియ్యద్రి ఎంతకర్సయినా బెట్టుకుండగాని "

"ఘాసైన సూదీ ఘాసైన సూదీ అని నీ ముచ్చట నువ్వే అయితే నాదగ్గిరకెందుకూ రావడం-అదేదో నువ్వే కొనుక్కొచ్చుకుంటే ఏ తలమాసిన వాడైనా సూదిస్తాడు" అతన్ని పరీక్షచేస్తూనే విసుగుదల ప్రదర్శించారు డాక్టరుగారు

ఎందుకో వుండబట్టలేక నేను కల్పించుకుని "డాక్టరుగారూ బహుశ! ఇంట్రా వీనస్ కాల్షియం ఇంజక్షనయ్యుండొచ్చు" అన్నాను

"దీనికి ఇంట్రా వీనసెందుకండి బాబూ, ఇదేదో "ఫ్లూ" లాగుంది" అంటూ నావంక చూశారు రంగనాధంగారు

"ఆఁ గదే ఆ బాబు చెప్పిందే రైటు-అసుంటి సూది త్తె ఇయ్యి లేకుంటె లేదెహే" దురుసుగా అన్నాడు ఆ ఆసామి

"చూడు నాయనా నువ్వు చెప్పిన మందే నేనివ్వను—ఒకవేళ గనుక నీకు అదే కావాలనుకుంటే ఇచ్చేవాళ్ళీవూళ్ళో చాలామందున్నారు—వెళ్ళు" తాపీగా వదిలించుకునే ధోరణిలో సలహా ఇచ్చారు

విసురుగా ఆ ఆసామీ వెళ్ళిపోనే పోయాడు—

నిర్లిప్తంగా నవ్వారు డాక్టరుగారు—"చూడండి మాస్టారూ అతను చెప్పిన ఇంజక్షనే ఇచ్చి ఏవో నాలుగు గోళీలూ ఓ టానికూ రాసి పదోపాతికో లాగితే సంతోషంగా ఇచ్చిపోతారు—ఆ సంగతి నేనూ గ్రహించగలను-కాని పేషంటును అమాయకుడిని చేసో లేకపోతే ఏదో పేద్ద జబ్బుందని అదరగొట్టో డబ్బుల్లాగడం కన్న ఆత్మహత్య మేలంటాను-ఇందులో ఏం న్యాయముంటుంది చెప్పండి? డాక్టరూ మందుల కొట్టువాడూ బతికి పేషంటును దెబ్బ తినిపించడం తప్ప!

ఈ మాటలు నాకుగూడా తగిలాయ్! "అది తప్పే కాదన్ను కానీ మీ దగ్గరి

కొచ్చినవాడిన తిప్పికొట్టకుండా న్యాయం గానే నచ్చజెప్పి మీరూ స్థాయికి తగి నట్టుగా ఎంతోకొంత ఫీజు ఛార్జ్ చేయొ చ్చుగా" డాక్టరుగారికీ నాకూ వున్న చను వుతో సూచించాను

"అవునండీ-ఒకళ్ళేమో ఏమీలేకున్నా ఏదోవుందనే మానసిక బలహీనతతో వస్తారు, కొందరేమో మిడిమిడి జ్ఞానంతో తమకే మందుకావాల్నో తామే నిర్ణయించు కుని వస్తారు సూది స్తే తప్ప రోగం తగ్గదనే సూపర్‌స్టిషన్ గలవాళ్లు కొందరు- ఇలాంటి వాళ్ళదగ్గర డబ్బుల్లాగి—మాన వత్వంమీదా, భగవంతుడిమీదా విశ్వాస మున్న వాడెవ్వడూ ఆత్మవంచన చేసుకుని డబ్బుల్లాగొద్దనేది నా ఫిలాసఫీ "

"మీ ఫిలానఫీ మెచ్చదగిందే కాని మారుతున్న కాలంతోపాటు పెరుగుతున్న జీవన ప్రమాణంతోబాటు — పొజిషన్ మెయింటెయిన్ చెయ్యాలన్నా-కోరికలు తీర్చుకోవాలన్నా కావాల్సిందొక్క- డబ్బే నన్న నగ్నసత్యం మీకు తెలియంది కాదు గదా!"

"పొజిషనూ, కోరికలూ అనే మాట లకో పరిమితి లేదుగదా మాస్టారూ! పెంచినకొద్దీ పెరుగుతాయి, తగ్గిస్తే తల వంచుకుంటాయి-హ్యూమన్ వ్యాల్యూస్ (Human values) తెలియని ఈ సమాజంలో మీరు చెప్పేలాంటి జీవితమే గనక మానవుడికి పరమార్థమయితే— అలాంటిది నాకొద్దు" హర్ట్ అయినట్టు న్నారు రంగనాధంగారు

"గొంగట్లో తినుకుంటూ అనే సామెత ఇక్కడ గుర్తుచేయాల్సొస్తుం దేమో" అన్నాన్నేను—ఎంతసేపు వాదిం చినా డాక్టరుగారు నా దారిలోకి వచ్చే అవకాశం కనిపించకపోయినా — చివరి ప్రయత్నంగా

"చూడండి డాక్టరుగారూ మీమట్టుకు మీరైతే కోరికలను చంపుకోవచ్చు మాన వత్వం పేరిట మమకారాల్ని పెంచుకుని ఆడంబరాల్ని తగ్గించుకోవచ్చు కాని ఉదా హరణకు మీ కుటుంబాన్నే తీసుకుందాం- ఈ తరంలో పుట్టి ఇరవయ్యో శతాబ్దపు స్వేచ్ఛావాయువుల్ని పీలుస్తున్న మీపిల్లల దృక్పధాన్ని శాసించగలరా? మారుతున్న యువతరంతోపాటు వాళ్ళూ మారకుండా మడిగట్టుక్కూర్చోమంటారా?''

"అనను-శాసించను గూడా-నా అభి ప్రాయాలతో ఎడ్యుకేట్ మాత్రమే చేయ డానికి ప్రయత్నించగలను-ఆపైన ఎవరి మార్గం వారిది—రెక్కలొచ్చిన పక్షుల్ని ఎత్తుకు తిరగాల్సిన అవసరం లేదుగదా" నిర్లిప్తంగా అన్నారు డాక్టర్

ఈ చర్చ ఇప్పట్లో తేలేది కాదనుకుని సెలవుతీసుకుని బయటపడ్డాను యధా లాపంగా బాటవెంట నడుస్తూవుంటే డా వెంకటయ్యగారి బంగళావేపు దృష్టి పోయింది-అదేవ్యక్తి అంటే రంగనాథం గారితో గాబైన సూదివ్వమన్న వ్యక్తి చేతిలో ఓ కాగితంతో గేటు తోసుకుని బయటికొస్తున్నాడు

ఆంగ్జయిటీ నాపుకోలేక చప్పట్లు చరచి పిలిచాను—

"ఈ డాట్టరుబాబు దేవుడుండీ అడి గిన సూది యెంటనే ఇచ్చిండు—ఇప్పుడు కాస పానం కుదురుతుంది—ఇంకిన్ని




మందులు గూడ రాపి ఇంటికాడ ఏస్కొ-మన్నాడు పదిరూపాయలుపోతె మానెగాని రొండు నివుసాల్ల పనైంది ఇంక మా వూరు బోత" అని చెప్పాడు ముఖంలో తృప్తి వెలిగిపోతుండగా

వృత్తిరీత్యా ఒకటే అయినప్పటికీ ప్రవృత్తుల్లో తేడాలున్న రంగనాధంగారినీ వెంకటయ్యగారినీ బేరీజు వేసుకుంటూ—ద్వంద్వంలో కొట్టు మిట్టాడుతూ—ఏది మంచీ-ఏది చెడూ-ఏది సత్యం-ఏది నిత్యం అనేది తేలక ఆలోచిస్తూనే ఇంటికి చేరుకున్నాను.

కాలచక్రం ఎవరికోసం ఎప్పుడూ ఆగదు-ఇప్పుడు గూడా ఆగలేదు ఎప్పటిలాగే ఆరాత్రి గూడా తెల్లవారింది కాని వనజ లేచిపోయిందని శ్రీపతి మోసుకొచ్చిన వార్తవిని నేను మాత్రం స్థంభించిపోయాను

ఎదిగిన పిల్లల పెళ్ళిళ్ళు చేయలేకా—

నిరుద్యోగులైన కొడుకులకు ఏదో ఓ దారి చూపించనూ లేక—

ఆదర్శాలను బట్టుకుని వ్రేళ్లాడిన రంగనాధంగారికి ఇది నిజంగా పరాజయమనే నా భావం

మరయితే మానవుడికి మంచితనమూ-ఆశయాలూ వుండడమే తప్పా?

కాకుంటే సమాజం ఎటువైపు పయనిస్తున్నట్టు?

ఏదీ తేల్చుకోలేని ద్వైదీ భావంతో కొట్టు మిట్టాడ సాగింది మనస్సు

నాముందు నిలిచింది ఒకే ఒక ప్రశ్న "టుబీ ఆర్ నాట్ టుబీ"—

* * *

రోజులు సర్వసాధారణంగా గడిచి

పోతున్నాయ్-సామాన్యుడికి అంతకంటే ఇంకెలా గడుస్తాయి—అల్లా గడవడం గూడా ఓ గొప్ప విషయమే మరి!

ఆ సంఘటన జరిగిన తరువాత ఇక రంగనాథంగారి దగ్గరకు పోబుద్ధిగాలేదు

అయితే అందులో వేరే దురభిప్రాయం మాత్రం ఏంలేదు బాధలను చూడగానే అనుభవించగలను గాని ముఖాముఖి పంచు కునే ధైర్యం నాకు లేకపోవడమే తప్ప-రంగనాథంగారి గురించీ, ఆయన కూతురు చేసినపని గురించీ ఏదో విపరీతంగా అసహజమైనదిగా భావించలేకపోతున్నాను—ఈ విశాల ప్రపంచంలో ఎవరిమట్టుకు వాళ్ళే కరెక్టు—

ఏ మనిషి బుర్రలో ఎప్పుడు ఏ ఆలోచన చోటుచేసుకుంటుందో, ఎవరు తమ పనిని తాము సమర్థించుకోడానికి ఎట్లా ఇంటర్‌ప్రెట్ చేస్తారో అందరికీ తెల్సు

అయితే ఇంతకన్నా అశనిపాతం లాంటివార్త (వ్యక్తిగతంగా మాత్రమే) ఒక ఆహ్వాన పత్రిక మోసుకొచ్చింది—

డా॥ వెంకటయ్యగారి కుమారుడు చి॥ రమేష్ బి ఇ పై చదువులకు అమెరికా వెడుతున్న పీడ్కోలు సందర్భంలో విందు—

నిరుద్యోగిగా సకాలంలో పెళ్ళి చేయబడని రంగనాథంగారి కూతురు రహమాన్‌తో లేచిపోవడం—భారతదేశంలో గడపడం ఇష్టంలేక పై చదువుల పేరిట డా॥ వెంకటయ్యగారి కొడుకు అమెరికా వెళ్ళడం-నిర్దిష్ట నిర్వచనంలేని ఈ రెండు సంఘటనలను ఎలా అన్వయించుకోవాలో తెలియక ఇది భారతదేశమా? లేక రోమ్ దేశమా? అని తికమక పడిపోవడం నా వంతయ్యింది □

# నవమౌక్తికమాల

రసహృదయమ్ములు స్పందించే
కమ్మని తీయని రమణీమోహాల తోరణమాలల
రససౌధానికి కడ్తున్నా!
సమతా నవతా సింహాసనమున
నా శాంతి సుందరిని సామ్రాజ్ఞిగా కూర్చొనబెట్టగ
సర్వము సిద్ధము చేస్తున్నా!
నా మదిలో మెదిలో అక్షరమాలల
కవితామయమౌ నవమౌక్తిక మాలగా గ్రుచ్చి
గళములో అలంకరించగ తెస్తున్నా!
కాల తరంగిణి లయమై పోయే
ప్రతి క్షణమ్మును నా కలమ్ముతో చెరగని రూపమునిచ్చి
మానవతా మణిమకుటము శిరమున పెడ్తున్నా!
తమస్సు తెరలను రజస్సు పొరలను పారద్రోలుటకు
నే మమతా నక్షత్రాల కాంతులను
జగతికి పంచగ వస్తున్నా!
ప్రతి క్షణమ్ము ఈ ప్రకృతిలో పరిమళించు
అందాల చందముల ప్రతినిముషము కన్నులలో
వెల్గులుగా నిల్పుకొనుచు ముందుకడుగు వేస్తున్నా!
నా అక్షర మేళనలో కదిలే మెదిలే
శబ్దస్ఫూర్తిని నా సోదర యువతరానికి
రస్తా వేస్తూ వస్తున్నా!
వెన్నెల కన్నులతో మనసు లోతులను పట్టేస్తూ
నే నిన్న మొన్నటి పాశవికతకు
చెలియలి కట్టను కడ్తున్నా!
మనసులోని మంచిని పెంచే
మహీతలం వెలయించే
మనసున్న మనుషులుగా యువతరాన్ని తీర్చిదిద్ద వస్తున్నా!

—రంగినేని సుబ్రహ్మణ్యం

"వంశీ ఎమెచ్యూర్ అవార్డ్స్" పోటీలో 1976 ద్వితీయ
ఉత్తమకవితగా ఎన్నిక కాబడింది

శివరామకృష్ణస్వామి ఉపన్యాసం దాదాపు ముగుస్తోంది పది గంటలు దాటుతోందేమో! ఆరుబయట కావడంవల్ల చల్లని గాలివీస్తూ విశ్వనాథాన్ని అసహనంగా కదిలిస్తోంది. కాని వేదాంతంపట్ల విశ్వనాథానికున్న అభిరుచి కదలనివ్వడంలేదు అతని స్నేహితులు విశ్వనాథం మీద చేసే మొదటి కంప్లైంట్ యిదే "క్రైం బ్రాంచ్ సూపరిండెంటెంట్‌గా వుంటూ నీకిదేం పాడుబుద్ధి? నువ్వు చేసే ఉద్యో



గానికీ ఫిలాసఫీకి ఆమడదూరం వుంటుంది బహుశ నేరస్థుల్ని గుర్తు పట్టడంలో నీకు తెలీకుండా నువ్వే పొర బాట్లు చేస్తావని నీ మనసుకు అనిపిస్తూ వుండొచ్చు దానివల్ల వచ్చే పాపాల్ని కడిగేసుకోవడం కోసం ఫిలాసఫీ అంటే యింట్రెస్టు చూపిస్తున్నావు" అనేవాళ్ళు

అలాంటి కామెంట్లకు అన్నింటికీ విశ్వనాధానిది ఒకటే జవాబు చిరునవ్వు మరీ అవసరమైతే "వేదాంతాన్ని తీసి పడెయ్యకండి నా ఉద్యోగ నిర్వహణలో నేరస్థుల్నిపట్టడానికి యీ ఫిలాసఫీ ఒక్కో మారు ఉపయోగపడుతుంది" అనేవాడు సరదాగా నవ్వుతూ

శ్రద్ధగా స్వామీజీ ఉపన్యాసం వింటున్న విశ్వనాధానికి అప్పుడే తన పక్కనెవరో కొత్తగా వచ్చి కూర్చున్న ట్టయి తల తిప్పి చూశాడు ఇన్‌స్పెక్టర్ వీరాస్వామి

చిరునవ్వు నవ్వుతూ, "నీక్కూడా పుట్టిందా యీ పిచ్చి?" అన్నాడు చనువుగా

వీరాస్వామి హాట్‌తీసి బుఱ్ఱ తడుము కుంటూ "పిచ్చిపట్టడం నిజమేగాని యీ పిచ్చి మాత్రం కాదు ఓ వెధవ కేసు రెండురోజుల్నుండీ ప్రాణాలు తీసేస్తోంది" అన్నాడు.

స్వామిజీ ఉపన్యాసంలో ముగించబడే దోరణి కనిపించింది "అ అహాన్ని విసర్జించగలిగిన స్థితి మానవునికి చాలా కష్టసాధ్యం 'అహం' అనేది మనిషికి గుర్తురాని క్షణం వుండదు అసంకల్పి తంగా కూడా 'నేను' అన్న భావన అలాగే వుండిపోతుంది తీవ్రమైన క్రమ శిక్షణ, తపస్సుతో 'నేను ను మరిచి పోవచ్చుగాని, అప్పటికీ ప్రయత్నం లేకుండానే అంటే తనకే తోచకుండా 'నేను' బయటపడుతుంది " ఉప న్యాసం సాగిపోతోంది

వీరాస్వామి యిబ్బందిగా కదుల్తూ విశ్వనాధంతో "మీకోసమే వచ్చాను ఈ 'నేను' వ్యవహారం తర్వాత తేల్చుకుం దురుగాని ఒక నిమిషం అవతలకి వస్తారా?" అన్నాడు

అప్పుడప్పుడూ మింగుడు పడని వ్యవహారాలు అడ్డుపడితే వీరాస్వామి విశ్వ నాధంతో తనకున్న పరిచయాన్ని స్నేహాన్ని ఉపయోగించుకుంటూ సలహా లకు వచ్చేవాడు

విశ్వనాధం మారుమాట్లాడకుండా పైకిలేచి బయటికి దారితీస్తూ, "నీకాంప్లి కేటెడ్ కేసేమిటో చెప్పు" అన్నాడు

వీరాస్వామి మూడ్‌లో పడిపోయి సీరి యస్ ముఖం పెట్టి "సాధారణమైన ఎత్తు, కోటేరు లాంటి ముక్కు, ఎర్రని చాయ బెత్తెడన్నర గడ్డం ఉన్నవాళ్ళు యీ మహా పట్టణంలో ఎంతమంది వున్నారో తేల్చమంటే నీకెలా వుంటుంది? నాకు మాత్రం రెండు వీశెల ఆముదం తాగి నట్టుంది నేనిందాకా చెప్పానే లక్షణాలు- అలాంటి గడ్డపు వెధవలు ఎనిమిది వందల నల్భైమంది చచ్చారు యీ వూళ్ళో "- ఊపిరిపీల్చుకోటానికి ఆపాడు

"గడ్డాల వాళ్ళమీద ఎప్పట్నుంచీ మోజుపుట్టిందేవిటి? స్టాటిస్టిక్స్ తీసి నట్టున్నావు"

"నా ఖర్మకాలి యీ దౌర్భాగ్యపు ముండాకొడుకుల వెంటబడ్డాను "

"ఏ కేసుకు సంబంధించి వెతుకుతున్నావ్?" అసలు విషయానికి రమ్మన్నట్టు అడిగాడు విశ్వనాథం

"చంపాలాల్ నాలుగు లక్షల వ్యవహారం తెలిపినప్పట్నుంచీ"

"హైదరాబాద్ బ్రాంచ్ నుండీ యిన్ఫర్మేషన్ వచ్చింది కదూ వాడు యీ వూళ్ళోనే వున్నట్టు!"

"ఔను దాంట్లో ఏ మాత్రం సందేహంలేదట రెండురోజులు లోపల వాణ్ణీ పట్టుకోలేకపోతే నేనెందుకూ పనికి రానని స్టేట్‌మెంట్ యివ్వటాని క్కూడా ఏమీ సందేహం లేదట "

"వాడి డీటైల్స్ యింకా ఏమైనా అందాయా?"

"ఫోటో చూశాను వెధవ బె త్తెడన్నర గడ్డమూ వాడూనూ ఆ గడ్డం లేకపోతే వాడు ఉత్త చవటలాగుంటాడేమోనని నా అనుమానం అందుకే యీ గడ్డాల దౌర్భాగ్యుల వెంట పడ్డాను దరిచేరేవన్నీ నత్తగుల్లలన్నట్టు నా కనిపించే గడ్డపు సార్వభౌములందరూ భిక్షాటన చక్రవర్తులూ, లక్షాధికారులూనూ అటు వాళ్ళలో ఎవర్నీ యిటు వీళ్ళలో ఎవర్నీ అనుమానించలేక పోతున్నాను "

"చంపాలాల్ యీ ఊరికి వచ్చికూడా గడ్డం ఉంచుకునే వుంటాడని గ్యారంటీ ఏవిటి? శుభ్రంగా తీసి పడేసి వుండొచ్చు గదా "

"ఇలాంటి చొప్పదంటు ఆలోచన్లు మన క్రైంబ్రాంచ్ వాళ్ళకి సులభంగా వస్తాయని వాడా గడ్డాన్ని ఆపద్బాంధవిలా అలాగే ఉంచేసుకొని వుంటే?"

"రైటే! నీ బుఱ్ఱలోకి కూడా ఐడియాలు వచ్చేస్తున్నాయంటే నాకు నమ్మబుద్ధేయడంలేదు "

"నువ్వు మరీ వీరాస్వామిని అంత తక్కువగా అంచనా వెయ్యటానికి వీల్లేదు బ్రదర్ పైగా యీ కేసును యీ వూళ్ళో గడ్డం రాజులు ఎనిమందల నలభై మంది వున్నారని తేల్చెయ్యడంతో ఆపెయ్యలేదు నేను అనుమానితుణ్ణి ఒకణ్ణి జాబితాలోకి ఎక్కించేశాను నేను అనుమానించానంటే దానికి తిరుగులేదన్న సంగతి నీకూ తెలుసుగా!"

"ఎవరావ్యక్తి?"

"ఎవడో శంకర్రావట మనోరమా లాడ్జిలో దిగాడు వందయాపాయల నోట్లతో కోట్లు కుట్టించుకున్నట్టు తిరుగుతుంటాడు వాడు ఏ లోకం నుంచీ దిగాడో అంతుపట్టకుండా వుంది. వాణ్ణి డైరెక్టుగా అప్రోచ్ అయి ఎంక్వయిరీ చేద్దామంటే గుండెలు చాలడంలేదు "

"ఎందుకని?"

"పోయిన సంవత్సరం యిలాంటి కేసే ఒకటి తగిలి ఒక మహానుభావుణ్ణి అనుమానించాను ధైర్యం చేసి డైరెక్ట్ ఎంక్వయిరీ మొదలు పెట్టేసరికి అతగాడు చీఫ్‌మినిస్టర్ బావగారి చెల్లెల మొగుడని తేలింది ఆ వ్యవహారం నుంచి నా ఉద్యోగానికి భంగం రాకుండా బయటపడే సరికి చావు తప్పి కన్ను లొట్టపోయినంత పనయింది శంకర్రావుకూడా ఏ మినిస్టర్ వుంచుకున్న దాని తమ్ముడో అయితే




అనవసరంగా బజార్న పడాల్సి వస్తుందేమో అని అనుమానిస్తున్నాను"

"ఇంతకూ యిప్పుడు నీ బాధేవిటి? ఆ గడ్డపు వెధవ చంపక్‌లాల్ యీ శంకర్రావు యిద్దరూ ఒకటి అవునా కాదా తేల్చుకోవాలి అంతేనా?"

"అక్షరాలా"

"ఇందాకా దీనికి స్వామీజీ సొల్యూషన్ చెప్పాడు 'నేను' అన్న ఫీలింగ్‌ని వదిలిపెట్టడం అసాధ్యం అన్నాడు"

"నీ వరస చూస్తుంటే తాతాచార్యులకూ పీర్ల పండక్కీ సంబంధం వుందనేటట్టున్నావు"

"వున్నదీ లేనిదీ రేపు చెబుతాను ఈ రోజుకు హాయిగా రెస్ట్ తీసుకో" వీరాస్వామి చేతిని ఆప్యాయంగా నొక్కుతూ విశ్వనాథం ఆలోచనతో ముందుకు నడిచాడు

* * *

ప్రపంచమంతా హాయిగా వున్నందుకు సంతోషపడుతూ శంకర్రావు యీవెనింగ్ వాక్ నుండి హోటల్ రూముకు వస్తున్నాడు

రోడ్డు పలచగా వుంది శంకర్రావు దృష్టి రోడ్డు పక్కనున్న అశోక చెట్ల మీదికి వెళ్తోంది

తన పక్కనెవరో సంశయంగా చూస్తూ నిలబడే సరికి తనూ ఆగి ఆ వ్యక్తి ముఖంలోకి 'ఎవరా' అనుకుంటూ నిశితంగా చూశాడు

ఆ చూపే చాలన్నట్టు ఆ వ్యక్తి గబగబా నాలుగడుగులు శంకర్రావుకు దగ్గరగా వేసి "నా దగ్గరో పార్కర్ పెన్ను

వుంది కొంటారాసార్!" అన్నాడు

శంకర్రావుకు యింకోమారు పరీక్షగా ఆ వ్యక్తి వంక చూశాడు పార్కర్ పెన్నును అమ్మడం కాదుగదా కనీసం కల్లోనైనా చూసి వుంటాడా అన్న అనుమానం వచ్చింది అతనికి

తన మనసులో కలిగే భావాల్ని చూపుల్లో పూర్తిగా వ్యక్తం చెయ్యకుండా "చూస్తాను యిటివ్వు" అన్నట్టు చెయ్యి చూసాడు

పాంటుజేబులో లక్ష రూపాయల చెక్కును అతి జాగ్రత్తగా దాచుకున్నట్టు, ఆ వ్యక్తి పెన్నును బయటికి తీసి శంకర్రావు చేతికిచ్చాడు అది పార్కర్ పెన్నే! సందేహం లేదు

"ఇది నీ సొంతమేనా?" పెన్నును ఓ ఆగంతకుణ్ణి ఓ కంటితో పరీక్షగా చూస్తూ అడిగాడు శంకర్రావు

ఆ వ్యక్తి అభిమానం దెబ్బతిన్నట్టు అతని ముఖంలో మారిన రంగులే చెప్పాయి "నేను కొనడం లేదు అంటే నేనేమీ బాధపడేది లేదు కాని అలాంటి మాటలు మాత్రం అనకండి ఇలాంటి పెన్నులు వంద దానం చెయ్యగలిగినంత స్టేటస్‌లో బ్రతికిన వాణ్ణే నేనొకప్పుడు కాలం కలిసిరాక యిలా అయ్యాను గాని " మాటలు మింగుతూ పెన్నును వాపసు యిచ్చెయ్యమన్నట్టు చేయి ముందుకు చాపాడు

శంకర్రావు అలాంటి వాళ్ళను వేల మందికి పైగా చూసి వుంటాడు సరదాగా నవ్వేస్తూ," ఏదో అనేశాను మనసులో పెట్టుకోకబ్బాయ్! యింతకూ ఎంతివ్వమంటావ్" అన్నాడు

"పదో పదిహేనో" ఆ వ్యక్తి కళ్ళలో మళ్ళీ ఆశ చిగురించింది

"తొమ్మిది రూపాయలు యిస్తాను" అంతకంటే ఎక్కువ గాని తక్కువగాని ఏ మాత్రమూ యివ్వనన్నట్టు ఖరాఖండీగా చెప్పి "అసలింతకూ యీ పెన్ను రాస్తుందో లేదో చూడాలి" అన్నాడు

ఇంకో పాంట్ జేబునుండి ఆ వ్యక్తి ఓ నోట్‌బుక్ లాగి "రాసి చూడండి" అన్నాడు

శంకర్రావుకు పెన్ను నచ్చింది అది రాయడం బట్టి చూస్తే కొత్త పెన్ను లాగానే వుంది జేబులో నుండి కొత్త పదిరూపాయల కాగితం తీసి అతనికిస్తూ, "పోనీ పది వుంచుకో కష్టాల్లో వున్నట్టున్నావు" అని ముందుకు నడిచాడు

* * *

శంకర్రావ్ తను కొత్తగా కొన్న పెన్నుతో డైరీ రాసుకుంటున్నాడు

అతని ఏకాగ్రతను భగ్నం చేస్తూ తలుపు చప్పుడవటంతో లేచి వెళ్ళి తలుపులు తీశాడు

ఎదురుగా పోలీసులు బ్రూన్పడి పోయాడు శంకర్రావ్

"మిస్టర్ చంపాలాల్ యువార్ అండర్ అరెస్ట్" అన్నాడు పోలీసుల్తో బాటు లోపలికి అడుగుపెట్టిన ఆఫీసర్

శంకర్రావుకు అంతా అయోమయంగా వుంది పోలీసులు తన్నెలా గుర్తు పట్టగలిగారు? తన ఆచూకీ తెలిసేట్టు తనే




ప్పుడు ప్రవర్తించాడు? అతడి మస్తిష్కంలో వేలకొద్దీ ప్రశ్నలు పుట్టుకొచ్చాయి పోలీస్ సూపరింటెండెంట్ వంక దీక్షగా చూసిన అతని కళ్ళు సమాధానం దొరికినట్టు మెరిశాయి

అది గమనించిన విశ్వనాథం నవ్వుతూ "యువర్ గెస్సింగ్ యీజ్ అక్యురేట్లీ కరెక్ట్ మిస్టర్ చంపాలాల్! మీకు పార్కర్ పెన్ను అమ్మింది నేనే" అన్నాడు

* * *

"ఇంతకూ యీ కేసునిప్పుడు ఎవరు సాధించినట్టు?" సీరియస్‌గా అడిగాడు వీరాస్వామి విశ్వనాథాన్ని

"మనిద్దరమూ మటుకు కాదు. ఈ గొప్పదనమంతా శివరామకృష్ణ స్వామీజీ గారిది ఆయన ఉపన్యాసంలోని చివరి మాటలు ఆ రోజు విన్నావుగా! 'నేను'ను సాధారణమైన మానవులు మరచిపోవడము అసాధ్యము అసంకల్పితంగా తనను తెలీకుండానే ఆ 'నేను' బయటపడుతుంది అని ఈ సూత్రాన్నే నేను ప్రాక్టికల్‌గా ప్రూవ్ చేశాను శంకర్రావు తనే చంపాలాల్ అని తనంతట తనే బయటపెట్టుకున్నాడు"

"ఎప్పుడు?"

"నేను అమ్ముతున్న పార్కర్ పెన్ను సరిగా రాస్తుందో లేదోనని పరీక్షించినప్పుడు ఆ పెన్నుతో అతను కాగితం మీద ట్రై చేసింది 'చంపాలాల్' అనే అక్షరాలను" □




"ఒరే రమణా! నిన్ను కని పెంచి, ఇంత వాడిని చేసింది నీ నుంచి నీతి బోధలూ, ధర్మపన్నాలూ వినడాని క్కాదురా!" శివమెత్తిపోతూ పైపంచె గట్టిగా ఝాడించి మళలా భుజాన పడవేసు కున్నాడు దేవయ్య!

అటునుంచి సమాధానం వినరాకపోవ డంతో మరింత బిగ్గరగా అరవడం ప్రారంభించాడు

"స్కూళ్ళకూ కాలేజీలకూ పుస్తకా లకూ హాస్టళ్ళకూ వేలకువేలు గుప్పి నురా కొంపా గోడూ గుల్లజేసుకొని ఎందుకు? ఎందుకంటావ్? కన్నవాళ్ళని ఉద్ధరిస్తావని! నా భుజాలమీది బరువు దింపు తావని? అంతేకాని, ఎవతెనో ఉద్ధరించి, దాని అమ్మానాన్నల బాధ్యతల బరువును తేలకచేస్తావని కాదు తెలిసిందా?"

గదిలో కిమ్మనకుండా కూర్చున్న రమణ ఈసారీ ఏమీ మాట్లాడలేదు

ఈసారి గాలివాటం మరోవైపుకు తిరి గింది.

"ఏమేవ్ ఓ మహాలక్ష్మీ! చెప్పుకో నీ ముద్దుల పెద్దకొడుక్కి సాయంత్రం లోగా నాకు సమాధానం సిద్ధంగా వుండా లని ఆ!"

మరోసారి కండువా జోరుగా దులిపి

## కొత్త సీరియల్ ప్రారంభం!

పై నవేసుకుని, పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

"అమ్మా, నేను నా స్నేహితురాలింటికి వెళ్తున్నాను. ఓ గంటలో వచ్చేస్తాను." సుగుణ సుడిగాలిలా వంటగదిలో ప్రవేశించి, తుఫాను వేగంతో మాట్లాడుతోంది.

"ఏ స్నేహితురాలు?"

"సీత యింటికి. దానికీ వాళ పెళ్ళి చూపులు."

"అయితే మనకేం జరిగింది? చాల్లే సంబడం. నిన్నూ చూచుకువెళ్ళారు రెండు సంబంధాల వాళ్ళు. మళ్ళీ ఉత్తరమైనా రాయలేదు." ఈసడించింది మహాలక్ష్మి.

"అది నా తప్పుకాదు, మీ అసమర్థత!" ఛెళ్ళున కొట్టినట్టు మాట్లాడటం సుగుణ సహజగుణం.

"వాళ్ళడిగినవి మీరివ్వలేకపోతున్నారు. అంతే. నన్నంటావెందుకు?"

"ద్రాక్షారం వాళ్ళు మనకందుబాటులోనే వున్నారు కదా? వద్దు పొమ్మంటివి!"

"ఛీ. ఆ ముష్టిసంబంధం నేను చేసుకోను" ఖరారుగా అన్నది సుగుణ.

"ఆఁ దిగి వస్తాడు చంద్రలోకంలోనుంచి రాకుమారుడెవడో నీ కోసం. తలకుమాలిన ఆశలు పెట్టుకోకూడదు."

"ఈ గోల రోజూ వుండేదేకానీ నన్ను వెళ్ళనీ."

"త్వరగా రా, మీ నాన్నగారు వచ్చేలోగా. లేకుంటే కోపం వస్తుంది" వెనుక నుంచి హెచ్చరిస్తోన్న మహాలక్ష్మి మూడో కొడుకు రామం పిలవటంతో వెనక్కి తిరిగింది.

"అమ్మా, నా ఎక్స్‌కర్షన్ మాటేం చేశావ్?"

విసిగిపోయి వున్న మహాలక్ష్మి తారాజువ్వలా లేచింది. "అమ్మా అదేం చేశావ్, అమ్మా ఇదేం చేశావ్? ప్రతి ఒక్కళ్ళూ నన్ను పీక్కు తినేవాళ్ళే. ఆయన ఎదుట నోరు లేవదు ఒక్కళ్ళకూ. ఎక్కడినుంచి తేను నాలుగొందలు యిప్పుడు?"

"ఏమో నాకేం తెలుసు? సాటి వాళ్ళందరికీ వాళ్ళమ్మానాన్నలు నాలుగొందలడిగితే అయిదొందలిచ్చి పంపుతున్నారు." ఉక్రోషంతో రాము ముక్కుపుటాలు అదురుతున్నాయి.

"తేరగా వచ్చిన రాసులుంటే యిస్తారు. మనకా షోకులన్నీ అక్కర్లేదు కానీ నాలుగు అక్షరం ముక్కలు వంటపట్టి డిగ్రీ వస్తేచాలు. వెళ్ళు. మాటి మాటికీ డబ్బో డబ్బో అని పీక్కు తినకు."

"ఛీ ఛీ. చిన్న చిన్న సరదాలు కూడా తీర్చలేని వాళ్ళు పిల్లల్నెందుకు కంటారో" మనసులోని కోపమంతా కాలి బూట్ల ద్వారా ధ్వనింపజేస్తూ అసంతృప్తిగా వెళ్ళిపోయాడు రామం.

"అనండిరా అనండి." ముక్కు చీదుతూ, తనలో తాను అనుకుంటున్నట్లుగా ఇల్లంతా విన్పించేంత స్వరంతో అంటోంది మహాలక్ష్మి, "ఈ నాటికి పుమ్మల్నే వాళ్ళయ్యారు. గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించినట్లుగా, దేశంమీద అందరి పిల్లలూ ఇలాగే వున్నారా? ఎంతెంత కట్నాలు అందుకుంటున్నారు? ఎంతెంత సాయంగా

వుంటున్నారు తలిదండ్రులకు? మా ఖర్మ కొద్దీ మాకు పుట్టినాళ్ళు మమ్మల్ని ఎదురు సతాయించుతున్నారు "

అనర్గళంగా సాగిపోతోందిఉపన్యాసం

ఊపిరి తిరగనట్లున్న ఆ వాతావరణం నుండి సవ్వడికాకుండా బయటకు అడుగు పెట్టాడు రమణారావు.

ముంగిటవున్న చిన్న అరుగుపై కూర్చుని పధ్నాలుగేళ్ళ చెల్లెలు రాధ ఎదుటి భాగ్యవంతుల మేడనూ, వారి యింటికి వస్తూపోతూవున్న కార్లనూ ఆశగా అరాధనగా చూస్తోంది

మూగగా నిశ్వసించింది రమణ మనస్సు 'ఈ యింట పెద్దలూ, పిన్నలూ ప్రతి ఒక్కరికీ అసంతృప్తి బాధే, ఇంకా ఏదేదో లభించలేదు—ఏమేమో జరగలేదు అనే దిగులే

ఇటువంటి చికాకులతో కూడిన దైనందిన జీవితానికి ఊహ తెలిపిన నాటినుండీ అలవాటు పడివున్నా నేడు మరీ వికలమైనది రమణ మనసు

నదీతీరాన ఒంటరిగా గడిపాడు చాల సేపు.

మనశ్శాంతి చిక్కలేదు

కడకు ఒక స్థిరనిశ్చయంతో బయలుదేరాడు

"రా రమణా నీ కోసమే ఎదురు చూస్తూన్నా" ఛాయ సాదరంగా అహ్వానించింది

"ఏమిటంత గంభీరంగా వున్నావ్?" అన్నది తాను ఓ కుర్చీలో కూర్చుంటూ

ఛాయ మరి ఆ ప్రశ్నను రెట్టించలేదు

ఆమెలోని ఆ గొప్ప మర్యాద లక్షణాలపై అతనికి ఎనలేని గౌరవం గొప్పమేనర్స్ ఎన్నడూ ఇతరులను ఇబ్బంది పెట్టే సంభాషణ సాగించదు

"వాతావరణం చాలా బాగుంది కదూ ఈ సాయంత్రం?" అంటూ సంభాషణను మార్చింది

"ఔను. మీ నాన్నగారు ఇంట్లోలేరా?"

"అదుగో మాటల్లో వచ్చేశారు" అన్నది వీధి ద్వారంవేపు చూస్తూ.

"హల్లో రమణా రెండ్రోజులుగా రాలేదే ఇటు? కులాసాయేనా!" వెంకటేశ్వర్రావు ఆదరంగా అడిగాడు ప్రక్కనే కూర్చుంటూ

"ఏవో పనులు " నసిగాడు రమణ

లోనుండి కామాక్షి వచ్చింది కాఫీ ఫలహారాలతో. కుశల ప్రశ్నలడుగుతూ అక్కడే కూర్చున్నది

ఆ మర్యాదలకూ ఆప్యాయతకూ రమణ కరిగిపోతాడు

"మీ చెల్లెలికి సంబంధం వచ్చిందట కుదిరిందా? ఆ హడావుడిలోనే నువ్వు రావటం లేదేమో ననుకున్నాను "

"హడావుడి ఏముందిలెండి? చూచుకుని వెళ్ళారు. వాళ్ళడిగిన ముప్పైవేలూ మనం యిచ్చిన నాడు పెళ్ళి కాగలదు అంతే "

"అంత పెద్ద మొత్తమే?" ఆశ్చర్యం ప్రకటించింది

వెంకటేశ్వరరావు అన్నాడు "సీ కది పెద్ద మొత్తంగా అన్పించవచ్చు కానీ ఈ నాడు అది చాలా చిన్న అంకె పెళ్ళి బేరాలలో."

"ఏమో బాబూ! తేరగా వచ్చిన ధన




రాసులున్నవాళ్ళూ, ఒక్కతే పిల్లవున్న వాళ్ళూ యివ్వగలరు కానీ, ఎవరివ్వ గలరు?"

"మనకూ ఒక్కతేపిల్ల, అయితే, మనం యివ్వగలమా మరి?" అంటూ నవ్వాడు వెంకటేశ్వరరావు

కామాక్షికి సమాధానం దొరకలేదు

"అదంతే కామాక్షి ఈ ప్రపంచం చాలా చిత్రమైనది మనవంటి వాళ్ళకు"

ఆ తర్వాత ఏ ఏ కులాలలో ఎంతెంత కట్నాలు పలుకుతున్నదీ, ఏ ఉద్యోగ మైతే ఎంత కట్నం వస్తూన్నదీ వగైరా విషయాలపై కొంతసేపు మాటలు సాగి పోయాయి

"బజార్లోపనుంది నేను వెళ్తాను మరి" అని వెళ్ళిపోయాడు వెంకటేశ్వరరావు

"వస్తాండవోయ్ రమణా నువ్వు రాక పోతే ఏమిటో ఏమీ తోచదు" అని హెచ్చరించాడు వెళ్ళేముందు

"నేను వంటచేసుకుంటానిక మీరు ఎక్కైనా షికారు వెళ్తే వెళ్ళిరండి ఈ రోజు నీ భోజనం ఇక్కడే రమణా" అని వంట యింట్లోకి నిష్క్రమించింది కామాక్షి

"భోజనం యిక్కడ చేయనులెండి వెళ్ళాలి"

"అప్పటి సంగతి చూద్దాంలే" ఛాయ నవ్వింది

"ఏమిటో చాలా ఉదాసీనంగా వున్నావీ రోజు? ఈ అందమైన వాతావరణంలో ఎక్కైనా వెళ్ళాలని అన్పించడం లేదూ నీకు?"

నిర్లిప్తంగా చిరుహాసం చేశాడు రమణ

"మానసిక నైర్మల్యమూ, సౌంద ర్యమూ కలవారే బాహ్య ప్రకృతినీ, దాని

అందచందాలనూ ఆస్వాదించ గలరు ఛాయా!"

ఛాయ తలెత్తి నిశితంగా చూచిందతని దెస

"రమణా! ఏమిటి అదోలా వున్నావ్? ఎందుకో బాధపడ్తూన్నట్లుకన్పిస్తున్నావ్?"

"ఊఁ నీతో కొంచం మాట్లాడాలి ఛాయా"

"పద డాబామీద కూర్చుందాం"

కొంత తడవు తనలో తాను మధన పడుతూ మౌనంగా కూర్చున్న రమణ కడకు సూటిగా చెప్పేశాడు తన నిర్ణయాన్ని

"మనం ఏవో ఆశలతో భవిష్యత్తును గురించి కలలుకన్నాం కానీ అవి కలలు గానే మిగిలిపోతాయి ఛాయా!"

తల వాల్చుకు వింటున్న ఛాయ పిడుగు పాటుకు అదరిపడినట్లుగా తలెత్తింది చివాలున అతడి దెస చూస్తూన్న ఆమె కను పాపలు అతిగా చలించుతున్నాయి—ఎన్నో ప్రశ్నలు అడుగుతూ

అపరాధిలా తల వాల్చుకున్నాడు రమణ

అయిదు నిముషాలు మౌనం రాజ్యమేలింది

ఆ మౌనాన్ని ఛేదిస్తూ ఛాయ బలమైన నిట్టూర్పు వినవచ్చింది

"క్షమించు ఛాయా నేను నిస్సహాయుడను"

ఛాయ హుందాగా తల పంకించింది.

"క్షమా, కోపం వంటి మాటలు మన నడుమ లేవు రమణా ఏమిటో వివరంగా చెప్పు నాకు విషయాన్ని" అతి నిబ్బరంగా అడిగింది

స్వగృహ కలహాలనూ, అశాంతినీ వర్ణించుతూ ఆఖరున అన్నాడు రమణ "ఇటువంటి కుటుంబంలోనికి నిన్ను తీసుకు వెళ్ళడం వలన నీవూ నేనూకూడ అశాంతినే వరించిన వాళ్ళమౌతాము"

" "

"మాట్లాడు ఛాయా"

"ఏం మాట్లాడను? నీవు కేవలం నీ పక్షంగానే ఆలోచించావు మనసున్న మగనితో మహారణ్యం మధ్యనైనా మహానందంగా గడపగల మగువలున్నారని మఱచిపోయావు అశాంతి, అసంతృప్తి ఈ ఛాయ నిఘంటువులోనేలేవు రమణా!" ఆత్మస్థైర్యంతో మెరుస్తున్నాయి ఆమె నేత్రాలు

"ఆ రెండు సుగుణాలూ నీలో కలకాలం నిలచి వుండాలని ఆశీర్వదిస్తున్నాను ఛాయా గుర్తింపులేని తావున నీ వంటి గుణవతిని బంధించకూడదనే నిర్ణయించుకున్నాను"

"రమణా మన మిద్దరం ఎమ్మెస్సీ పాసయ్యాం, ఇద్దరమూ ఏడెనిమిది వందలు సంపాదిస్తున్నాం ఇక భయం దేనికీ? ఒకరి జీతం ఖర్చుచేయకుండా అట్టే పెట్టి మీ చెల్లెలి పెళ్ళి జరిపించలేమూ?"

"మా యింటి పద్ధతులూ, ఇంట్లో వారి స్వభావాలూ నీకు కూలంకషంగా తెలియవు దానా పెట్టి మేపుతున్నాం గనుక గేదెపాలన్నీ దూడకుకూడా చుక్క మిగల్చకుండా మనమే తాగాలనుకుంటుంది మా అమ్మ నా ఉగ్గుపాలకు అయిన ఖర్చులు




హడా వడ్డీతో సహా లెఖ్ఖ వేసి వుంచాడు హ నాన్న. కేవలం తమ ఆశలూ, ఆదే ాలూ వినడానికీ తీర్చడానికే ఈ 'అన్న' అనే పదార్థాన్ని ప్రసాదించాడని తమ్ముళ్లూ, చెల్లెళ్ళూ గట్టి నమ్మకంతో వున్నారు."

మౌనంగా అన్నీ విన్న ఛాయ చాలా సేపు ఆలోచించింది.

"నీకు కట్నం కావాలంటావ్?" అన్నది హఠాత్తుగా తలెత్తి.

నిశ్చలంగా ఆకసం దెస చూస్తూన్న రమణ నుండి జవాబులేదు.

"రమణా!" స్థిరగంభీరత్వం తావుచేసు కున్నది ఛాయ స్వరంలో.

"రమణా! ఎవరి జీవితం వాళ్ళది; ఎవరి కుటుంబ పరిస్థితులు వాళ్ళవి. అందులో ఇతరుల ప్రమేయమూ, సల హాలూ వెగటుగా విన్పిస్తాయి; అసహ్యంగా కన్పించుతాయి. నీ జీవితంతో నా జీవితం ముడివడనంత వఱకూ నీకు నేను పరాయి దాన్నే. పరాయి వ్యక్తిగా నిన్ను నేను మొగమాటాలతోనూ బలవంతాలతోనూ బంధించేంత అల్పురాలను కాను .."

"ఛాయా!...."

"నన్ను మాట్లాడనీయి రమణా! జననీ జనకులనూ, సోదరీ సోదరులనూ ఉద్ధరించా లనేది సమంజసం కాని విషయమేమీ కాదు. కానీ హద్దులు దాటరాదని నా ఉద్దేశ్యం. ఎవరి ప్రాణం వారికి తీపి — అలాగే ఎవరి జీవితపు బాధ్యత వారిది. త్యాగసముద్రంలో స్వయంగా కొట్టుకు పోవడ మనేది నేను హర్షించ లేని విషయం."

"అందరి తలిదండ్రులూ నీ తలి

దండ్రులలాగా సంస్కార హృదయులై వుండరు ఛాయా నీవు అదృష్టవంతురా లివి సమస్యలులేని అందమైన కుటుంబం లోని నీవు ఆలోచించినట్లుగా నన్ను నా కాళ్ళ సంకెళ్ళు ఆలోచించనీయవు!"

ఆ మాటలకు బాధపడ్డట్టు చూచింది ఛాయ

"ఈ పుడమిపై పుట్టిన ప్రతివారికీ ఏవో ఓ సంకెళ్ళు వుండనే వుంటాయి అయితే ఆ సంకెళ్ళ ప్రభావానికి లోను గాకుండా 'నేను విద్యావతిని, ఉద్యోగం చేస్తూ లోకం పోకడను గ్రహించిన దాన్ని' అనే విషయాన్ని విస్మరించకుండా ఆలోచించగలవారే వివేకవంతులు

నేను తల్లిదండ్రుల ఏకైక సంతానాన్ని, అందుకె ఇల్లరికపు టల్లుడు కావాలని వాళ్ళు కోరుకుంటున్నారు కన్నవాళ్ళకు ఏదో ఆశ వుండటం అసహజమేమీ కాదు-కానీ కేవలం తమ పరంగానే ఆలో చిస్తున్నారు కానీ, పరగృహవాసం పురుషుని అహంపై, పౌరుషంపై గట్టి దెబ్బ తీస్తుందనే సంగతి వాళ్ళు మఱచిపోతు న్నారు తలిదండ్రుల యిష్టాలకు గ్రుడ్డిగా ఆమోదం తెలుపలేని నేను 'జీవితం నాది' అనే సత్యాన్ని మనసున వుంచుకొని నిర్ణ యాలు తీసుకుంటాను అందుకే చెప్పే శాను, ఇల్లరికపు సంబంధం నా కవసరం లేదని ''

" "

''సారీ రమణా, చాలా పెద్ద ఉపన్యా సమే యిచ్చాననుకుంటాను నేను చెప్పేది ఒకటే మనం విద్యావంతులుగా కొన్ని ఆదర్శాలను పెంచుకున్నాం ఏ ఆదర్శా నైనా అమలుజరపటానికి తెగువ అవసరం ''

"నిజమే ఛాయా " నూతిలోనుండి వినవచ్చినట్లున్నది రమణ స్వరం "నేను పిరికివాడిని "

"క్షమించు నా మాటల అంతరార్థం అటువంటి నిందకాదు సరే, నువ్వు నేడు ఏదో వివశతలో వున్నావ్ వివశత వివేకాన్ని హరింపజేస్తుంది అందుకే నేను ఆవేశపడడంలేదు నీ కోసం నేను మరి కొంతకాలం ఓర్పుగా వేచివుండ గలను "

''వద్దు ఛాయా, ఆశ పెరిగిన కొలదీ మనసు రోదించవలసి వుంటుంది మన జీవితాలు సమానాంతర రేఖలు అని గుర్తించాక ఇక ఈ ప్రకరణం యింత టితో ముగించటం మంచిది ''

వేదాంతిలా చిరుహాసం చేసింది ఛాయ

"నూరేళ్ళ జీవితాన్ని గురించిన నిర్ణయం నూరు లిప్తల కాలంలో తీసు కోవడం వివేకవంతుల లక్షణం కాదు వెళ్లిరా, శాంతంగా ఆలోచించు "

''అమ్మ భోజనానికి పిలుస్తుంది '' ముక్తసరిగా అన్నది పెద్ద చెల్లెలు సుగుణ

"నాకు ఆకలిలేదు సుగుణా మీరు కానీ యండి " అంటూ పుస్తకాలు ముందు వేసుకూర్చున్నాడు రమణ

వింటూనే తారామండలాని కెగసి పడ్డాడు దేవయ్య "ఏం, ఉపవాసాలతో ఎవర్ని బెదరిస్తాడటా! వచ్చి నోరు



మూసుకు తినమను ''

ఈ ఆదేశం వింటూనే రమణ నిదానంగా లేచివచ్చి వంట యింటి ద్వారంలో నిలబడ్డాడు

భోజనాలకు సిద్ధంగా కూర్చుని వున్నారు కుటుంబ సభ్యులంతా వరుసగా

తల్లి వడ్డనల కుపక్రమించింది ఓ ప్రక్కనుండి, కుమారుని గమనించినట్టే

"నాకు ఆకలిలేదమ్మా మీరంతా కానీయండి" అన్నాడు రమణ అతి సహజ స్వరాన

భోజనాని కుపక్రమించ బోతూన్న దేవయ్య కంచుగ్లాసు రక్కున నేలన కొడుతూ కౌశిక మహర్షివలె తలెత్తి చూచాడు భస్మం చేసే చూపులతో

"నీ తీరేమిటో నాకర్ధంకాకుండా వున్నది దేనికీ సమాధానం చెప్పవ్ పైగా తిండివద్దు. నీళ్లు వద్దు ఎవర్ని బెదరించాలని? ఏమి సాధించాలని? కన్న వాళ్ళం-కాస్త అది కాదు - ఇదీ - అని చెప్పడం ఓ నేరమేనా? ఇంత ఖర్చుపెట్టి నిన్నింత వాడిని చేసింది ఎందుకనుకున్నావ్?"

ఇప్పటికీ సహనం కోల్పోలేదు రమణ

"తెలుసు మీ ఆశలు తీర్చుతానని యింతవాడిని చేశారు మాట యిస్తున్నాను-మీ బాధ్యతల్ని పెద్ద కొడుకుగా భుజాన వేసుకుంటున్నాను సుగుణకు ఆ సంబంధం ఖాయం చేయండి కట్నం ముప్పైవేలూ నేను సమకూర్చుతాను లగ్నాలు పెట్టించండి"

ఆశ్చర్యంగా ఆనందంగా ఒకేసారి అడిగారు తల్లీతండ్రీ "అయితే నీకు ఆ విజయవాడ సంబంధం ఖాయం చేయ

మంటావా? వాళ్ళిచ్చే ముప్పైఅయిదు వేలూ మనం ఇలా సర్దేయవచ్చు "

"వద్దు" కఠినంగా, స్థిరంగా అన్నాడు రమణ

"నేను ప్రస్తుతం వివాహం చేసుకోవటంలేదు నా పెళ్ళిమాట తలపెట్టవద్దు"

"మరి డబ్బు?"

"నేను తెస్తాను"

"ఎలాగ"

"నాకు చేతులూ కాళ్ళూ వున్నాయి, మీరు పైసాపైసా కూడబెట్టి చదివించిన చదువు వున్నది చచ్చి సంపాదించైనా తెస్తాను కానీ చెడిపోను మీరు నిశ్చింతగా వుండండి"

# 3

"పెళ్ళి చాలా బాగా జరిగింది రమణా!" పెళ్ళికి వచ్చిన ఛాయ అభినందన తెల్పింది

నిర్వికారంగా, నిర్లిప్తంగా నవ్వాడు రమణ.

"పెళ్ళికి ఖర్చైన ముప్పైఅయిదు వేలూ మాత్రం బాగుండలేదూ?"

"ఆఁ!" చాలా ఆశ్చర్యమైంది ఛాయకు

"ఔను బాగా చదువుకున్నవాడూ, ధనవంతుడూ కూడా అయివుండాలి తన భర్త అని సుగుణ పట్టు కుమార్తె కోరిక కన్నవారికి ముఖ్యం కొడుకెలా ఏడిస్తే నేం?"

"మరి? ఎలా యింతడబ్బు ?"

"అయిదు ట్యూషన్స్ ఒప్పుకున్నాను స్కూలు పుస్తకాల గైడ్స్ వ్రాయటానికి ఒక పబ్లిషర్‌తో ఒప్పందం చేసుకున్నాను. నా జీతంమీద, ప్రావిడెంట్ ఫండ్‌మీదా అప్పుచేశాను కన్నవారు నన్ను కనడం వ్యర్థమైనదని బాధపడకుండా చేశాను"

అతడి కంఠంలో సుడులు తిరుగుతూన్న బాధ ఆమెను మరి మాటలు పొడిగించనీయలేదు

"చాలా సాహసం చేశావ్ రమణా! ఈ అప్పులు ఎప్పటికి తీరతాయి" అతడి దగ్గఱ స్నేహితుడైన ప్రభాకరం అడిగాడు

నిర్జీవమైన చిరుహాసమే సమాధానమైంది రమణ నుండి

# 4

"మార్నింగ్ రెండు ట్యూషన్స్ చెప్పి, కాలేజీకి వస్తున్నావ్ కాలేజి వదలుతూనే మరో మూడు ట్యూషన్స్ రాత్రంతా కూర్చుని పుస్తకాలు వ్రాస్తావ్ ఇక నీకు విశ్రాంతి ఎప్పుడు?"

విచారంగా అడిగింది ఛాయ ఒకనాడు

"నాలాటి వాడు విశ్రాంతిగా ఎలా వుండగలడు?" ఎదురుప్రశ్న వేశాడు

"నీ ఆరోగ్యం గురించి నాకు చింతగా వుంది రమణా"

"నా గురించి ఆలోచించడం మాని వెయ్యి ఛాయా"

"మీ అమ్మగారైనా నీ ఆరోగ్యం గురించి హెచ్చరించడంలేదా?"

"హుఁ! అమ్మ!" హేళనగా నవ్వాడు. ఈ ఉదయం నాకు లేస్తూనే హెచ్చరిక యిచ్చింది సుగుణ పురిటికి వస్తుందిట వచ్చే నెలలో, వేడుకలూ వగైరాలకూ, పుట్టబోయే బిడ్డకు ఇవ్వాల్సిన నగలూ,

వియ్యాల వారికి బట్టలూ వెరసి మూడు వేలకు తక్కువ కాదట ఇప్పట్నుంచీ సమకూర్చి వుంచమని ఆజ్ఞాపించింది చిన్న చెల్లెలు రాధకుకూడా సంబంధాలు చూడాలని ఆజ్ఞాపించింది "

నిశ్చలంగా నేల వేపు చూస్తున్న ఛాయ మాట్లాడలేదు.

"ఏం? ఇలాంటి అమ్మలు కూడా వుంటారా అని ఆలోచిస్తున్నావా?"

నిట్టూర్చింది ఛాయ "రమణా! నీతో ఎన్నో మాట్లాడాలని వున్నది కానీ నీతో మాట్లాడడానికే భయంగా వుండేంత గంభీరంగా మారిపోతున్నావ్ నువ్వు ఆనాటి కానాడు "

"నువ్వు మాట్లాడదలచుకున్నదేమిటో నాకు తెలుసు "

"మరి?"

"కానీ, ఆ మాటలు ఇక అనవసరం ఛాయా, ఒకప్పుడు ఏదో అనుకున్నాం అది మరచిపో, ఇప్పుడు మన జీవితాలు వేరు "

"రమణా!"

"ఔను, మరో చెల్లెలు పెళ్ళి—మరో నలభై వేలు కావాలి తమ్ముళ్ళ చదువులు—వీటికే నేను అంకితం భార్యాపిల్లలు అనవసరం నావంటి వాడికి వాళ్ళను ఏడిపించలేను "

"రమణా! ఒక్క మాట నేను చెప్తే కోపం రాదుకదా?"

"ఏమిటి?"

"ఒక చెల్లెలి బాధ్యత నీవు నిర్వర్తించావ్, మరొకామె బాధ్యతను మీ పెద్ద తమ్ముడు తీసుకోవడం న్యాయం ఏం తొందర వచ్చిందిప్పుడు రాధ పెళ్ళికి? పదిహేనేళ్ళేగా ఆమెకు? అప్పటికి మీ పెద్ద తమ్ముడు ఉద్యోగంలో స్థిరపడ్తాడు."

"హుం వాడు నావంటి వాడు కాదు రాజు తన స్వార్థమే తనదిగా భావిస్తాడని అమ్మకు బాగా తెలుసు అందుకే లాగే ఎద్దునే మరింత ఘుల్లు గట్టితో పొడుస్తోంది "

"ఆవిడ స్వార్థం తెలిసీ నువ్వు నిన్ను త్యాగం చేసుకుంటున్నావా రమణా?"

" "

"నన్ను వదలుకోవడం నీకు బాధగా లేదా రమణా! ఎంతకాలం వేచివుండను?"

ఆఖరి అస్త్రం ప్రయోగించింది

అయితే ఈ బాణం కూడా అతడిపై పనిచేయలేదు

"నిన్ను వదలుకోవడం ఎంత బాధాకరమై నన్ను తినివేస్తుందో వర్ణించ నక్కరలేదు—వర్ణించలేను. కారణం—అదికూడా కవిత్వంలోనికే లెక్కొస్తుంది పరాయి స్త్రీపై కవిత్వాలల్లే నీచస్థితికి దిగజారలేను "

బాధగా చూచిన ఛాయ, భారంగా నిట్టూర్చింది

"ఇదే నీ ఆఖరి నిర్ణయమా రమణా?"

"ఔను ఈ బలహీనుడిని మఱచిపోయి, చక్కని వ్యక్తిని వివాహమాడి కళ కళ లాడుతూ జీవించు. ఆ పెళ్ళికి నన్ను పిలవడం మఱచిపోకు "

"మంచిది థాంక్స్, సెలవ్" ఛాయ కంఠంలో దుఃఖంతోపాటు క్రోధంకూడా పలికినట్లు తోచింది రమణకు

(సశేషం)

# నీలి నీడలు

ప్రతిఫలంగా నా అందమైన శరీరం నీకర్పిస్తాను" - అర్పిస్తాను అనాలా? అనగూడదా? కొంచెంసేపు ఆలోచించింది ఆనేసింది అప్పుడు ఆమె కొంగు సరిగ్గా ఆమె కాళ్ళమీద వుంది

అతడు ఆమెవంక పరీక్షగా చూశాడు

తర్వాత—

ఇద్దరికీ చాలాసేపు వాదోపవాదాలు జరిగాయి

తర్వాత కథలో ముందుకొద్దాం

## 2

వినోదిని అందగత్తె

విజయ అందగత్తె

ఇద్దరి అందాలు చూసేవాళ్ళను కన్నులు దించనీయవు

కథలో ఇద్దరికీ ఏదైనా సంబంధముందా?

లేదు

స్నేహితులా?

కాదు

ఎప్పుడైనా కల్సుకొన్నారా?

ఆ అవకాశం కలగలేదు

ఇద్దరూ ఒక ఊరివాళ్ళు

అంతే—

## 3

"శివాజీ ప్రజల సొమ్ము తిన్న విధాన గూర్చి విచారణ జరిపి—ఆయనతో పైసలు కక్కించాలి" అన్నాడు ప్రసాద్

ప్రజలు విన్నారు

తలలూపారు

ప్రసాద్‌ను మెచ్చుకున్నారు

ఆ గ్రామానికి లీడర్‌గా అందరూ ఎన్నుకొన్నారు

ప్రసాద్ ఆమాట అన్నపుడు ఆయన కనులముందు సుశీల కనిపిస్తూవుంది

## 4

సుశీల ఎవరూ?—

ఆమె ఆత్మహత్య చేసుకుంది

ఎక్కడైనా కథలో అకస్మాత్తుగా వస్తే గుర్తు పట్టండి.

## 5

"మీరు కొన్నివేల రూపాయలు తిన్నారని ప్రజలు అనుకుంటున్నారు ఆ కూపీ లాగటానికి ప్రసాద్ అధ్యక్షతన ఒక కమిటీ వేశారు" అంది భర్తతో వినోదిని

విన్నాడు శివాజీ

"జీవితంలో నీతి-నిజాయితీగా వుండటం గొప్పదని నాఅభిప్రాయం ముఖ్యంగా మీరు ప్రజలలో తిరుగుతున్నారు"

సి.హెచ్.మధు

విన్నాడు శివాజీ

"మీ ప్రవర్తన నాకేమాత్రం నచ్చటం లేదు"

"ప్రసాద్ ప్రవర్తన నీకు నచ్చిందా?" హఠాత్తుగా అనటంతో వినోదిని కొంచెం ఆశ్చర్యపోయింది.

ఏమీ అనలేదు వినోదిని

"నేను మంచివాణ్ణని, ప్రజాసేవకునిగా భావించి-నన్ను ప్రేమించి పెళ్ళి చేసుకున్నావు నేను మంచివాణ్ణి కానని తెలిపోయింది ఆదర్శాలున్న భర్త నీకు కావాలి నీవు అందగత్తెవు ఒకనాడు ప్రసాద్ నిన్ను ప్రేమించాడన్నావు ఈనాడు ఆదర్శ ప్రజాసేవకుడని ప్రసాద్ గూర్చి ప్రజలు అనుకుంటున్నారు నీ లక్ష్యం సిద్ధిస్తుంది నీ ఆశ ఫలిస్తుంది. వెళ్ళు ప్రసాద్ వద్దకు"

వినోదినికి కోపమొచ్చింది "పిల్లలు లేకపోతే అట్లా చేసేదాన్ని" అనాలనిపించింది అనలేదు తర్వాత దుఃఖమొచ్చింది లేచి ఆయన నోరు మూసింది

దగ్గరగా లాక్కుంది.

## 6

విజయ లేచింది

తన పక్కలో నిద్రపోయి-కాదు—నిద్రపోకుండా-లేచి వెళుతున్న యువకుడిచ్చిన పది రూపాయలు తీసుకొంది

"ఇంతేనా?"—అడగలేదు అట్లాగని ముందుకూడా బేరం చేయలేదు.

## 7

లాడ్జింగ్ రూమ్

ఉదయం ఐదు గంటలయింది

శివాజీ ఒడిలోనుండి లేచింది పంచాయితీ సమితి అధ్యక్షురాలు రత్నాబాయి

"ఇక కొన్ని రోజులు దూరంగా



వుందామా?" అంది రత్నాబాయి

ఏమీ అనలేదు శివాజీ అర్థం చేసు కొన్నాడు తనమీద ఊరిలో జరుగుతున్న ఆరోపణలకు దూరంగా వుండాలను కుంటుంది రత్నాబాయి. తనపై నిందలకు ఆమె భాగస్వామి కాదా?

లాడ్జింగ్ రూమ్‌నుండి బయటి కొచ్చాడు

# 8

తెల్లవారి ఎనిమిది గంటలకు—

విజయ భర్త నారాయణస్వామి ఐదు రూపాయలిచ్చాడు విజయకు నారాయణ స్వామి గుడిలో పూజలు చేస్తుంటాడు గుళ్లో ఒక రూములో వుంటాడు

"నీకెన్ని వచ్చాయి" అడిగాడు నారా యణస్వామి

"ఇరవై వచ్చాయి రాత్రి ఇద్దరు వచ్చారు "

"నీవు తప్పులు చేస్తున్నావని నిన్ను గుడిలోనుండి తీసివేయాలని అనుకుంటు న్నారట దేవస్థాన కమిటీవారు

నవ్వింది విజయ

కమిటీలోని ప్రతి ఒక్కరూ తన వద్దకు వచ్చిన వాళ్ళేనని ఆమె చెప్పలేదు భర్తతో

# 9

ప్రసాద్ ముందు రెండు ఫైళ్ళు న్నాయి

ఒకటి శివాజీ ప్రజల డబ్బు తిన్న ఫైలు

రెండు విజయ గుడిలో సాగిస్తున్న పాడు పనుల ఫైలు

ఆలోచిస్తున్నాడు ప్రసాద్

ఇంకో లెటర్ పరిశీలించాడు రత్నా బాయి ప్రసాద్‌కు రాసిన లెటర్ శివాజీ విషయంలో సానుభూతిగా వ్యవహ రించమని—

జవాబు వ్రాసాడు ప్రసాద్

"శివాజీని మీరు సమర్థించటం మాను కోండి; మీ సంబంధాలకు స్వస్తి చెప్పండి; లేకపోతే రాబోయే ఎన్నికలలో మిమ్మల్ని సమర్థించలేము "

# 10

కథను మొదటికి తెద్దాం

"ప్రతిఫలంగా నా అందమైన శరీరం నీ కర్పిస్తాను" అంది వినోదిని

ఆశ్చర్య చకితుడయ్యాడు ప్రసాద్

ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు అందమైన కనులు పరిశీలనగా చూశాడు గుండ్రటి ముఖం ఎర్రగులాబీలా రంగు, అందంగా కనిపిస్తున్న ముక్కు, పంకా గాలికి ఎగిరిపడుతున్న వెంట్రుకలు, పొడుచుకొస్తున్న స్తనాలు, స్తనాలమీద జాకెట్ వుంది చీరలేదు నల్లచీర తెల్ల జాకెట్ మెడలో నల్లపూసల తాడు

శివాజి ఇంతగా ప్రజల సొమ్ముతిని ఏమిచేశాడు? భార్యకు మెడలో నల్ల పూసల తాడు మాత్రమే సంపాదించాడా?

ఆలోచన అందలేదు ప్రసాద్‌కు

ఆమెను చూస్తున్నాడు

హృదయంలో ఆవేశం పరవళ్ళు తొక్కుతుంది

అంతకుముందు చాలా కథ జరిగింది. తన భర్త శివాజీ ప్రజల డబ్బు బాగా తిన్నాడని-ఆ ఆరోపణలతో ప్రసాద్‌లో ఒక కమిటీ వేశారని తెల్సి-ఒక రాత్రి




ప్రసాద్ ను పిల్చింది వినోదిని

"ప్రసాద్ నేనంటే నీకు కోపమని నాకు తెల్సు కాని నాకీనాడు గత్యంతరం లేదు నాభర్త తిన్నాడో లేదో నేను ఆలోచించటం లేదు ఇద్దరు పిల్లల తల్లిని పిల్లలు బ్రతకాలి. పాత స్నేహితం మనది నేను కాదనవచ్చు కాని నీవు నన్ను స్నేహితురాలిగా భావించావు నన్ను నా పిల్లల చూచి ఆయనను రక్షించమని కోరుకొంటున్నాను" అంది వినోదిని-ఆమె కన్నులలో నీళ్ళు

"వినోదా! నీ పెళ్ళి కాకముందు నిన్నిలా పిల్చేవాణ్ని. నీకు పెళ్ళి అయ్యింది పిలవటం తప్పే కాని స్వేచ్ఛ-ఇది ప్రజల సొమ్ము. ప్రజల విషయం ప్రజలకు తెల్సిన విషయం నేనేమీ చేయగలను?-నేనేమి చేయలేను నామకార్థం మనిషిని "

"నీవు చేయగలవు నీకు ప్రజలలో విపరీతమైన పలుకుబడి వుంది "

"నేను చేయగలను కావొచ్చు కాని చేయదల్చుకోలేదు ఒకటైతే ఏమైనా చెయ్యొచ్చు కాని తెల్సినవి పదికేసులు ఒకటి దేశరక్షణ నిధి పేరుతో కొన్ని వేలు వసూలు చేసాడు రెండు ఒక డ్రామా యువజనసంఘం పేర వేసి వచ్చిన డబ్బులు తిన్నాడు మూడు ఈ వూరుకు కాలువ తెప్పిస్తానని రైతుల వద్దనుండి కొన్నివేలు తిన్నాడు "

"చెప్పకు" అడ్డుపడింది వినోదిని "కావొచ్చును తినొచ్చును కొన్నివేలు తిన్నాడు కొన్ని లక్షలు తిన్నాడు కాని. నామెడలో నల్లపూసల తాడు తప్ప వేరే లేదు నా పిల్లలకు నేటికి తింటానికి తప్ప రేపటికి లేదు ఏం చేశాడంటావు డబ్బులు?"

రాత్రి తొమ్మిది గంటలు కొట్టింది గది అంతా ట్యూబ్ లైటు వెలుగు ఇటు

కుర్చీలో ప్రసాద్ కూర్చున్నాడు అటు క్రింద గచ్చునేల మీద వినోదిని కూర్చుంది పిల్లలు నిద్రపోతున్నారు

"ఏమి చేశాడో నాకేం తెల్సు ప్రజలు అది గ్రహిస్తారా?"

"ఆ మాట నేను అనటంలేదు ఆయన వెనక వున్న వ్యక్తుల సంగతి మీరు పట్టించుకోదల్చుకో లేదా?"

"ఎవరంటారు వారు?"

"నీకు తెలియదా? నీకంతా తెల్సు ఎం ఎల్ ఎ. పంచాయితీ సమితి ప్రెసిడెంట్ ఇంకా కొందరు"

"వినోదా, నీవు పిచ్చిదానివి ఆరోపణలు ప్రజల నుండి వచ్చిన తర్వాత వాళ్ళంతా ఆయన నుండి తప్పించుక తిరుగుతున్నారు"

ఏమీ మాట్లాడలేదు వినోదిని

ఐదు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచింది

"ఒకే మంచంలో నిద్రపోయిన పంచాయితీ సమితి ప్రెసిడెంట్ రత్నాబాయి కూడా నీ భర్తతో తప్పించుక తిరుగుతూ వుంది"

ఆశ్చర్యపోయింది వినోదిని

"ప్రసాద్ నా ముందు అలాంటి మాటలు మాట్లాడకు ఆయనతో ఒకే మంచంలో నిద్రపోయిన వారు చాలా మంది వుండవచ్చు నా ముందు ఆ చర్చ అవసరం లేదు"

"అదికాదు వినోదా!"

"కాదు ప్రసాద్ ఈ గ్రామానికి నా భర్త అపారమైన సేవ చేశాడనే సంగతి ఒప్పుకుంటావా?"

"ఒప్పుకుంటాను. ప్రజలు కూడా ఒప్పుకుంటారు కాని ప్రజలు వారి సొమ్ముకు తినటం ఒప్పుకోరు. వారిది తీవ్రమైన నేరంగా భావిస్తారు"

"వారు పరిగణించటం లేదు నువ్వే పరిగణిస్తున్నావు నువ్వే ప్రజలను రెచ్చగొడుతున్నావు. నా మీద కక్ష తీర్చుకొంటున్నావు" ఆవేశంతో అంది వినోదిని

ముఖంలోకి సూటిగా చూశాడు ప్రసాద్ ఆమె భయపడటంలేదు

"నేను భయపడను ప్రసాద్ నామీద పాతకక్ష తీర్చుకుంటున్నావు"

ఆమాట వినోదిని అనటానికి పాత కారణాలున్నాయి

అవికాలేజీలో చదువుతున్న రోజులు. ప్రసాద్ వినోదిని ఒకే కాలేజీలో చదువుతున్నారు అప్పటికే శివాజీకి గ్రామంలో విపరీతమైన పలుకుబడివుంది - వినోదిని చదువుతున్న ఊరుజిల్లాకేంద్రం శివాజీ ఊరువేరు కాని శివాజీకి ఆ జిల్లాలో చాలా పలుకుబడివుంది వినోదిని ప్రసాద్ చదువుతున్న కాలేజీలోకూడా శివాజీకి పలుకుబడివుంది కాని అప్పటికే ప్రసాద్‌కు ఆయనమీద భ్రమలు చెల్లాచెదరవుతున్నాయి

ఆ దశలో ప్రసాద్ వినోదినితో ఒకనాడు అన్నాడు, "నేను నిన్ను ప్రేమిస్తున్నాను పెళ్ళిచేసుకుంటాను"—అని వినోదిని ఆశ్చర్యపడలేదు ఆయన అడుగుతాడని ఆమెకుతెల్సు అంటే ఆమె అట్లా ప్రవర్తించిందని కాదుకాని ప్రసాద్ పై ఖరి ఆమె మొదటే గుర్తుపట్టింది కొన్నిరోజులనుండి ఆయనను రిసెర్చ

చేస్తూవుంది

వినోదిని అంది

"ప్రసాద్ నిన్ను నేను ప్రేమించటం లేదు పెళ్ళిసంగతి లేదు"

ప్రసాద్ ఖిన్నుడయ్యాడు.

పది నిమిషాల తర్వాత—

"ప్రసాద్! నేను శివాజీని ప్రేమిస్తున్నాను ఆయనకు దేశంమీద ప్రజలమీద వున్న అభిమానం నాకు నచ్చింది పెళ్ళి చేసుకోవాలను కుంటున్నాం" అంది

ప్రసాద్ ఆశ్చర్య చకితుడయ్యాడు ఏదో చెప్పాలని నోరు తెరిచాడు గాని చెప్పలేదు

కొన్నిరోజుల తర్వాత వినోదిని శివాజీ పెళ్ళి జరిగింది

అందుకే పాత కారణాలు అంది వినోదిని

"నిజం వినోదా! నేను పాత కారణాలను దృష్టిలో ఉంచుకోలేదు"

"ప్రసాద్ ఒక్కమాట చెప్పమంటావా?"

"ఏమిటి?"

"నీవు నన్ను ప్రేమించావు. నేనంటే నీకు యిష్టం నా శరీరమిష్టం. నీకు నా శరీరమిస్తాను నా భర్తను రక్షించు ప్రతిఫలంగా నా అందమైన శరీరమిస్తాను"— అంది ఈ దశలో వినోదిని

కథలో మొదటికొచ్చాం మనం

ఆశ్చర్యపోయాడు ప్రసాద్

వినోదినేనా మాట్లాడేది!?

"ఆశ్చర్యపోతున్నావా ప్రసాద్ నిజమే చెబుతున్నాను."

"ప్రేమించి పెళ్ళి చేసుకున్నావు"

"అందుకే"

ఆశ్చర్యంనుండి తేరుకొని వినోదినిని చూశాడు చాలా అందంగావుంది కాలేజీలో ఎట్లావుండేదో పిల్లలు కలిగినా అట్లాగేవుంది

"వినోదా! నేనెందుకు నీ భర్తమీద కక్ష తీర్చుకోవాలనుకొన్నానో నిజం చెపుతున్నాను నీకా సంగతి తెలియదు ఈ ఊరిలో సుశీల అనే ఆమె వుండేది. మీ భర్తకంటే వయస్సులో పెద్దది ఆమె భర్త ఆమె వయస్సులో చనిపోయాడు. అప్పుడు నేను పిల్లవాణ్ని వాళ్ళింటికెళ్ళేవాణ్ని పిల్లవాణ్నికదా మంచిగా మాట్లాడేది ఏమైనా కొనిచ్చేది భర్త చనిపోయిన తర్వాత ఆయనకున్న అపారమైన ఆస్తి-ఈమెకొచ్చింది ఎట్లా జరిగిందో ఏమోగాని-మీభర్త ఆమె ప్రేమించుకున్నారు"

కొంచెం మాట ఆపి వినోదిని ముఖంలోకి చూశాడు

వినోదిని ముఖంలో ఆశ్చర్యం కనిపించనందుకు ప్రసాద్ ఆశ్చర్యపోయాడు

"ఊరిలో మీభర్తను ఆనాడు దేవునిలా పూజించేవారు తన నివాసాన్ని ఆమె యింట్లోకి మార్చారు. ప్రజల్లో తిరగటం మొదలెట్టాడు ఊరిలో ఎన్నో పనులు చేశాడు ఎన్నికలలో నిల్చున్నాడు గెల్చాడు ఇవన్నీ ఎవరి డబ్బులతో— ఆమె డబ్బులతో

ఆమె ఆస్తి సగమయ్యింది

అప్పుడుకూడా ఆమె యింటికి తరచుగా వెళ్ళేవాణ్ని ఆమె నన్నెంతో ప్రేమతో చూసేది

నాకింకా జ్ఞాపకముంది ప్రజలుకొంత శాతం భరిస్తే ఈ ఊరుకు రోడ్డు మంజూరు

# కొస్త దాహం దయచేయండి బాబూ

ఎండలు మండిపోతున్నాయి పైరులు ఎండిపోతున్నాయి —మనుషులకు —ఇది సహజమే

వానలు రాష్ట్రంలో కురుస్తున్నాయి కాని కొన్నిచోట్ల విపరీతమైన దాహం వేస్తున్నది —పొలాలకు యిది అసహజం

ఏటేటా ఎన్నో వందల కోట్లు సేద్యపు నీటిపారుదల ప్రాజెక్టుల మీద ఖర్చుపెడుతున్నాం. ఈ యేటి వార్షిక ప్రణాళికలో యీ రంగానికి రు **107 17** కోట్లు కేటాయించారు అయినా ఇంకా ఎన్నో ప్రాంతాలకు నీటిపారుదల సౌకర్యం లేదు

రెండు నెలల క్రితం వెంకటస్వామికి ఎకరన్నర మిగులు భూమి పట్టా యిచ్చారు అది అనావృష్టి ప్రాంతం ప్రాజెక్టులు అతనికి అందవు వేరే నీటివనరుల్లేవు

ఆ ప్రాంతంలో యిప్పుడు గొట్టపుబావి త్రవ్విస్తున్నారు భూగర్భ జలాలను వెలికి తీస్తేగాని మన పొలాల దాహం తీరదు

అనావృష్టి ప్రాంతాల్లో యిందుకోసం ప్రత్యేక కృషి జరుగుతున్నది

ప్రజా సౌకర్య పథకాల్లో చేయవలసింది ఎంతో వుంది ఎంత చేసినా ఇంకా మిగిలే వుంటుంది వెనుకచూపు లేకుండా పని చేసుకుంటూ పోవడమే మన పని

—:o—

సమాచార, పౌరసంబంధశాఖ హైదరాబాదు.

చేస్తామన్నారు ఆ డబ్బుకు మీభర్త ఇవ్వా లనుకున్నాడు ఎట్లా? ఆమె ఆ స్థిలో నుండి — సుశీల అంగీకరించలేదు

కొట్టి-తీసుకెళ్ళాడు

ఆరాత్రి —

సుశీల ఆత్మహత్య చేసుకుంది"

చాలాసేపు ఆగాడు ప్రసాద్ ఆయన ముఖంలో విషాదం అలుముకుంది

"సుశీల అంటే నాకు గౌరవం ఆమె నన్ను ప్రేమతో చూచేది ఆ కక్షను మీ భర్తమీద తీర్చుకోవాలని చాలాకాలం నుండివుంది ఇపుడు అవకాశం దొరి కింది "

ఇపుడు షాక్ తింది వినోదిని అయినా ముఖంలో ఆశ్చర్యం కనిపించలేదు

అకస్మాత్తుగా కరెంటుపోయింది

గడియారం పదిగంటలు కొట్టింది

## 11

సరిగ్గా ఇదే సమయంలో —

విజయ ఆలోచిస్తూవుంది

తనను గుడిలోని ఒక రూమ్‌నుండి వెళ్ళిపొమ్మంటున్నారు

గట్టిగానే అంటున్నారు

ఆ కమిటీ మొత్తం ఆమాటే అంటు న్నారట

ఏం చేయాలి?

ఎటు వెళ్ళాలి ఈ పిల్లలతో?

సరిగ్గా పది ఏళ్ళక్రితం ఈ గుడి కట్టించటానికి తనభర్త ఎంతో సహాయం చేసాడు అందుకు ప్రతిఫలంగా - కాదు - అప్పుడు కొత్త దేవస్థానం అధ్యక్షుడు శివాజీగారు ఆయనకు ఒక రాత్రి ఆనందం పంచి యిచ్చినందుకు ప్రతిఫలంగా- ఈ రూము నిచ్చారు శాశ్వతంగా యిస్తున్నా మని ఆనాడు అన్నారు ఐదు ఏళ్ళక్రితం శాశ్వతంగా యిస్తున్నామని ఒక తీర్మానం కూడా చేసారు కాని ఈనాడు తనను వెళ్ళి పొమ్మంటున్నారు

ఎందుకూ?—

తను వేశ్యగా జీవిస్తున్నానని—

నిజమే కాని ఏం చేయాలి? తన భర్త పూజారి డబ్బులు రావు పిల్లలు ఆకలి గత్యంతరం లేదు

ఈ కమిటి సభ్యులంతా ద్రోహులు తనను వాడుకొన్నంతకాలం వాడుకొని— తర్వాత — నీతిగూర్చి - తనను బలి చేయాలనుకుంటున్నారు ఇందులో నీతి వున్నవారెందరూ?-

ఇప్పుడు తానేం చేయాలి—

ఎవరు రక్షించగలరు ?

ప్రసాద్

అవును మంచి వ్యక్తి

గ్రామంలో పలుకుబడి గలవ్యక్తి

రేపు కలవాలి

## 12

ఉదయం పది గంటలకు తన ఆఫీ సులో కూర్చుని కళ్ళుమూసుకొని-తలను కుర్చీ వెనుకకు జారగిలవేసి ఆలో చిస్తున్నాడు ప్రసాద్

రాత్రి వినోద యింట్లో కరెంట్ పోయింది

తర్వాత

"ప్రసాద్‌గారూ" ఎవరో పిల్చారు

కళ్ళు తెరిచాడు

ఎదురుగా విజయ

ఆశ్చర్యపోయాడు

"కూర్చోండి!"- కుర్చీ చూపించాడు

కూర్చుంది విజయ

# ఆ ఊరు పేరేమిటో చెప్పండి

ఈ భూమి బాగుపడేదెప్పుడు, యీ తల్లి పండేదెప్పుడు
నా పిల్లలు తినేదెప్పుడు, దరిద్రం తీరేదెప్పుడు?
చేతికందిన పట్టా నోటికందుతుందా లేదా అని సిరిపురపు
కాశయ్య ఆలోచనలో పడ్డాడు

అతనొక్కడేకాదు, అవూళ్ళో యింకా చాలామంది హరిజనులు
అలాగే అనుకున్నారు

కాశయ్య కుటుంబం రాత్రింబవళ్లు శ్రమపడి ఆ రెండె
కరాలు బాగుచేసుకున్నారు అందరికీ ఆదర్శమయ్యారు
ఆ తరువాత ప్రభుత్వం ఏమైనా ఆదుకున్నదా
ఆ రాళ్లనేల పండిందా? ఆ కుటుంబం
దరిద్రం తీరిందా?

ఎవరో చెప్పడం దేనికి? స్వయంగా వెళ్ళి చూడండి
పత్రికా ప్రతినిధులు వెళ్ళివచ్చారు అడిగి తెలుసుకోండి
ఆ వూరు ఏ వూరో చెప్పలేదే

అలాంటివి చాలా వున్నాయి తెనుగుదేశంలో ఏవూరు వెళ్ళినా
తెలుస్తుంది

ఆ కాశయ్య తన చేలో విత్తనాలు చల్లాడు చూశారూ
అవే ఒక నిరుపేద కుటుంబ సౌఖ్యానికి ఆది బీజాలు
తెలుగు నేలలో పేదతనం నిర్మూలనానికి తొలి బీజాలు

—·o—

సమాచార, పౌరసంబంధ శాఖ హైదరాబాదు.

ప్రసాద్ ఆలోచనలు రాత్రిలో తిరుగుతున్నాయి

కరెంట్ పోయింది

తర్వాత

వినోదినిని దగ్గరగా లాక్కొన్నాడు

"ప్రసాద్‌గారూ! మీతో ఒక పని వుండి వచ్చాను" అంది విజయ

ఆలోచనలనుండి బయట పడ్డాడు

తన కథ చెప్పింది విజయ

తనకు ఇంతకుముందే ఈ కథ తెల్సు.

"మీరు సహాయం చేయాలి" అంది

ప్రసాద్ రాత్రిమీదికి ఆలోచనలు వెళ్ళుతున్నాయి

వినోదినిని దగ్గరగా లాక్కొన్నాడు

మళ్ళీ అంది విజయ.

"మీరు సహాయం చేయాలి"

రాత్రినుండి బయట కొచ్చాడు ప్రసాద్

"ఏంచేయాలి?"

"నన్ను అక్కడినుండి వెళ్ళగొట్టకుండా చూడాలి" విజయను చూస్తున్నాడు ప్రసాద్ ఆ కళ్ళను ఆ వెంట్రుకలను

ఆ ముక్కును ఆ ముఖాన్ని ఆ చీరెను ఆ జాకెట్‌ను ఆ అందాన్ని

వినోదిని కంటె విజయ అందంగా వుంది

"చేస్తాను" అన్నాడు రాత్రి మళ్ళీ మెదడులో వాలింది రాత్రి తాను ఓడి

"మీరు చేస్తే నేను నా పిల్లలు బ్రతికిపోతాం."

"చేస్తాను కాని

"చెప్పండి!"

"చాలా రోజులనుండి మీకో విషయం చెప్పాలనుకుంటున్నాను "

రాత్రి మళ్ళీ జ్ఞాపకం మొచ్చింది.

రాత్రి తాను ఓడిపోయాడు.

"ఏమిటీ?"

"నీవు నాకు కావాలి"—ఈమాట అనగానే ప్రసాద్‌కు మళ్ళీ రాత్రి జ్ఞాపకమొచ్చింది

వినోదినిని దగ్గరకు లాక్కొన్నాడు ఆమె తన చేతిని దూరంగా నెట్టుతూ "నేను నా నిర్ణయం మార్చుకొన్నాను ప్రసాద్ నీ నిజస్వరూపం తెల్సింది నా భర్త నీచుడే కావచ్చు. కాని నీవు ప్రజల మనిషినికాదు నీకున్న వ్యక్తిగతమైన పాత కక్షను ప్రజల పేరుతో తీర్చుకుంటున్నావు. ఇలాంటి వారంటే నాకు నచ్చదు. అసహ్యం కూడా ప్రజలను స్వార్థం కోసం వినియోగించుకునే వారంటే— నా దృష్టిలో అల్పులు నీవు నా భర్తకంటే గొప్ప వానివి కాదు" అంది వినోదిని

రాత్రిలా తానిపుడు ఓడిపోతాడా·—

ఇంకా రాత్రి ఏమంది విజయ.

ప్రసాద్ మాటలకు చాలా కాలం ఆశ్చర్యం—అనుభవించి — మాట్లాడింది విజయ

"ప్రతిఫలంగానా?"

"కాదు ప్రేమ" అన్నాడు. ఆయన కళ్ళముందు రాత్రి తిరుగుతూవుంది.

"ఇంకోమాట సుశీల ఆస్తిపోతుందని చచ్చిపోలేదు నాకు తెల్సు ఆమె అపుడు మూడు నెలల గర్భవతి సమాజంలో తలెత్తుకునే ధైర్యం లేక చచ్చిపోయింది" అంది వినోదిని రాత్రి.

ఇంకా ఏమంది?—

ఏమన్నా—

రాత్రి తాను ఓడిపోయాడు

ఇపుడు ఓడి పోకూడదు

వినోదిని కంటే విజయ అందమైనది

తన బోనులో కొచ్చింది

"ప్రసాద్‌గారూ! ప్రేమపదం నాకు నచ్చదు. మీరు ఇలాంటివారని నేను అనుకోలేదు నేను వేశ్యనే పదిమందికి శరీరమిచ్చాను, మీ కివ్వటానికి ఇంత వరకు అభ్యంతరంలేదు"

ప్రసాద్ షాక్ తిన్నాడు

రాత్రి కూడా

"ప్రసాద్! ఒక నాడు నన్ను ప్రేమించానన్నావు నేను శివాజీని పెళ్ళి చేసుకుంటానని తెల్సిననాడు శివాజీ సుశీలను వుంచుకొన్నాడని నీవెందుకు చెప్ప లేదు? అంటే నేను నష్టపోతే బాగుండు ననుకొన్నావు ఇది ప్రేమేనా?" వినోదిని అనగానే షాక్ తిన్నాడు

ఒక దిక్కు విజయ మాట్లాడుతున్న పుడు ప్రసాద్‌లో రాత్రిజ్ఞాపకమొచ్చింది.

"ఇపుడు ఎందుకో నా మనసు అంగీక రించటంలేదు అందరిలాంటి వాడని కావని ఒక మంచి ప్రజల మనిషినని నీదగ్గరి కొచ్చాను కాని నీరూపం తెల్సింది" రాత్రి ఆలోచనలు తిరుగు తుండగా విజయ అంటున్న ఈ మాటలు వింటున్నాడు.

రాత్రి—

ఎంత అకస్మాత్తుగా కరెంట్ పోయిందో అంత అకస్మాత్తుగా కరెంట్ వచ్చింది.

"ఇక వెళ్ళచ్చు తీర్చుకో కక్ష" అంది వినోదిని రాత్రి

తన ముఖంలో గుండుసూది గుచ్చినా అపుడు రక్తమొచ్చేది కాదేమో!—

ఇట్లా రాత్రిని జ్ఞాపకం చేసుకుంటూనే విజయ అంటున్న మాటలు వింటున్నాడు

"ఇపుడు నీకు నా శరీరాన్ని యివ్వ లేను. నాపని నాకున్నా ఫర్వాలేదు" వెళ్ళి పోయింది

ప్రసాద్ ముఖం ఆమె కట్టుకొన్న నల్లచీరెలా అయ్యింది

## 13

ఆ రాత్రి—

శివాజీ తన భార్యతో—

"ప్రసాద్ నామీద కక్ష సాధిస్తు న్నాడు నన్ను జైలుకు పంపిస్తాడు" ఏదోవిధంగా ఆయనకు " అన్నాడు

వినోదిని అర్థం చేసుకుంది "నాకు యిష్టంలేదు" అంది

అదే సమయంలో—

నారాయణస్వామి భార్యతో—

"ప్రసాద్‌తో ఒక్కరాత్రి నీవు గడిపితే ఆయన మనకు సహకరించగలడు" అన్నాడు

"ఇంటినుండి వెళ్ళిపోదాం కాని ఆపని నేను చేయను" అంది విజయ






ఏర్ కండిషన్డ్ రూము తలుపు తెరచుకొంది

తలుపు తెరిచి వోరగానించున్న ఒరియా నౌకరు మహాపాత్రో వినయంగా సలాం చేస్తూ "ఎమ్ డీ గారు దైచేమన్నారు సార్ తమర్ని" అన్నాడు

"సరి! ఎంతసేపయింది?"

"ఐదునిముషాలయింది సర్"

"ఫోన్ చేశారా?"

"లేద్సార్. వారే స్వయంగా మనరూం దగ్గరకొచ్చి పిలిచారు సర్"

"ఐసీ___"

కుర్చీదాకా వెళ్ళికూడా అందులో కూర్చోకుండా దాన్నోసారి గిర్రునతిప్పాను నా మనసులో ఆలోచన్లుకూడా గిర్రున తిరగడానికి ప్రయత్నం చేసేయి ఎమ్ డీ గార్నోసారి తలవగానే "టేకిట్ ఈజీ బాస్" అన్న ధోరణిలో నలభయిరెండు మెట్లూదిగి రెండో అంతస్తులో వున్న ఎమ్. డి గారి గదిదగ్గిరకి వెళ్ళాను

ఎమ్ డి గారి రూం తలుపుకి మీదుగా ఆయన ఖాళీగా వున్నారని తెలిపే పసుపు పచ్చదీపం వెలుగుతోంది దర్వాను రెండు చేతులా నమస్కారం చేసి తలుపు తెరచి పట్టుకున్నాడు

"గుడ్మార్నింగ్ సర్" అంటూ లోపల ప్రవేశించాను

మేనేజింగ్ డైరెక్టరుగారు తనసీట్లో లేరు రిలాక్సింగ్ సోఫాసెట్లో ఇద్దరికీ

సరిపడె సోఫాలో కూర్చుని వున్నారు. సింగిల్ చేర్, ఎదురుగా టీపాయ్ ఖాళీగా వున్నాయి.

"గుడ్మాణింగ్ హౌ ఆర్యు మిస్టర్ కృష్ణయ్యా!"

"ఫైన్ సర్-" అని చేయిచాపాను.

"ఐనో, ఐనో! అని చిరునవ్వుతో నా చెయ్యిఆడించి"ప్లీజ్ బి సీటెడ్"అన్నారు

"థాంక్యూ సర్." అంటూ కూర్చున్నాను

మేనేజింగు డైరెక్టరుగారు కాలితో బెల్ నొక్కారు జపనీస్ క్రైమ్స్ ఇంపైన చప్పుడుతో మోగాయి మరుక్షణం దర్వాను తలుపు ఓరగాతెరచి వినయంగా వంగాడు

"ఎవర్నీ పంపొద్దు టెన్ మినిట్స్" అని కరుగ్గా చెప్పారు ఎం డి

"ఎస్సార్"

తలుపు మూసుకుంది తలుపుకు పైన అవతలకీ ఇవతలకీ కనపడే యెర్రదీపం అందంగా వెలిగింది అది అలా వెలిగినంతకాలం ఆ గదిలోకెవరూ అడుగు పెట్టడానికి వీల్లేదు

ఎం డి గారు సోఫాలో దిండు సరి చేసుకుని విశ్రాంతి తీసుకునే భంగిమలో కాళ్ళుజాపి కూర్చున్నారు

సిగరెట్టు పెట్టెతీసి ఆయనొకటి వెలిగించి పెట్టె, లైటరు అందించారు.

ఒళ్ళంతా మెలికలు తిప్పుకుంటూ "థాంక్యు సర్" అన్నాను, సిగరెట్టు పెట్టెను సుతారంగా దూరంగా తోస్తూ

"తీసుకోండి మీరు కాలుస్తారని నాకు తెలుసు!" అన్నారు ఎం డి.

బాగుండదని తీసుకున్నాను దర్జా ఐన ఫారిన్ సిగరెట్టు రెండుదమ్ములుపీల్చి భయంగా చూస్తున్నట్టు నటించాను "స్వయంగా నా రూంకొచ్చి పిలిచారట సార్," అన్నాను

"మీరు సదుపాయంగా కూర్చోండి " అన్నారు ఎం డి

"నోసర్! నాకిలా బావుంది!" అన్నాను కుర్చీలో యిబ్బందిగా కదిలి

"మీతో నేను పదినిమిషాలు గడపాలి. మీరు సౌఖ్యంగా కూర్చోడం నా అభిమతం!" అని, టీపాయిని చేత్తో నాకాళ్ళ దగ్గరకు తోశారు "మీరు దానిమీద కాళ్ళు పెట్టుకుని హాయిగా కూర్చుంటే, నేను ఇలాంటి మర్యాదలమీద టైంవేస్టు చెయ్యకండా మాట్లాడగలను!" అన్నారు ఎమ్ డి. కఠినంగా

తప్పిందిగాదు!

కుర్చీలో వెనక్కు చారబడి, కాళ్ళు రెండూ టీపాయ్‌మీద రెస్టుచేసి, మా యింట్లోనో, ఆఫీసులో నా రూమ్‌లోనో కూర్చున్నట్టు కూర్చున్నాను, కింగుసైజు ఫారిన్ సిగరెట్టు ఇంకా ముప్పాతిక భాగం వుంది

* * *

"నేనిక్కడికి ఎం డి గావచ్చి రెండేళ్ళయింది!"

"ఎస్సార్ "

"ఈ రెండేళ్ళలో మిమ్మల్ని స్వయంగా కలవడం—ఇవాళ్టి సమావేశంతో— పంధొమ్మిదిమాట్లు "

"సాకీసార్ వర్క్ యెక్కువగా వుంటోంది కాగితాలు పంపిస్తే తమరు




ఆర్డర్సు వేస్తూనేవున్నారు స్వయంగా వచ్చి మిమ్మల్ని డిస్టర్బ్ చేయడమెందుకని — అవసరం వుంటేతప్ప తమర్ని బాధపెట్టడం లేదు" అన్నాను

"మంచిదే. కాని కాగితాలు చూసినంత మాత్రంచేత బోధపడనివి ఏవివున్నా నేను కూడా మిమ్మల్ని శ్రమ పెట్టకుండా మీ డిప్యూటీతోమాట్లాడి సెటిల్ చేస్తున్నాను "

"యస్సార్ ఆయన నాతో అప్పుడప్పుడు చెప్తారు బాస్ పిలిచారు, ఫలానా విషయంగురించి అడిగారు ఆర్డర్సువేసారు అంటానూ ఆర్డర్సు పడ్డాయని రిలీఫ్‌గా వున్నప్పటికీ తమరు నన్నేపిల్చి అడగలేదేమా అని అప్పుడప్పుడు ఖేదం కలుగుతూనే వుంటుంది నాకు" అన్నాను

ఎం డి గారు అందంగా నవ్వారు "మీ డిపార్టుమెంటులో ఏదేనా ఫైలు కాగితంద్వారా నాకు వివరం ఆమూలాగ్రంగా అందించలేకపోతే నేను ముందుగా పిలిచేది మిమ్మల్నే కాని మీరు దొరక్క కాగితం సెటిలవకండా నా దగ్గరుండిపోవడం నాకు యిష్టం వుండక, మీ డెప్యూటీ చెప్పినదానిమీద ఆధారపడాల్సి వస్తూంది: — ఆసంగతి మీకెప్పుడూ తట్టలేదా:"

కాళ్ళు టీపాయ్ మీదినుంచి తీసేశాను.

ఈ డెప్యూటీగాడు ఇంతపని చేస్తాడా అని నాకు కసికలిగింది నిమ్మకు నీరెత్తినట్లు నిశ్చింతగా మాటల్తో గోతులు తవ్వుతున్న ఎం. డి ని చూసి భయం వేసింది కూడా

"లేదుసార్ అలా నేనెప్పుడూ అనుకోలేదు బై దిబై నేను దొరకలేదన్నారా సార్?" అన్నాను. చిన్న ఆధారం ఏదైనా దొరక్కపోతుందా. దబాయించలేకపోతానా అని

"కంగారు పడకండి కృష్ణయ్యగారూ. సరిగానే కూర్చోండి" అని ఆయన లేచి

మళ్ళా నేను యిందాకటిలా కాళ్ళుజాపి కూర్చునేవరకు ఆ మర్యాదల్లో కాలం గడి పాడు "ఈజీగా కూర్చోండి మీరు బిగిసిపోయి కూర్చోవలసిన అవసరం లేదు ఇక్కడ మీ కెవ్వరూ ఫోటో తియ్యరు" అన్నారు మధ్యలో

"విషయం ఏమిటంటే, మిమ్మల్ని చూడాలనుంటే నాకు ఒకటే మార్గం నా పి ఏ తో చెప్పడం మీగురించి నేను ఈ రెండేళ్ళలో నూటతొమ్మిదిసార్లు నా పి ఏ ద్వారా కబురు చేశాను అందులో ఏడుసార్లే మీరు నాకు దొరికారు మిగిలిన నూటరెండు సార్లూకూడా, దురదృష్ట వశాత్తు మీరు లేరనే తెలిసింది"

మళ్ళా కాళ్ళు టీపాయ్‌మీంచి తీశాను

ఎం డి తనుకూడా బిర్రబిగిపి కూర్చున్నారు "లేనిపోని లాంఛనాలెందుకు కృష్ణయ్యగారూ మీరు యింట్లోగానీ, ఆఫీసులో మీ రూంలోగాని, చివరికి ఏదేనా వుద్యోగానికి అభ్యర్థులను ఇంటర్‌వ్యూ చేసేటప్పుడుగాని కాళ్ళు రెండూ టేబిల్‌మీదే పెడతారుగదా అలా కూర్చుని ఫ్రీగా మాట్లాడండీ అంటే ఎందుకు గడీకోసారి కాళ్ళుతీసేడం, బిర్రబిగిసిపోవడం ఈఅర్థంలేని లాంఛనాలు?"

పళ్ళు పటపట కొరుక్కున్నాను ఎవడో కాకారాయుడు చెవులు కొరుకితే మాత్రం, అవన్నీ విని లెక్కకి తీసుకోడమేమిటి ఈయన?

"మీరు ప్రతిరోజు ఆఫీసుకు పదిగంటలకు రావాలి పావుతక్కువ పదకొండుకు వస్తారు ఒంటిగంటకు లంచ్‌బోర్డుపెట్టి మూడుగంటలకు తీస్తారు, ఐదుగంటలకు వెళ్ళిపోవచ్చు. కాని నాలుగింటికే వెళ్ళిపోతారు. మొత్తం మీకిచ్చే మూడువేల రూపాయల జీతానికి మీరు పనిచేసేది రోజుకు మూడేగంటలు!"

"మీరనేది నిజంగాదని నాఅనుమానం" అన్నాను ఆయన మాట్లాడుతూ ఆగకపోతే అదీ అనలేనేమో అనిపించింది

"మీకనుమానం — కాని నాకు నమ్మకమే!" అని కళ్ళురెండూ మూసుకున్నారు ఎం డి

తన పెద్ద టేబిలువైపు చూపించి "మీరేమీ అనుకోకపోతే" అన్నారు

నేను లేచి నిలబడ్డాను, యాంత్రికంగా

"నా టేబిలు మీద ఎర్ర పేపరు వెయిటు కింద టైపుచేసిన కాగితాలున్నాయి"

వెళ్ళి తెచ్చాను

ఆయన కళ్ళు తెరవకండానే అన్నారు.

"ఆ కాగితాల్లో అంకెలు చూడండి అవన్నీ మీరు, ఆఫీసునించి, ఆపరేటరు సహాయంతో మాట్లాడిన టెలిఫోన్ నెంబర్లు ఆఫీసు పనిచేసిన రోజుల సంఖ్య చేత ఆ లిస్టులో వున్న టెలిఫోన్ నెంబర్ల సంఖ్యను భాగిస్తే రోజుకు సరాసరిని నలభై రెండు కాల్సుపడ్డయి ఈ టెలిఫోన్‌కాల్స్ నిమిత్తం కంపెనీచెల్లించవలసిన సొమ్ము గురించి కాదు, నాబెంగ కంపెనీలో వొక ముఖ్య అధికారిగా రోజుకు మూడే మూడు గంటలు ఆఫీసులో కూర్చుంటూ, నలభై రెండు మూళ్ళు నూటఇరవయ్యారు నిమషాలు మీరు టెలిఫోన్లో మాట్లాడుతూనే గడిపితే ఇంక మీరు పనిచేసినదెంతా అని నా




సదసత్సంశయం!"

ఒకలిప్తపాటు కళ్ళు తెరిచి నావేపు చూసి, వెంటనే కళ్ళుమూసి తలపైకెత్తారు ఎం డి

నేను గుటకలు మింగేను. "సార్ " అన్నాను

"ఒక్క మనవి" అందామని ప్రయత్నం

ఎమ్ డి గారు చెయ్యడ్డం పెట్టారు. కళ్ళుమూసుకునే మాట్లాడారు

"నాకొచ్చిన సమాచారం, దానికి ఆధారం — వీటి విషయం లోతుకు వెళ్ళొద్దని అక్కర్లేదని నేను మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను సమాచారం సేకరించడంలో నాకొక శిక్షణ వుంది నేను మీ కంపెనీలోకి ఎమ్ డి గా రాక పూర్వం అనేక వుద్యోగాలు చేశాను అందులో దినపత్రిక విలేఖరి పని ఒకటి. అప్పుడు నాకు చాలా చిన్నవయసు. ఓసారి నేనేదో వార్త పంపిస్తే దాన్ని పత్రికలో వెయ్యాలా అక్కర్లేదా అని సందేహం వచ్చి మా ఛీఫ్ ఎడిటర్ నాకు కబురు చేశారు నేను వెళ్ళాను ఈవార్త నిజమేనా అన్నారు నిజం కాకపోతే నేను పంపనని మీకు తెలుసుకదా అన్నాను నీమీద నమ్మకం లేకకాదు, ఈ వార్త నీకెలాగొచ్చింది, తెలుసుకోవాలనుంది అన్నారు పత్రికా విలేకరులు వార్తలు అందిస్తారుగాని వాటిని తామెలా సంపాదించారో చెప్పరండి అన్నాను ఇలాంటి వార్తలు ప్రచురిస్తే దెబ్బలాటలొస్తాయేమో అన్నారు వెయ్యడమో మానడమో మీరు చూసుకోండి, దెబ్బలాటొస్తే నేను చూసుకుంటాను అన్నాను ఇదంతా నేనెందుకు చెబుతున్నానంటే,- ఒక పద్ధతిగా సమాచారం సేకరించడం, అలా సేకరిస్తున్నట్టు యెవ్వరికీ తెలీకుండా జాగ్రత్తపడ్డం నాకు బాగా తెలుసు!

# విదేశాలకు వెళ్తానంటోన్న కొత్త డిజైను

టక్ టక్ టక్ టక్ టక్ టక్‌ల

పడుగూ, పేకా అదిరిపడుతూ, కదురు అటూ యిటూ మళ్లుతూ—దారం తన నెంబరు మరచి కొత్త డిజైన్‌గా సుళ్లు తిరుగుతూ విదేశాలకు వెళ్తానంటోంది

ఈ ఒక్కటీ పూర్తయితే చెలమయ్య సరుకు మూటగట్టి సహకార సంఘం ఆపీసుకు పోవచ్చనుకుంటున్నాడు

ముప్పయ్యేళ్ళుగా యీ చేత్తో ఎన్నో నేశాడు గతంలో ఎప్పుడూ గానుగెద్దు జీవితమే ఇప్పుడు తన చేనేత బతుకు పండింది

రాష్ట్ర వస్త్ర పరిశ్రమాభివృద్ధి సంస్థ వివిద జిల్లాల్లో వున్న 9 కేంద్రాల్లో 3 వేల మంది చేనేత పనివారికి ఉపాధి కల్పిస్తూంది

చేనేత రంగంలో సహకార విప్లవం వచ్చింది

30 లక్షల మంది శ్రామికులకి కొత్త జీవితాన్నిచ్చింది.

— o •—

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధ శాఖ డైరెక్టరుచే ప్రకటితము.

దిన 24 5 77

11/77-78

అందుచేతనే ఇదంతా ఏదో కాకారాయుడు చెవులు కొరగ్గా చాడీలు చెప్పగా దొరికిన సమాచారమేమోనని నేను అనుమానించ డంలేదు!"

నేను మళ్ళా గుటకలు మింగేను

జేబులోంచి వొక కాగితం తీశారు ఎం డి గారు "ఇది మీ కేమయినా పని కొస్తుందేమో చూడండి" అని నాకు అందించారు

అది ఒక దినపత్రికలో ప్రచురించిన ప్రకటన

ప్రభుత్వరంగంలో ఒక పెద్ద సంస్థ నడుపుతున్న ఒక రిసెర్చి యూనిట్ లో సూపరింటెంటు కావాలిట అర్హతలన్నీ నాకున్నాయి జీతం కూడా ఇప్పుడు నాకు వస్తున్నంత వస్తుంది ఓ విధంగా చూస్తే ఆ ప్రకటన నన్నే వెతుకుతూ వేశారేమో అనిపించింది ఐతే, ఉద్యోగం -రీ తాత్కాలికం ఒక యేడాది మాత్రమే.

కాగితం మడచి జేబులో వుంచాను

"రైట్! మీరు వెళ్ళచ్చు సారీ, మిమ్మల్ని బాధ పెట్టానేమో" అని ఆయన షేక్హాండిచ్చారు సిగరెట్టు పెట్టి తీసి తానొకటి వెలిగించుకున్నారు

నాకొటి ఇవ్వలేదు

* * *

ఫొటోలు తీశారు దండలు వేసేరు. సన్మానపత్రాలు చదివారు ఒకళ్ళిద్దరు ఫొటోలకు సన్మానపత్రాలకు అద్దాలు కట్టించి యిచ్చారు. ఆఖరు రోజున సాంస్కృతిక కార్యక్రమం ఏర్పాటు కళాకారులకు మా శ్రీమతి చేత మెమెంటోల బహూకృతి, మా ఇద్దర్నీ కళాకారులతో చేర్చి గ్రూప్‌ఫొటో.— గొప్ప వేడుక జరిగింది వారం రోజులు డిన్నర్లతో పార్టీలతో వూపిరి సలపలేదు

రేపు బయల్దేరుతున్నాం కొత్త వుద్యోగం వచ్చిన వూరికి ఇక్కడికి పన్నెండు వందలయాభై మైళ్ళుంది. అయినా ఉద్యోగికి దూర భూమి లేదన్నారు కదా

"బీచికి వెళదాం!" అన్నాను శ్రీమతితో

"ఇప్పుడా?" అన్నది భాగ్యలక్ష్మి

"ఎంతో చీకటవ లేదు అరగంటలో వచ్చేద్దాం" అన్నాను.

విడిగా ఓ చోట కూచున్నాం నలభై ఐదేళ్ళు నాకూ ముప్పయ్యయిదేళ్ళు అవిడికీ దాటినా కుర్రజంటలా కనిపిస్తున్నట్టున్నాం పక్కనించి నడిచేవాళ్ళు లవర్సేనేమోనని అనుమానంగా చూస్తూ వెళుతున్నారు అయినా మాకేం యిబ్బంది లేదు మేం లవర్స్ కాకపోతేగా!

తేలికయిన చెక్కతో చేసిన బంగిడి ఓ చేత్తోను మోడా ఓ చేత్తోను పట్టుకుని పిడతకింద పప్పువాడు వచ్చాడు బంగిడిలో ఓ పక్కని కొవ్వొత్తో సహా కొవ్వొత్తంతలావు ఒత్తితో దీపం సముద్రపొద్దు గాలిని ప్రతిఘటించి వెలుగుతోంది. నడివయస్సువాడి ఉద్యోగ ప్రయత్నంలాగ

మమ్మల్ని చూసి మోడా ఇసకలో గుచ్చి బంగిడి పెట్టాడు

"బాగారు మసాలా మిచ్చరు" అన్నాడు

...ల్లగా వు వల్లా అన్నాను
ఒచ్చేడు

"ఇలా పప్పు అమ్ముకోడమేనా. లేక వేరే ఏదన్నా పనిచేస్తూ వుంటావోయ్ నువ్వు?" అన్నాను

"అదంతా మీకెందుకండి తింటే వాడు తెచ్చింది తిన్నాదా లేకపోతే పొమ్మన్నాదా" అన్నది భాగ్యలక్ష్మి

"అడగనీండమ్మా. అడిగితే టి పోనాది?" అంటూ మా దగ్గిర చనువు సంపాదిస్తున్నాడు వాడు "మంచీ సెడ్డా తెల్సిన బాబులయితే బోగట్టాలడుగుతారంతే!" అని వొక రిమార్కు పారేసి

"కంపెనీలో శిష్టు డూటీ మీద పన్చేత్తానండి నాలుగొందలిత్తారు! ఈ యేలప్పుడు డూటీ నేకపోతే సర్దాగా సంద్రపుగాలికి జండిగొట్టు కొత్తానండి"

మా కంపెనీలో పని చేస్తున్నాడన్న మాట!

ఇంకా మా కంపెనీ యేమిటి??

అయితే మా కంపెనీలో నన్ను గుర్తుపట్టనివాళ్ళు కూడా కొందరు వున్నారన్న మాట!

"మీ పెరసనల్ మేనేజరు క్రిష్ణయ్యగారు బావున్నార్టోయ్?" అన్నాను

"ఇంకేటి బాగు బాబు! ఆ బాబు జండా దిగిపోనాది"

"జండా దిగిపోడమేమిటి? మంచాడు గాడా?"

"మంచంటే అదీ వొక మంచేనండి"

"అంటే యెలాంటి మంచి చెబుదూ"

"ఎలాటి మంచేటి బాబూ ఒవుడెలా గున్నాడో, ఒవుడెలా పోతన్నాడో ఆ బాబు కేటీ అక్కర్నేద్దండి మంచంటే మరదీ వొక మంచేగాదా?"

"అంత మంచారా?" అన్నాను.

చాటుగా భాగ్యలక్ష్మి వీపుమీద గిల్లి నా కీర్తిచూడు. చుక్కలవలె కర్పూరపు ముక్కవలె" అన్నట్లు మొహం పెట్టి

"ఆ బాబు పని జోలికెల్లడు. ఊకోలు ఎన్నేత్తన్నారా లేదా అని సూడ్డు మరి తం(వుం(రు అడిగారు గాబట్టి అదీ వోరకం మంచేనండి."

"ఊఁ అలాగా?"

"అయితే అంతమంచిని ఎన్నాల్లు సాగనిత్తారు బాబూ ఆ బాబు మీద పెద బాబు నిగా ఏస్సినాడు"

"ఏమినిషూవోయ్ క్రిష్ణయ్యగారే పేద్ద ఆఫీసరుగదా ఆయన్ని ఎమ్ డీ గారు మాత్రం ఏం చైగల్రు?" అన్నాను ప్రగల్భంగా

"ఓర్నీ ఓరూ ఏటీ సెయ్యనేరు బాబూ అయితే కిష్ణయ్య బాబు ఇక్కడుండ కంటా సేసేసినాడు గాదా. ఎమ్ డీ బాబు సాల్దా?"

"అదెలాగ? ఆయనెవడయ్యా ఇతన్నిక్కడుండకండా చేసీడానికి? ఇతనికే ఇంకోచోట మంచి వుద్యోగం వాస్తే పోతున్నాడేమో?"

"పెద్దోళు బాబూ ఆళ్ళ వూసులు మాకేటి తెలుత్తాయి? పక్కోడు కులాసగుంటే సూళ్ళేని రోజులు? దాంతో ఇందిరమ్మగారు యమర్జెన్సీ ఓటి ఎట్టేసినారు గదా"

"అయితే ఏం చేసేడంటావు. మీ ఎం. డీ బాబు?"

"ఏత్నేదు బాబూ ఓ రోజు మామూలుగా ఆపీసు కెల్లాడట మా పి ఎం బాబు ఎమ్ డీ బాబేమో. ఈ బాబుని పిల



మన్పెప్పి. కూకోబెట్టి "ఏటయ్యా కిష్టయ్యబాబూ. ఇక్కణ్ణించీతప్పుకుంతావా బొక్కపింపే మంతావా అని అడిగినాడు. నేదుబాబూ నానే తప్పుకుంతాను చెప్పి ఈ బాబుంకో వుద్యోగం సూసుకో నెలిపోతన్నాడు"

"బలేగా మాట్లాడతావోయ్ నువ్వు!" అన్నాను. ఆరిపోయి

"ఐగారు. మసాలా మిచ్చరు తిన్నా?" అన్నాడు వాడు. పాయింట్ లో కొచ్చి.

హైబ్రో డిన్నర్లతో విసిగిపోతున్న నా ప్రాణానికి మసాలా మిక్శ్చరు నిజంగా తినాలనే అనిపించింది

"ఇక్కణ్ణించీ తప్కుంతావా. బొక్కింపి మంతావా" అన్నాట్ట ఎమ్ డి

బాగా చెప్పాడు. చూపి. వినిపిన వాళ్ళాగ జరిగిందాన్నే. వాడి భాషలో చెప్పాడు. □

# మరణంలో జీవితం

'రాజేశ్వరీ!' అప్పుడే ఇంట్లోకి వచ్చి జుట్టు ముడి విడదీసుకుంటున్న రాజేశ్వరి ఆ పిలుపు విని చటుక్కున తల పైకెత్తింది. తలుపు దగ్గిర ఇందాక చూసిన ఎవరో బెంగాలిబాబు అని తను పొరపాటుగా అనుకున్న రాంమోహన్ రావు నిల్చునివున్నాడు నిందాపూర్వకమైన నవ్వుతో

మొదట రాజేశ్వరికి ఆశ్చర్యంతో మాట రాలేదు ఆఫీసు నుంచి బస్‌దిగి వస్తూంటే వీధిలో వెనక ఎవరో నడుస్తున్నట్టనిపించి వెనక్కి తిరిగి చూసింది మసకచీకటిలో మొహం సరిగ్గా కనిపించ లేదు కానీ ఆ నడక పరిచయమైనదాని లాగే అనిపించింది ధోవతీ పైనలాల్చీ, బుజంచుట్టూ శాలువ ఎవరో బెంగాలి అనుకుంది

'ఏం రాజేశ్వరీ పలకటం కూడాలేదు వీడెవరు గౌరవించటానికి అనుకుంటు న్నావా?' రాజేశ్వరి తేరుకుంది వేషం మారినా, మనిషి మాట, స్వభావం మార లేదు వెంటనే ఏదో ఒకటి అనాలి చెయ్యాలి 'కూచోండి' తన గొంతు తనకే అసహజంగా వినిపించింది, 'ఆ ఆలోచన, పరధ్యానం పొడిమాటలు నువ్వేమీ మారలేదు ' అంటూ కూచు న్నాడు ఆ మాటకొస్తే ఎవరు మారారు? నాలో మార్పు ఆశించి వచ్చాడా? ఇప్పు డీయన ఎందుకొచ్చినట్టు?

'నాకు మాట్లాడడం సరిగ్గా చేతకాదు. ఆ సంగతి నీకు తెలుసు అదే నాకు చేతనయి నీకునచ్చే అబద్ధాలూ, కల్పనలూ సహజంగా, అందంగా చెప్పగలిగివుంటే నువ్విలా ఒంటరిగా బతకాల్సిన అవసరం వుండేదికాదు ' మాటమాటకీ దెప్పు అంతా ఎదుటివారిదే తప్పైనట్టు నింద. అనవసరపు నిందలు అబద్ధాలకంటే అసహ్యకరమైనవి 'అబద్ధాలని భరించ వచ్చు కాని నిందలని సహించటం చాలా కష్టం' అప్రయత్నంగా పైకనేసింది

ఆర్. ఇందిర

'అంటే తప్పంతా నాదే నంటావ్ నువ్వేమీ చెయ్యకుండానే, నేను నిన్ను అనవసరంగా అన్నాననేగా?'

'నేనేమీ అనలేదు ఈ విషయం గురించి మీరేమంటారో వినే ఓర్పు, సహనం నాకు లేవు ఎందుకొచ్చారో త్వరగా చెప్తే ' అప్పుడే ఎనిమిది గంటలు పని చేసి వచ్చిందేమో పైగా అనుకోని ఈ సంఘటనతో ఆమెకి తల దిమ్ముగా అయింది ఫ్లాస్కులోంచి కాఫీ గ్లాసుల్లో పోసి అతని ముందుకు జరిపింది కాఫీ మెల్లిగా తాగుతున్న ఆ అమ్మాయిని ఆశ్చ ర్యంగా చూశాడు 'నువ్వింత ప్రశాంతంగా ఏదో మామూలు విషయం జరిగినట్టు నిర్ల క్ష్యంగా వుంటావని నేననుకోలేదు నే నెవరో పూర్తిగా మర్చిపోయి నట్టున్నావ్'

"దాదాపు మర్చిపోతున్న సమయంలో మీరొచ్చి మళ్ళీ జ్ఞాపకం చేశారు "

"ఏం నా జ్ఞాపకాలు అంత వేధిం చాయా?"

"ఎవరి జ్ఞాపకాలు ఎవరిని వేధించాయో కానీ, వేదన మాత్రం జన్మకి సరిపడా మిగిలింది "

'ఇంక నీకు ఏ దిగులూ వద్దు ఒంట రిగా వుండి అలసిపోయావ్ ఇంటి కెళ్దాం రా'

'ఇంటికి? ఎవరింటికి?'

'నీ ఇంటికి అదే మన ఇంటికి'

"మన ఇల్లు అలాంటి మాటలు వాడకండి మీరొచ్చింది అందుకే ఐతే మాత్రం మీ శ్రమ వృధా అయినందుకు విచారిస్తున్నాను నాకు ఏ ఇల్లూ లేదు—— వవరూ లేరు"

'నువ్వలా అనుకున్నా నేననుకోటం లేదు మొదట్నించీ మనది 'వన్ సైడ్ ఎఫేరేగా' నీతో మరీ మరీ విసిగిపోయి ఆఖరి రోజుల్లో రెండుమూడుసార్లు నేను మొరటుగా ప్రవర్తించిన మాట నిజమే కానీ అలా ప్రవర్తించటానికి కారణం ఎవరు? ఐనా నీ ప్రవర్తనంతా క్షమించేసి నేను చేసినవి మాత్రమే తల్చుకుని పశ్చా త్తాపపడి వచ్చాను' అతగాడు ముఖాన్ని కర్చీఫ్‌తో తుడుచుకుంటూ అన్నాడు

'అంత క్షమించరాని నన్ను మళ్ళీ ఎందుకు పిలుస్తున్నారు?' అతని అహానికి దెబ్బ తగలకుండా సున్నితంగా తిరస్క రించాలని రాజేశ్వరి ప్రయత్నం మీ క్షమాపణ నన్ను గిల్టీగా తయారయ్యేట్టు చేస్తుంది. నా పొగరుకు గిల్టీఫీలింగ్ తోడైతే అది నన్నూ. మిమ్మల్నీ ఇద్దరినీ సుఖపడనివ్వదు'

'నిన్ను మార్చాలనేగా నా ప్రయత్న మంతా మొదట్నించీ అదేగా నీకు నా గురించి సరిపడనిది; సరైన పెంపకం లేక అలా తయారయ్యావు నువ్వు చేసినవన్నీ తెలీక చేశావని అను కుంటున్నాను అన్నీ మర్చిపోయి మళ్ళీ కొత్తజీవితం మొదలుపెడుతున్నానుగా లే లేచి సర్దుకో ఇంటద్దె ;ఇవ్వాలా?" దగ్గరగా వచ్చాడు

"ఆగండి నేనెక్కడికీ రాను ఎవ్వ రితో కలిసి బతకను నన్నిలా ప్రశాం తంగా వుండనివ్వండి మీ మార్పులూ.— మీ కోపాలూ, మీ అనురాగం——మీ తిర స్కారం, మీ లాలింపులూ —— మీ చీద రింపులూ అన్నీ పది జన్మలకి సరిపడా

అనుభవించాను నన్ను విసిగించక దయ చేసి వెళ్ళండి మీకు నమస్కారం చేస్తాను "

"ఇక్కడ ఎవరైనా దొరికారేమో నాకంటే గొప్పవాళ్ళు. అందుకే రానం టున్నావ్" ఆఖరు అస్త్రాన్ని ఉపయో గించాడు

"దొరకటం? కావాలనుకుంటే నాకదేం కష్టంగాదు ఇలా షిఫ్టుడ్యూటీలు చేస్తూ కష్టపడాల్సిన అవసరం కూడా లేదు కానీ మీకు ఒకందుకు చాలా కృతజ్ఞురాలిని మీ దయవల్ల మొగవాళ్ళంటే భయం, సెక్సు అంటే అసహ్యం కలిగాయి—"

"ఇవన్నీ నాదగ్గిర కబుర్లు!" కోపాన్నీ అవమానాన్నీ అణచుకుంటూ అన్నాడు.

'ఏమైనా అనుకోండి దేనికీ నేను ఎక్స్ ప్లెనేషన్ ఇవ్వను అవసరం లేదుకూడా ఎలా వున్నానో, ఎలా ప్రవర్తిస్తున్నానో కానీ స్వతంత్రంగా బ్రతుకుతున్నాను ఎప్పుడు ఆ ఇంటి నుంచి బైటికి వచ్చే శానో, అప్పుడే మనిద్దరి మధ్య అప్పటి వరకూ వూగులాడుతున్న సున్నితమైన బంధం తెగిపోయింది ఇంతదూరం నా అడ్రెస్ కనుక్కుని అభిమానంతో కాదు ఆశతో వచ్చారు కాబట్టి చెప్తున్నాను మీకు కావల్సిన సుఖాల్ని కొనుక్కోండి అంతేకాని పెళ్ళిచేసుకోవటంకాని, ఎవరితో నైనా కలిసి జీవించటం కాని చెయ్యకండి ఒకరితో కలిసి జీవించటం మీకు పడదు దయచేసి ఇక వెళ్ళండి అలిసిపోయాను నాకు విశ్రాంతి కావాలి" నమస్కారం చేసింది రాజేశ్వరి ఇక మాట్లాడవల్సిం దేమీ లేదన్నట్లు ఆమె మొహంలో పట్టు దల చూపి ఒకడుగు వెనక్కి వేశాడు "ఎప్పుడో నువ్వే వచ్చి కాళ్ళావేళ్ళా పడే తావు కానీ అప్పటికి నిన్ను స్వీకరించ స్థితిలో వుంటానని అనుకోకు—ఆవేశ పడక ఆలోచించుకో మళ్ళీ వచ్చి కల్సు కుంటాను " అంటూ వెళ్ళిపోయాడు

పోతున్న అతన్ని వెనకనించి చూస్తున్న రాజేశ్వరికి జాలికలిగింది. అతనికి ఇచ్చిన కాఫీ అలాగేవుంది. మనిషి చాలా తగ్గిపోయాడు పోనీ వెళ్తే అమ్మో! కలిసి జీవించటానికి మనిషి మీద మనిషికి జాలిమాత్రం చాలదు అంతకు మించిన ప్రేమతో, సహనంతో కూడిన బంధం కావాలి అదే మనిషి తనని రాత్రికి రాత్రి ఇంట్లోంచి బైటికి నెట్టి, కుక్కని తరిమినట్టు తరిమేశాడు అది తల్చుకోగానే రాజేశ్వరికి ఒంట్లో రక్తమంతా మరుగుతున్నట్టయింది.

* * *

రాజేశ్వరి అమ్మానాన్న రైలుప్రమా దంలో పోయారు ఆ పిల్లని మేనత్త వర సైన ఒకావిడ పెంచింది ఆవిడకి ఆ పల్లెటూళ్ళో చిన్న హోటలుండేది—ఆవిడ కెవరూలేరు రాజేశ్వరినే సొంతబిడ్డలా చూసుకునేది టెన్త్‌క్లాస్‌వరకూ చదివిం చింది ఆవిడ మితభాషి ఏదైనా మాట్లా డితే చాలా నెమ్మదిగా మృదువుగా మాట్లా డేది రాజేశ్వరికి ఆవిడ దగ్గరనుంచి, ఆలోచించి చాలా తక్కువగా మాట్లాడటం వచ్చింది కానీ స్వతహాగా ఆ అమ్మాయి మాటపడే మనిషికాదు తనెవ్వరినీ ఏమీ అనదు. ఎవరైనా అనవసరంగా అంటే మాత్రం సహించేదికాదు కచ్చితంగా

జవాబు చెప్పేది ఏదైనా ఆ అమ్మాయికి నెమ్మదిగా చెప్పాల్సిందే శాసిస్తే ఒక్క మాట కూడా వినదు

రాంమోహనరావ్ టూర్ మీద ఆ వూరికి వచ్చినప్పుడు రాజేశ్వరీవాళ్ళ హోటల్‌కు వచ్చేవాడు అతనికి అన్న మాత్రం వున్నాడు అదీ ఎక్కడో దూరంలో వుద్యోగం చేసుకుంటూ స్థిరపడి—ఆవిడకి అభ్యంతరం లేకుంటే రాజేశ్వరిని పెళ్ళి చేసుకుంటానని ఆవిడతో అన్నాడు రాం మోహన్‌రావ్. రాజేశ్వరి అత్తయ్య ఆలోచించకుండా ఒప్పుకుంది. ఆవిడ



దగ్గిర డబ్బులేదు. మనిషి సాయంలేదు వరుణ్ని తేవటానికి అతనేమో మంచి వుద్యోగం చేస్తున్నాడు. ఆవూరికి వచ్చి నప్పుడు బాగా పరిచయమైనాడు మంచి వాడు గొప్ప వంశంవాడు ఇంతకంటే ఆవిడ మాత్రం ఎవర్నితేగలదు? ఆవిడ రాజేశ్వరి అభిప్రాయం అడిగింది ఆ అమ్మాయికి అప్పుడు పెళ్ళిగురించి ఆలో చించే వయసులేదు. వ్యవధిలేదు. చాయిస్ లేదు. పెళ్ళిచాలా నిరాడంబరంగా జరి గింది ఆవూళ్ళోవాళ్ళు దిక్కులేని రాజే శ్వరికి పట్టిన అదృష్టాన్ని పెళ్ళప్పుడు రాంమోహన్‌రావ్ ముందే పొగిడారు వెంటనే తనతో హైదరాబాదు తీసికెళ్ళాడు ఆ అమ్మాయిని.

హైదరాబాదుకువచ్చిన కొత్తల్లోరోజూ అతను ఆఫీసునుంచి వచ్చాక ఎక్కడికైనా బయటికి వెళ్ళేవాళ్ళు రాంమోహన్‌రావ్‌ది చాలా విచిత్రమైన మనస్తత్వం ఇంట్లో ఎంత నెమ్మదిగా, అతిప్రేమగా వుండే వాడో గడపదాటిం తర్వాత అంత దురుసుగా, విసుడుగా ప్రవర్తించేవాడు ఎప్పుడూ తను పుట్టిన పల్లెటూరుతప్ప వేరే ఏం చూడని ఆ అమ్మాయికి ఒకేసారి హైదరాబాద్‌లాంటి సిటీకి రావటం పెద్ద అడ్వెంచర్ ప్రతీది ఒకవింత వీధుల్ని. షాపుల్ని. రకరకాల మనుషుల్ని. ఫాషన్లనీ కళ్ళింత చేసుకొని చూస్తూండేది ఏ భయంలేకుండా చకచకా నడుస్తూ బస్సులెక్కే ఆడపిల్లల్ని చూస్తే వాళ్ళంతా ఆకాశంనుంచి దిగొచ్చిన దేవ తల్లాగా ఆఅమ్మాయికళ్ళకి కనిపించేవాళ్ళు అది అతనికి చిరాకు "మీ వూళ్ళోలాగా అందర్నీ అలా పైనించి కిందికిచూస్తే అసహ్యంగా వుంటుంది మీ హోటల్లో వున్నప్పటి అలవాట్లు మానుకో !" అంటూ ఆ అమ్మాయి అడిగినవాటికి చెప్పకపోగా పక్కపక్కనే నడుస్తూ కసిరేవాడు బస్సు ఎక్కివెనక అతను ఎక్కాడోలేదో చూచేది వరసగానించున్న వాళ్ళలో ఎక్కడో అతను కనిపించేవాడు. "బస్సులో ఎక్కి వెనక్కి వెనక్కిచూస్తా వెందుకు అందరూనిన్నే చూస్తున్నారు. నీలా ఒక్కరుకూడా చెయ్యటంలా చిన్న వంశం, చిన్న బుద్ధులు" అదీ బస్‌దిగి ఏదో వుత్సాహంగా చెప్పబోతున్న రాజే శ్వరికి అతని రెస్పాన్స్ చిన్నచిన్న విషయాలకి వంశాలని గురించీ, పెంపకాల గురించీ దెప్పుతాడెందుకో ఇక ఆఅమ్మా యికి మ్యూజియంలోగానీ, పార్కులో గానీ ఎక్కడయినా చూచిన విషయం వివ రంగా తెలుసుకోవాలని ఆసక్తి అతనికి ఒకటే తొందర ఒకచోటునుంచి మరో చోటికి చూశామన్నట్టు పని ముగించుకుని శరవేగంతో పరిగెత్తటం తప్ప విషయ మేమిటో తెలుసుకోవాలన్న ఉత్సాహం లేదు ఎవరయినా చెపుతుంటే వింటూ అక్కడే నిల్చునిపోయేది పరధ్యాన్నంగా. "నేనోపక్క వెళ్తామంటుంటే. ఎవరేం చెపుతున్నా ఒళ్ళుమరిచిపోయి నిలబడిపోతా వెందుకు? నేనంటే లెక్కలేనట్టేగా?" అంటూ అర్థాలు తీసేవాడు ఒకరోజు ఏదో పెద్దహోటల్‌కి తీసికెళ్ళాడు. ఐస్ క్రీమ్ తింటూంది చాలా బావుంది అలాంటివి వుంటాయనికూడా ఆ అమ్మా యికి తెలీదు నవ్వుతూ అతనివైపు






చూపింది "చూశావా? మీ హోటల్లో అవే విటి రాజేశ్వరీ పకోడీలని పేరుపెట్టి మీరు అమ్మేవి? అవే అమ్ముకుంటూ, అవే తింటూ వుండకుండా, రిట్జ్ హోటల్స్, ఐస్క్రీమ్‌లు, అదృష్టం అంటే నీదే!" అంటూ నవ్వాడు అది విట్టీగా మాట్లాడటం కాబోలు అతని దృష్టిలో కానీ రాజేశ్వరికి మనసు కష్టమేసింది నోట్లో పెట్టుకున్న ఐస్క్రీమ్ చేదుగా, అసహ్యంగా తోచింది ఆ పకోడీలకో వేటికోసమో తనూ ప్రతీసారి అత్తయ్య హోటల్‌కేగా వచ్చేవాడు తను అతని భార్యకాకముందు ఏం తినిందో, ఏం చేసిందో కానీ ఏదీ తిరిగి తలచుకుంటే సిగ్గుపడాల్సిన విషయమేమీలేదు అత్తయ్య దగ్గరున్నప్పుడు ఎవరూ తనని తక్కువగా చూడలేదు. కించపరచలేదు ఇప్పటివరకూ రాజేశ్వరికి గతానికి ప్రాముఖ్యంలేదు. తక్కువ లేదు చాలా సాధారణంగా గడిచిపోయింది కానీ రాంమోహన్‌రావ్ మాటిమాటికి అనే మాటలతో ఆ అమ్మాయికి ప్రస్తుతం తను గడుపుతున్న జీవితంకంటే గతంలో ఎంతో ఆనందంగా స్వేచ్ఛగా వున్నట్లు మనసులో రహస్యంగా అనిపించసాగింది

తను పదహారేళ్ళు మాత్రం అత్తయ్య దగ్గిర వుండింది ఇక ముందున్న నూరేళ్ళ జీవితం అతనితోనే కదా పంచుకోవాల్సింది అలాంటి భార్యని, అందర్నీ వదులుకొని తననే నమ్ముకొని వచ్చిన ఆడదాన్ని మగవాడు ఎందుకు చులకనగా చూస్తాడో ఆ అమ్మాయికి అంతుపట్టలేదు. ప్రతీచిన్న విషయానికి ఎక్కడో పల్లెటూళ్ళో అనాధగావున్న అమ్మాయిని పెళ్ళిచేసుకుని వుద్ధరించానన్నట్టు అతను అనే మాటలు, అందుకు తనకి ప్రతి నిముషం కృతజ్ఞత చూపుతుండాలన్నట్లు

అతను వ్యక్తంచేసే అభిప్రాయాలు వింటూంటే తిరిగి ఏదయినా వెంటనే అనెయ్యాలని "పెళ్ళికోసం ఎవరేడ్చారు? అతనేకదా కావాలని తనని చేసుకుంది? ఆడదానికి మగవాడి అండ ఎంత అవసరమో, మగవాడికి ఆడదాని అవసరం అంతకంటే ఎక్కువ దీనికి ఒకరికొకరు కృతజ్ఞులుగా ఎందుకుండాలి? భార్యాభర్తలమధ్య వుండాల్సింది భయం-కృతజ్ఞతేనా? స్నేహంగా ఆప్యాయంగా వుంటే చాలదూ?" పెదిమల చివరదాకా వచ్చినమాటల్ని, చిన్నప్పట్నించీఅత్తయ్య శిక్షణలో వచ్చిన ఆత్మనిగ్రహం, ఆలోచన వాటిని బైటకు రాకుండా మనసులోనే నొక్కేసేవి

అతను ఆఫీసుకెళ్ళాక ఇంట్లోకూర్చుని ఏవైనా చదువుకుంటూ వుండేది ఆఫీసుకు వెళ్ళేప్పుడు ఎలా వుండేవాడో తిరిగి వచ్చేటప్పుడు అదే మూడ్‌లోవుండేవాడు. ఇంట్లో వేరేవాటాల్లోవుండే ఆడవాళ్ళంటే ఆరాధన. వాళ్ళతో మాట్లాడుతూవుంటే మంచిమంచి అలవాట్లు వస్తాయి వాళ్ళంతా పెద్దఫామిలీస్ లోనుండి వచ్చినవాళ్ళు అంటూమళ్ళీ నీతులు ఇన్‌స్ట్రక్షన్స్ మొదలు "వాళ్ళతో టైమ్‌పాస్‌కి సరదాగా మాట్లాడు" అంటే ఆసక్తి కలిగేదేమో కాని ఇలా అనేసరికి రాజేశ్వరికి చుట్టూ ఎవ్వరితో అసలు మాట్లాడకూడదనే పట్టుదల కలిగింది తనకున్న చెడ్డ అలవాట్లేమిటో? అతను వాళ్ళవంశం గురించీ తరచుగా చెప్పేమాటల సారాంశం, అతని ముత్తాతలు పెద్ద జాగీర్దారులట. ఆ జాగీర్‌లూ, వంశప్రతిష్టలూ తండ్రితరం వచ్చేముందే పోయాయి గత వైభవము లేకపోయినా, దాని చిహ్నంగా "ఫాల్స్ ప్రిస్టేజి" సంక్రమించింది ముఖ్యంగా ఆడవాళ్ళ విషయంలో అతనిలో చిత్రమైన అభిప్రాయాలు పాతుకుపోయాయ్ అతని నాన్నమ్మ నాన్నమ్మ, అత్తయ్యల అత్తయ్యలు పరదాలవెనకే వుండేవాళ్ళట పల్లకీలలోనే బైటకెళ్ళే వాళ్ళట పరదాల వెనక చేతిగాజుల చప్పుడే వాళ్ళు ఇంట్లో వున్నట్టు గుర్తు అలాంటి "అసూర్యం పశ్యల" వారసుడు "రాజా రాంమోహన రావ్‌బహద్దర్‌కి" ఆడవాళ్ళని పంజరంలో చిలకల్లాగా చూస్తేనే వంశగౌరవం నిలుస్తుంది!" అనే నీతివాక్యం పుట్టుకతోనే వంటబట్టింది అతని ప్రస్తుత ఆర్థిక పరిస్థితుల్లో ఆ పరదాలూ, పల్లకీలూ ఎక్కడ్నించి తేగలడు? అందుకని రాజేశ్వరి హద్దులు దాటిపోకుండా (అతనిపరిభాషలో) మాటలతో, చేతలతో మానసికంగా బంధించాలనే అతని తెలివితక్కువ ప్రయత్నంలో, భార్యని రోజురోజుకీ ఆత్మీయంగా దగ్గిర చేసుకునే బదులు, దూరం అవుతూ పోగొట్టుకుంటున్నాననే నిజం తెలుసుకోలేక పోయేవాడు

సహజంగా అందరు ఆడపిల్లల్లాగా ఆ అమ్మాయికికూడా పెళ్ళయిన రోజునుంచి భర్తంటే ఆరాధన, గౌరవం కలిగాయి, మొదట్లో, ఇంట్లో అన్ని సౌకర్యాలు చేసేవాడు కాని అతని మాటలు, వికృతమైన స్వభావం భరించలేనంతగా వుండేవి "జీవితావసరాలు" గడిచిపోతున్నాయ్ కదాని ఎలాగో ఓలాగు మనసుని సర్దుకుని వుండగలిగివుంటే రాజేశ్వరి సుఖంగా బతుకు

తున్నదనే అనుకోవచ్చు కానీ ఆ అమ్మాయికి అతనితో సహజీవనం, పాతజీవితాన్ని మరిపించకపోగా, ఏమీ ప్రత్యేకత లేని గతమే మాటిమాటికీ గుర్తుచేస్తూ ఒంటరిగా స్వేచ్ఛగా బతకాలనే తపనని పదేపదే కలిగించేది అసంతృప్తిని కలిగించేది పెళ్ళికాకముందు రాంమోహనరావు పరిచయస్థుడు మూడేళ్ళు గడచిన తర్వాత రాజేశ్వరికి అతను పరాయివాడు.

అతను టూర్ నించి వచ్చేసరికి రాజేశ్వరి నేలమీద పడుకుని ఏడుస్తూంది పక్కనే కుర్చీలో ఒకతను కూచుని వంగి ఏదో అంటున్నాడు ఇంట్లోకి వచ్చిన రాంమోహనరావ్‌కి ఇది చూపి కళ్ళు తిరిగాయి "ఏమిటి? ఎవరు? ఏమైంది?" గట్టిగా అడిగాడు రాజేశ్వరి లేచి భర్తని చేతులతో చుట్టి ఏడ్చేసింది అతను గోపి రాజేశ్వరి వాళ్ళ వూరినుంచి వచ్చాడు యాత్రలకని వెళ్ళిన అత్తయ్య హరిద్వార్ దగ్గిర సముద్రంలో స్నానంచేస్తూ మునిగిపోయిందట ఆ సంగతి వాళ్ళ వూరి మున్సబుకు తెలియపరచారు గోపీ, రాజేశ్వరికి చిన్నప్పటినుంచీ తెలిసినవాడు హైదరాబాద్‌కు పనిమీద వచ్చి రాజేశ్వరికి ఈ విషయం చెప్పాడు గోపీ గడప దాటంగానే "చూశావా చీటికీ మాటికీ నాతో పోట్లాడుతావ్ ఇన్నాళ్ళూ మీ అత్తయ్య అండ చూసుకునేగా అదృష్టం

కొద్దీ నీకు పెళ్ళైంది లేకుంటే ఆ మోటు మనిషి గోపీలాంటివాడికి వుండే దానివి వాడికి కుర్చీలో కూర్చోటం కూడా రాదు వాడికి కుర్చీ ఎందుకేశావ్? ఐనాఇప్పుడు నీకేం భయం లేదులే నేనున్నాను" అంటూ ఒళ్ళోకి తీసుకున్నాడు కన్నతల్లిలాటి అత్తయ్యలేదు ఆవిడ లోటు ఎవరూ తీర్చలేరు ఎప్పుడైనా ఆవిడదగ్గరికి పోవచ్చనే ఆశకూడా పోయింది అంత దుఃఖంలోనూ హృదయ శూన్యుడైన భర్త వళ్ళోనే సేద తీర్చుకోవాల్సి వచ్చినందుకు వెక్కి వెక్కి ఏడ్చింది రాజేశ్వరి మేకపిల్లకి పులి వళ్ళో ఓదార్పు! అప్పటినుంచీ రాజేశ్వరికి అతని మీద విసుగు, అలసత్వం ఏర్పడ్డాయి అతని మాటలకి ఇన్నాళ్ళలాగా జవాబు చెప్పకుండా వుండేదికాదు బలవంతంగా తెచ్చుకున్న ఓర్పు, సహనం చెదిరిపోయేవి దాంతో ఏవో మనస్పర్ధలూ, చీకాకులూ ఇద్దరిమధ్యా యెప్పుడూ వుండేవి

ఆ రోజు పెళ్ళిరోజు పెళ్ళై మూడేళ్ళయింది. కలతలతో, పోట్లాటలతో ఒకరితో ఒకరు మాట్లాడుకుని చాలా రోజులైంది సున్నితమైన రాజేశ్వరి అతని మౌనం తన ప్రవర్తనవల్లనేమో నని బాధపడింది కలతలన్నీ మంచు విడిపోయినట్టు విడిపోయి, అతను సంతోషంగా వుండాలనే ఆ అమ్మాయి కోరుకుంది అతనెలాటివాడైనాకానీ, తన గురించీ మాత్రం కష్టపడకూడదు అతని స్వభావం తెలిశాక తనే మాట్లాడకుండా వుంటే పోతుంది. దీనివల్ల ఎవరికి సుఖం ఇన్నిరోజులు తనని అంటూ ఒక విధమైన మానసికానందం అనుభవించే వాడేమో. తనకెలాగైనా ఆనందంలేదు అతనికి కూడా యెందుకు లేకుండా చెయ్యాలి? రాజేశ్వరి నవ్వుకుంది కలిసి ఓ కప్పుకింద బతకాలంటే అవతలివాళ్ళ స్వభావానికిఅనుగుణంగా సర్దుకోవటమైనా నేర్చుకోవాలి, లెక్క చెయ్యకుండా ముందుకు పోవటమైనా అలవాటు చేసుకోవాలి మొదటిదానికి సహనం, రెండో దానికి ఆత్మవిశ్వాసం అవసరం ఆత్మవిశ్వాసం ఎవరిమీదా ఆధారపడకుండా స్వతంత్రంగా వున్నప్పుడు వస్తుంది ఈ రెండూ చేతకాకపోతే జీవితం నరకం అవుతుంది ఆ నరకాన్నే తోటివాళ్ళకి పంచాలా? ఒద్దు తనకెంత కష్టం కలిగినా అతనికి సుఖాన్నే యిస్తుంది ఏ విధంగానైనా అతను సంతోషంగా వుండాలి భార్యగా అదే తన కర్తవ్యం

సాయంకాలం అతని కిష్టమైన వంట చేసింది ఇల్లు శుభ్రంగా సర్ది స్నానం చేసింది ఇస్త్రీ చీరె కట్టుకుని, తల్లో మల్లెపూలు పెట్టుకుంది పరుపుమీద మల్లెపూలు చల్లింది అగరుబత్తులు స్టాండులో గుచ్చి పెట్టింది

రేడియో బల్లమీద కోవా, బిస్కెట్లు ప్లేట్లో పోసి వుంచింది రాజేశ్వరికి కాస్మెటిక్స్ వాడటం అసలిష్టం వుండదు. ఐనా ఆతనికి కావాలి బట్టలమీద సెంట్ చల్లింది అద్దంలోంచి తనని, గదినిచూసి సిగ్గుపడింది ఇద్దరూ సరిగ్గా వున్నప్పుడు ఇలాంటివేమీ అనిపించవుకానీ, అతని కోపం తగ్గించటానికే అనిపించేసరికి





ఎక్కడ్నుంచి సంపాయించావు నారదా?
ఈ యేడాది దీని కోసం మాకెంతగా
మొహం వాచి పోయిందో!!

గిల్టీగా ఫీలైంది. ఏమయినాసరే యీ మూడేళ్ళ చేదు గత జీవితంలోంచి జరగనట్టు మాయమయిపోయి మళ్ళీ ఈ పెళ్ళి రోజునించీ మరోసారి తియ్యటి వర్తమానం మొదలవాలి

మంచంమీద పుస్తకం చదువుతూ కూచున్న రాజేశ్వరి తలెత్తి చూసేసరికి పదీ-పది ఆకలెప్పుడో చల్లారిపోయింది వంటింట్లోకి వెళ్ళి మంచినీళ్ళు తాగివచ్చి పడుకుంది తలుపుమీద గట్టిగా చప్పుడు వులిక్కిపడిలేచి, పరిగెత్తికెళ్ళి తలుపు తీసింది ఎదురుగా మొహం ఎర్రగా పెట్టుకుని, ఆ అమ్మాయివైపు అసహ్యంగా చూస్తూ రాంమోహనరావ్ "ఎప్పుడో పొద్దున వెళ్ళిన మనిషి రాలేదని దిగులు లేదు వచ్చాక తలుపు వెనక గంటలు, గంటలు పడిగాపులు పడి వుండాలి కాబోలు " నవ్వుతూ పలకరింపుగా చూస్తున్న రాజేశ్వరికి మొదటే నిరాశ! "లేదండీ! ఇప్పటివరకూ చూశాను తెలీకుండా నిద్దర పట్టింది "

"ఒంటిమీద భయముంటే పట్టదు అవతలి మనిషిమీద ఖాతరుంటే అసలు పడుకోవాలనిపించదు"ఇంట్లోకి విసురుగా వచ్చాడు గదిని పరీక్షగా చూసి, "ఇప్పటికి నా విలువ తెలిసిందన్నమాట" అంటూ వ్యంగ్యంగా నవ్వి "అన్నిటికీ మొగుడుమీద ఆధారపడి వుండికూడా ఆ తలపొగురు, గర్వం తగ్గించుకుని అణుకువగా వుంటే యెంత బాగుంటుంది! హోటల్లో మీ అత్తయ్యా వచ్చినవాళ్ళం దరికీ అన్నం పెడితే నువ్వేం చేసేదానివి! చాలా అనుభవమున్నట్టుంది ఇలాంటి విషయాల్లో !"

రాజేశ్వరి నేలచూస్తూ నించుంది.

"నా గురించి అంత ఎదురుచూశావుగా ఈరోజు నేను కావాలంటే మా వంశ గౌరవానికి తగ్గట్టు, మంచి ఫేమిలీలోంచి

వచ్చిన పిల్లలాగా నడుచుకుంటానని మా తాతయ్య ఫొటోముందు నిల్చుని నేను చెప్పినట్టు ప్రమాణం చెయ్" యాంత్రికంగా అటు వెళ్ళి నిల్చుని అతను చెపుతున్న మాటలు పెదిమలచివర పల్కుతున్న రాజేశ్వరికి సాయంత్రం తను చేసుకున్న నిర్ణయం ఎక్కువసేపు నిలవదని అర్ధమయింది

ఆ అమ్మాయిని చేతులతో చుట్టేసి "నువ్వెందుకోసం నేనేం చెప్పినా చేస్తావని, అవసరం! ఏం చేస్తావ్ పాపం! మగాడి మీద కోరిక, సెక్స్‌మీద వ్యామోహం !" మోహానికి తగులుతున్న అతని వూపిరి నిలువునా కాల్చేస్తున్నట్టు, అతని కౌగలి మనసునుకూడా నొక్కేస్తున్నట్టు వూపిరి తిరగలేదు రాజేశ్వరికి "కోరిక కాదు, వ్యామోహం అంతకన్నా కాదు సర్దుకుపోవాలనే పిచ్చి ప్రయత్నం, సంసారం నిలుపుకోవాలనే తాపత్రయం అభిమానాన్ని చంపుకునైనా సరే సుఖాన్ని, తృప్తినీ ఇద్దామనే ఆరాటం ఇదంతా నేనొక్కదాన్నే చెయ్యగలనని ఆశపడ్డాను గర్వపడ్డాను కానీ ఓడిపోయాను!" అంది అసహ్యంగా చూస్తూ "ఏం నటన? ఇవన్నీ నీకలవాటేగా మీ ఇంట్లో నాలాటివాళ్ళు ఎంతమంది వచ్చేవాళ్ళు రోజుకు? ఇన్నేళ్ళు నాకిది తోచనేలేదు నీ అదృష్టంవల్ల ఇలా ఒకరికి భార్యగా వున్నావేకానీ లేకుంటే " వెకిలిగా నవ్వుతున్నాడు

అతని చేతుల్లో వుండటం ఇంక అసాధ్యం అయింది రాజేశ్వరికి బలవంతంగా అతన్నుంచి విడిపించుకుని, విసురుగా నెట్టేసి దూరంగా వెళ్ళి నించుంది అతను తూలి రేడియో బల్లమీదపడి తల కొట్టుకున్నాడు ఇలా జరుగుతుందని వూహించనైనా లేదేమో అతని అహం దెబ్బతింది కళ్ళలో అసహ్యం, కోపంతో మొహం వికృతంగా తయారైంది చెంపలమీద పడ్తున్న దెబ్బలు, తనకి కాదు ఎవరికో అన్నట్టు నించుంది రాజేశ్వరి "ఎంత పొగరు? ఎంత తిరస్కారం? నీలాంటివాళ్ళు వున్నా లేకున్నా ఒకటే కొన్నాళ్ళు వీధుల్లో అడుక్కుంటేకానీ నీకు తెలిసిరాదు " ఏం అంటున్నాడో, ఏం చేస్తున్నాడో అప్పటికే కళ్ళు తిరుగుతున్న రాజేశ్వరికి అతను నెట్టాడో, తనే వచ్చేసిందో వీధిలోకి తెలీదుకానీ, వెనకాల పెద్ద చప్పుడుతో తలుపు మూసుకుపోవటం మాత్రం వినిపించింది ఎలాగైతేనేం,ఆ అమ్మాయి అనుకున్న విధంగా కాకపోయినా ఆ రోజు జీవితం కొత్త మలుపు తిరిగింది

తర్వాత ఎన్ని కష్టాలు పడి, ఎందరి సాయంతో టెలిఫోన్ ఎక్సేంజిట్రైనింగ్ అయిందో అవన్నీ ప్రస్తుతం రాజేశ్వరికి అనవసరం ఆ వూరికి వచ్చి ఐదేళ్ళయింది ఐదేళ్ళనించీ ప్రతిరోజు మార్పు లేకుండా సాగుతున్న రొటీన్ ఒక్కటే ఆ అమ్మాయికి తోడు పాతికేళ్ళ రాజేశ్వరి, మానసికంగా ముసలిదైపోయింది సంతోషం లేకున్నా, విచారం మాత్రం లేదు గతంలేదు, భవిష్యత్తు లేదు, ఒద్దన్నా ఒప్పుకోని వర్తమానం మాత్రం వుంది

నైట్‌డ్యూటీ చేసి వచ్చి, పొద్దు

న్నించి నిద్రపోయి అప్పుడే లేచింది రాజేశ్వరి చీకటి పడింది తలుపు తీసేసరికి ఎదురుగా, పదేళ్ళ కుర్రాడు "రాజేశ్వరి అంటే మీరేనా? ఈ చీటీ మా అమ్మ ఇచ్చింది"

"ఊ మీ అమ్మ ఎవరు బాబూ?" చీటీ తీసి చదివింది "రాజేశ్వరిగారికి, రాంమోహన్‌గారు హాస్పిటల్లో వున్నాడు అతని మాటల్నిబట్టి మీరొక్కరే అతనికి కావల్సిన వాళ్ళని తెలిసింది వీలైతే చూచి వెళ్ళండి" గౌరి హాస్పిటల్ పేరూ, వార్డు నెంబరూ వున్నాయి

ఆర్థోపీడిక్స్ వార్డు యమ్ యస్ 1 ఎంట్రెన్స్‌లో నిల్చునేసరికి నర్సు గౌరి కనిపించింది ఆవిడని తన వీధిలో చాలా సార్లు చూచినట్టు గుర్తొచ్చింది అతను బస్ ఎక్కుతూ పడ్డాడట వెన్నెముకకి బాగా దెబ్బ తగిలింది వీధులో వాళ్ళే హాస్పిటల్లో చేర్చారు ఆపరేషన్‌చేస్తే కోలుకోవచ్చు కానీ మానసికంగా చాలా అధైర్యంగా వున్నాడుట హాస్పిటల్ వాళ్ళు డైట్ ఇస్తున్నారు ఏమీ తినటంలేదుట రోజు రోజుకీ వీక్ అయిపోతున్నాడు. అతనికి ధైర్యమిచ్చి ఆశ కలిగిస్తే తప్పకుండా బతుకుతాడు గౌరి చెప్పింది ఈ వివరాలన్నీ!

అతను బెడ్‌మీద కళ్ళు మూసుకుని పడుకుని వున్నాడు గడ్డం పెరిగివుంది తెల్లటి అతని మొహం మరింత తెల్లగా పాలిపోయివుంది మొహం చిక్కిపోయి దవడ ఎముకలు కనిపిస్తున్నాయ్ ఫాన్ గాలికి జుట్టు చెదిరి మొహంమీద పడి వుంది రాంమోహనరావ్ చాలా అందమైనవాడు అందుకు మాత్రం అతను నిజంగా గర్వపడొచ్చు చిక్కిపోయి బెడ్‌మీద వున్నా ఆ అందం తగ్గలేదు కానీ ఆ అందమైన ముఖం వెనక వికృతమైన స్వభావం అదేలేకుంటే అతని కష్టసుఖాల్లో నీడలాగా వుండాల్సిన తను.







ఇలా పరాయిదానిలాగా చూడటానికి వచ్చేదా? రాజేశ్వరి మనస్సు ఆర్ద్రం అయింది పక్కన కూచుని మెల్లిగా అతని చెయ్యి పట్టుకుంది కళ్ళు తెరిచాడు మొదట ఆశ్చర్యం, అనుమానం, సంతోషం అతని కళ్ళలో కదిలాయి "వచ్చావా? ఎలా చస్తానోనని చూడటా నికా?" అంటూ బలహీనంగా నవ్వాడు తను రావటం అతనికి సంతోషంగా వుంది ఏం మాట్లాడాలో తెలీలేదు రాజేశ్వరికి సొంతవాళ్ళెవరూ దగ్గర లేకపోవటంతో హాస్పిటల్లో అతన్ని నెగ్‌లెక్ట్ చేశారు అతని బట్టలూ, బెడ్ మీది బట్టలూ మాసివున్నాయి వాంతి చేసు కున్నాడేమో, అదంతా బట్టలకి అంటు కునివుంది వార్డుబాయ్ సాయంతో బట్టలు మార్చేసి, బెడ్ శుభ్రంచేసింది బ్రెడ్ పాలు తెచ్చిపెట్టింది అతను ఆకలితో తింటున్నాడు

వారం రోజుల్లో అతను చిత్రంగా కోలుకున్నాడు మొహంలోకి జీవం వచ్చింది ఆఫ్టరాల్ రాజేశ్వరి తనకి భార్య చెయ్యాల్సిన బాధ్యత ఆమెకి వుంది అందుకే చేస్తోంది తనకి ఆ అమ్మాయిమీద ఇప్పటికీ, ఎప్పటికీ అధి కారం వుంది వార్డులోని పేషంట్ల అటెం డెంట్స్‌తో మాట్లాడటం మొదలు పెట్టాడు తన వంశంగురించీ, విశాల మైన హృదయంతో దిక్కులేని రాజేశ్వ రిని చేసుకున్న గొప్పతనంతో కథ మొదలు పెట్టాడు! ఆ అమ్మాయిని చది వించేసరికి పొగరెక్కి, పోట్లాడి ఇంట్లోంచి వెళ్ళిపోయి, తప్పు తెలుసు కొని మళ్ళీ వచ్చిందని కథ ముగింపు ఈ మధ్యలో ఎన్నో తను పడ్డ కష్టాల గురించి "సెల్ఫ్‌పిటీ"తో అల్లిక! ఆ కథ వార్డులోని చాలామందిని ఆకర్షించింది!

ఈవారంలో అతను రాజేశ్వరితో మాట్లాడిన కొన్ని మచ్చుతునకలు "మీ ఆఫీసర్ ఎలాంటివాడు? నిన్ను పనికే మెచ్చుకుంటాడా? పనికొస్తావని మెచ్చు కుంటాడా? అందుకే కాబోలు మొగుడు హాస్పిటల్లోవున్నా సెలవివ్వకుండా ఎదు రుగా కూచో పెట్టుకున్నాడు? ఒక కాయితం వాడి మొహాన పారేసిరాక ఇంకా వుద్యోగం అంటూ కూచున్నావ్

ఇదంతా వుద్యోగం మీది ప్రేమే? నీకు వుద్యోగం చెయాల్సిన ఖర్మేం? అన్నయ్య పోవటంతో అతని ఆస్తంతా నాకే వచ్చింది!" తనని కాదన్నట్టు కూచు నేది రాజేశ్వరి

ఆఫీసులో పని హాస్పిటల్ డ్యూటీలో రాజేశ్వరి నలిగిపోయింది జ్వరం వస్తోంది, రేపే అతనికి ఆపరేషన్ ఆ సాయంత్రం అతని బెడ్ పక్కన కూచున్న రాజేశ్వరిని ఎవరో పేరుపెట్టి పిలిచారు తలెత్తి చూసేసరికి ఎదురుగా వాళ్ళ బాస్ ఆయన "కజిన్‌సన్"కి కాలు ఫ్రాక్చర్ అయితే చూడటానికి వచ్చా డట ఆయన పార్శీ ఫారిన్‌రిటర్న్‌డ్ చాలా సోషల్‌గా వుంటాడు రాంమోహన రావుని గురించి అడిగాడు తప్పనిసరిగా ఇంట్రడ్యూస్ చెయ్యవలసి వచ్చింది అతను కొంచెంసేపు మాట్లాడి "డోంట్ వర్రీ, రాజేశ్వరి ఎక్కడవుంటే అక్కడ హెల్త్ బ్యూటీ వుంటాయ్ షి యీజ్

ఎ డివైన్ డ్రాప్డ్ ఏంజెల్" అంటూ రాజేశ్వరి భుజంమీద తట్టి వెళ్ళాడు తిరిగి చూసిన రాజేశ్వరికి రాంమోహనరావు కళ్ళలో అదేచూపు. అసహ్యంతో,కసితో. అనుమానంతో నిండిన చూపు ఎనిమి దేళ్ళ క్రితం తను మరచిపోదామన్న మరిచిపోని రాత్రిని గుర్తు తెచ్చింది. ఒళ్ళు ఝల్లుమంది "మనం మళ్ళీ కలిసి బతుకుదామని ఆశపడ్డాను పిల్లలు పుడితే ఆడపిల్లల్ని మా అత్తయ్యల్లాగా, మొగ పిల్లల్ని మా తాతయ్యల్లాగా గొప్పవాళ్ళని చేసి వంశ గౌరవం నిలబెడ్దామను కున్నాను ఛ ఛ ఎంగిలాకులకోసం ఆశపడే కుక్కని సింహాసనంమీద కూచో, పెడితే సరిగ్గా వుంటుందా? పుట్టుకతో వచ్చిన బుద్ధిపోతుందా? నాకు వచ్చిన డబ్బుకోసం ఆశపడి వచ్చావే కానీ రెండోసారి చిత్తుగా మోసం చేశావ్. "నీ మొహం చూస్తేనే పాపం నీవల్ల నాకు సంతోషంలేదు సుఖంలేదు" అంటూ పెద్దగా అరుస్తూ ఆవేశంగా లేచాడు "బోన్ ఎడ్జెస్ట్మెంట్"కి పెట్టిన పలకలూ అవీ పడిపోయాయ్! బాధతో పెద్దగా కేకేసి పడిపోయాడు అది చూసి భయంతో రాజేశ్వరికి తెలివి తప్పింది

స్టాఫ్ రూమ్లో కళ్ళు తెరిచిన రాజే శ్వరికి ఎదురుగా తెల్లటి శూన్యం లేచి అతనున్న వార్డులోకి వెళ్ళింది బెడ్ ఖాళీ. ఎమర్జెన్సీ వార్డులోకి తీసికెళ్ళారని చెప్పారు వార్డు ఎక్కడో కనుక్కొని వెళ్తున్న రాజేశ్వరికి ఎదురుగా గౌరి వచ్చి చెయ్యిపట్టుకుని తీసికెళ్ళింది సన్నని కారిడార్ వీల్ కాట్ నెట్టుకొని వస్తు న్నారు గౌరితోపాటు నిలబడిపోయింది రాజేశ్వరి ప్రాణంలేని రాంమోహనరావ్ అందమైన మొహం తనకేం కాదా? పిచ్చిగా అతన్నే చూస్తున్న రాజేశ్వరికి వున్నట్టుండి అతనికళ్ళు, పెదిమలు విచ్చు కున్నట్టు కనిపించింది వాటిలో హద్దు లేని అసహ్యం, ఎందుకో తెలీని కసి వాటిని అణుచుకోలేని అసహాయత, వాటన్నిటినీ తీర్చుకోటానికి మనసులేని ప్రాణం వున్న మనిషి కావాలి అదే నాకు ఆనందం అన్న ఆకాంక్ష "నాకు సుఖంలేదు, సంతోషంలేదు అన్న ఆక్రోశం

"నిజం అతను బతికిన కొద్దికాలం సుఖంగా, సంతోషంగా బతకలేదు పరిస్థితులకు సమన్వయించుకోలేని తాతల నాటి గతంలో జీవించాడు అమృతమయ మైన జీవితాన్ని మరణ సదృశం చేసు కున్నాడు ప్రస్తుతం అతని వర్తమానం మరణం

"భగవాన్ మరణంలోనైనా అతనికి జీవితాన్ని ప్రసాదించు" కళ్ళు మూసు కుంది రాజేశ్వరి నిర్లిప్తంగా!



# మ ధు ర వా ణి

వ్యాఖ్యాత కె. వి. నాగేశ్వరరావు

యస్మిన్ దేశే నసన్మానో
నవృత్తిర్నచ బాన్ధవః
నచ విద్యాగమః కశ్చిత్
తందేశం పరివర్జయేత్ 37

ఏ ప్రదేశమందు సన్మానముగాని, ఉద్యోగముకాని, బంధుజనముకాని, విద్యా ప్రాప్తికాని లేదో ఆ ప్రదేశమును వదలవలయును

తత్ర మిత్ర నవస్తవ్యం
యత్ర నాస్తి చతుష్టయమ్
ఋణ దాతాచ వైద్యశ్చ
శ్రోత్రియః సజలా నదీ 38

ఎచ్చట-అప్పు యిచ్చువాడు, వైద్యుడు, వేదపండితుడు సదా ప్రవహించు నదియు-ఈ నాల్గును లభించవో అచ్చట నివసింపరాదు

ధనాశా జీవితాశాచ
గుర్వీ ప్రాణ భృతాంసదా
వృద్ధస్య తరుణీ భార్యా
ప్రాణే భ్యోఽపి గరీయసీ 39

ప్రాణులకు ఎల్లప్పుడును ధనముపైన, ప్రాణముపైన ఆశ ఎక్కువగా నుండును వృద్ధునకు పడుచు భార్య ప్రాణములకన్న గొప్పది

అపుత్రస్య గృహం శూన్యం
సన్మిత్ర రహితస్య చ
మూర్ఖస్యచ దిశః శూన్యాః
సర్వ శూన్యా దరిద్రతా 40

సంతానము లేనివాని గృహము కళా విహీనము మంచి స్నేహితులు లేనివాని జీవితము వ్యర్థము మూర్ఖునకు దిశలు (మార్గములు) అన్నియు నిరర్థకములు. దరిద్రునకు, ఇంట బైట అంతయు శూన్యమే

అర్థ నాశం మనస్తాపం
గృహే దుశ్చరి తానిచ

వఞ్చనం చావ మానంచ
మతిమాన్న ప్రకాశయేత్ 41

ధనము పోగొట్టుకొనుట, మనస్తాపము, గృహములోని లోపములను, మోన ము, అవమానమును వీటిని బుద్ధిమంతుడు వెల్లడించరాదు

అయు ర్విత్తం గృహచ్ఛిద్రం
మన్త్ర మైథున భేషజమ్
తపో దానావ మానంచ
నవ గోప్యాని యత్నతః 42

ఆయుస్సు, ధనము, గృహములోని దోషములు, మంత్రము, స్త్రీ సంభోగము, ఔషధము, తపస్సు, దానము అవమానము, ఈ తొమ్మిదింటిని బుద్ధిమంతుడు వెల్ల డించరాదు

లోబేన బుద్ధిశ్చలతి
లోభో జనయతే తృషామ్
తృషార్తో దుఃఖ మాప్నోతి
పరత్రేహచ మానవః 43

లోభమువలన బుద్ధి చలించును లోభము ఆశను కల్గించును అత్యాశ కల్గిన నరుడు ఈ లోకమందును పరలోకమందును దుఃఖమననుభవించును

ధనలుబ్ధోహ్య సంతుష్టః
నియతాత్మా జితేన్ద్రియః
సర్వాప వాపదస్తస్య
యస్య తుష్టం నమానసమ్ 44

ధనముపై కాంక్ష కలవానికి, తృప్తిలేనివానికి, మనోనిగ్రహము లేనివానికి, జితేంద్రియుడు కానివానికి, హృదయానందము లేనివానికి, అన్ని ఆపదలును సంభ వించును

పరిచ్ఛేదోహి పాండిత్యం
యదా పన్నా విపత్తయః
అపరిచ్ఛేద కర్తౄణాం
విపదఃస్యుః పదే పదే 45

ఆపదలు సంభవించినపుడు యుక్తా యుక్త వివేకమే పాండిత్యము అట్టి వివే కము లేక ప్రవర్తించువారికి అడుగడుగున ఆపదలు ఏర్పడును

# మనిషి కట్టిన గోడలు మనిషే పడగొట్టాలి

గంగడు ఏటిగట్టుకావల పూరి గుడిసెలో ప్రకృతి ఒడిలో పెరుగుతూ చేపలు పట్టడంలో తండ్రికి చేదోడువాదోడుగా వుంటాడు ఇవతలి ఒడ్డున సరుగు చెట్ల నీడలో నిటారుగా నిలిచిన రెండంతస్థుల మేడలో చలమయ్య ముద్దుల కొడుకు గోపీ గోలీకాయలాడుతూ గోల చేస్తుంటాడు కాలం యీ యిద్దరినీ పూరి బళ్లో కలిపింది

మనిషికీ మనిషికీ మధ్య యీ అంతరాలెందుకు? ఎవరు కల్పించారు యీ మురికినీటి ఏటిని?

వెనుకబడిన తనమా యీ ఏటి పేరు?

అట్టడుగున ఉన్న వాడికి ఆర్థిక సహాయం అందజేస్తే అతని వృద్ధికి ఆకాశమే హద్దు

సమాజంలోని వెనుకబడిన వర్గాలవారి జీవితాలను పూల బాటలుగా మార్చడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి మనిషి నిర్మించిన అడ్డుగోడలు మనిషే పడగొట్టుకోవాలి

ఆంధ్రప్రదేశ్ షెడ్యూలు కులాల సహకార ఆర్థిక సహాయ సంస్థ, ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన తరగతుల సహకార ఆర్థిక సహాయక సంస్థ, మహిళా సహకార ఆర్థిక సహాయక సంస్థ బడుగు వర్గాల భవిష్యత్తును తీర్చిదిద్దుతున్నాయి కృషి చేస్తున్నాయి

జీవితాలు మళ్ళీ మనసారా నవ్వుతున్నాయి

— ౦ —

---

సమాచార, పౌరసంబంధ శాఖ హైదరాబాదు.

# వివాహం వ్యాపారమా?

ఎమ్. కరుణ

కన్యాశుల్కం పోయి వరకట్నం వచ్చింది ఒకదెయ్యం వదిలితే మరోదెయ్యం పట్టినట్లుంది ఈ సంఘానికి ఆడపిల్ల పుట్టిందంటే అయ్యోరాతా! అనే పరిస్థితి ఏర్పడింది పుట్టీపుట్టగానే ఆ అమ్మాయి ఎన్నో సమస్యలకు కారకురాలుగా నిర్ణయించ బడుతుంది అప్పటినుండి ఆ పిల్ల పెళ్ళివిషయం, కట్నం యివ్వలేని నిస్సహాయత ప్రతి మధ్యతరగతి కుటుంబీకుని కళ్ళముందు ఒక గందరగోళాన్ని సృష్టిస్తుంది ఇద్దరాడపిల్లల పెళ్ళిచేసే సరికి ఆ కుటుంబ యజమానికి చిప్పచేతి కొస్తుంది ఆ భిక్షాధికారి చావలేక, బ్రతకలేక రోజూ చస్తూ గతుకుల బాటకుఅతుకులేస్తూ సాగిస్తాడు ప్రయాణం

చదివి డిగ్రీలు సంపాదిస్తున్న యువకుల వరకట్నాన్విత డిగ్రీలతో బాటు వేల్లో పెరుగుతుంది "పదివేలు డొనేషన్ అయినాసరే కట్టి మా అబ్బాయిని మెడిసన్ చదివించాలనుకుంటున్నాం లక్షరూపాయల కట్నం దానంతటదే వస్తుంది" అనే తలిదండ్రులు "గ్రాడ్యుయేట్‌నయితే పాతికవేలే వస్తాయి పోస్టుగ్రాడ్యుయేటనయితే మరోపాతిక వేలు కట్నం వస్తుంది" అనుకొనే యువకులు ఈ సమాజ నిర్మాతలు అలా నిర్ణయింపబడిన డబ్బుకి ఒకపైసా తక్కువయినా

అతను పెళ్ళిచేసుకోవడానికి ఒప్పుకోడు అతనేమిటి? తల్లితండ్రులు ఒప్పుకోనీయరు మళ్ళీ అతగాడికి పిల్ల అందంగా ఉండాలి ఏ రంగు గొర్రె అయితేనేమో గొంతు కోయడానికి అత్తా మామలకి ఒక్కతే ఆడపిల్లయితే ప్రిఫరెన్సు ఇవ్వబడుతుంది తోడల్లుళ్ల గొడవలేకుండా, చిరకాలం ఘనంగా మర్యాదలు పొందవచ్చు అత్తా కోడళ్ళ మధ్యవున్న సంబంధం యజమాని-బానిసల మధ్య ఉండే సంబంధంలా ఉంది ఊపిరి సలపకుండా పనులు పురమాయించినా చేయాలి పైగా అది తేలేదు, ఇది తేలేదు, లాంఛనాలు సరిగా జరుపలేదనో వారింటి కోడలు అంత కట్నం, ఇంత బంగారం తెచ్చిందట ఆ అబ్బాయికి వాళ్ళ మామగారే స్కూటరు కొనిచ్చారుట అనో "మా అబ్బాయి మాత్రం వాళ్ళ మామగారికి తేరగా వచ్చాడు" అనీ (పావలాపెట్టి పాలకూర కొన్నట్లు) విసుర్లు విసురుతూ ఉంటారు

ఈ వరకట్న పిశాచి మధ్య తరగతి వాళ్ళనే కాకుండా పల్లెల్లో వెనుకబడిన తరగతుల్లో కూడా ప్రవేశించి ఇదే మోతా

దులో పట్టి పీడిస్తూంది వ్యవసాయ రంగంలో పురుషుడితో అన్నివిధాలా సమానమైన పనిచేస్తుంది స్త్రీ అమ్మాయీ కూలికెళ్తుంది అబ్బాయీ కూలికెళ్తాడు ఇద్దరూ గింజలు తెచ్చుకుని పొట్టపోషించుకోవలసిన వాళ్ళే అయినా అమ్మాయి పెళ్ళిచేయాలంటే తండ్రి వెయ్యో రెండు వేలో కట్నం ఇవ్వాలి ఇవ్వలేకుంటే పెళ్ళికాదు పెళ్ళిచేయకుంటే లోకం కాకై కూస్తుంది పెద్ద పెద్ద వడ్డీరేట్లకు అప్పుతెచ్చి పెళ్ళిచేసి ఆ అప్పుతీర్చడం కోసం ఒన్నెల్లల్ని జీతాలుంచి (భూస్వాముల దగ్గర) జీవితాంతం చదువూ సంధ్యలూ లేక ఊడిగం చేస్తున్న వాళ్ళు చాలా మంది ఆ తరువాత కుటుంబంలో వచ్చే రోగాలు నొప్పులూ గోరుచుట్టు మీద రోకటిపోట్లు ఇంక సమసమాజానికి స్థానమెక్కడ?

జీవిత భాగస్వామిని ఎన్నుకునే హక్కు స్త్రీకి చట్టరీత్యా కల్పించబడినప్పటికీ సమాజం ఎంతవరకు ఇచ్చింది? ఆ హక్కులు కాగితాలలోనే వయస్సు పెంచుకుంటున్నాయి కాని ఆచరణలో పరిరక్షింపబడుతున్నాయా? నేటి సమాజం స్త్రీకి అబల అని మానలేక బలహీనతను మాత్రం ప్రసాదించింది తనపట్ల తనే

న్యూనతా భావాన్ని పెంచుకుంది స్త్రీ సంప కట్టుబాట్లూ, సమాజ మూఢా చారాల నెదిరించి తన జీవితభాగస్వామి నెన్నుకొన్న స్త్రీ జీవిత పథంలో దుర దృష్టవశాత్తూ ఏవైనా విపత్కర పరిస్థితు లేర్పడి ఒంటరియైతే ఆస్త్రీని చీదరిస్తుంది గాని ఆదరించగల ఔన్నత్యముందా ఈ సమాజానికి సంఘాన్ని. సమాజాన్ని ఎదిరించి తనబాట నెన్నుకోగలననే దృఢ విశ్వాసం, ఆత్మస్థయిర్యం స్త్రీకి లేకుండా పోయాయి చట్టం చుట్టంలా ఉంటుందే కానీ ఆపదలో ఆదుకుంటుందా?

కట్నం ఇవ్వక తప్పదు అనుకున్న ప్పుడు అమ్మాయిలను ఉన్నత చదువులు చదివించేందుకు ఉత్సాహం చూపించడం లేదు తల్లితండ్రులు ఆర్థిక స్వాతంత్ర్యం లేని స్త్రీ పురుషుడిపై తప్పకుండా ఆధార పడాల్సివస్తుంది అందుకు కొంత దక్షి ణగా వరకట్నం ఇవ్వాల్సి వస్తుంది అందుకే మొదట స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం గావాలి అన్నదమ్ములలో సమానమైన ఆస్తిభాగాన్ని పొందాలి అది ఎంతైనా కానివ్వండి, ఇల్లూ, వాకిలీ పొలం-పుట్రా, గేదె-గొర్రె ఏదైనా సరే కుటుం బంలోని వ్యక్తిగా సమమైన భాగాన్ని పొందాలి స్త్రీకి ఆస్తి హక్కు కల్పించ నంత వరకూ పురుషుడి ఆధిక్యత అలాగే ఉంటుంది అసలు పెళ్ళై అత్తగారింటి కెళ్ళిం తర్వాత కూడా "నా తండ్రి ఇంత సంపాదిస్తే నేనా ఇంట్లో పుట్టిన ఆడపడు చును నేనెందుకు ఇంతో, అంతో పొంద కూడదు అనే భావన కలిగి కట్నం రూపేణా ఎంతో కొంత సాధించాలని ఆడపిల్లలే తల్లితండ్రులను డబ్బు అడిగే వాళ్ళూ కనిపిస్తున్నారు అవును, కుటుం బంలో వ్యక్తిగా ఆస్తిలో భాగస్వామిని ఎందుకు కాకూడదు స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యంలేకుండా రాజకీయ, సామా జిక స్వాతంత్ర్యాలన్నీ అసంభవం రాజ కీయంగా స్త్రీలు ముందుకు రావాలి అంటు న్నారు చరిత్ర పుటలు తిరగేస్తే ప్రతి ఉద్యమంలో స్త్రీ పాత్ర గైకొన్నది. స్వాతంత్ర్య పోరాటంలో కూడా స్త్రీలు పాల్గొన్నారు స్త్రీల ప్రత్యేక హక్కుల కోసం, సమస్యలకోసం మాత్రం ఎవరూ ఉద్యమాలు నడపరు స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్ళైనా స్త్రీలకు ప్రత్యేక శాసనా లేవీ కల్పించబడలేదు ఆమెలో రాజ కీయ చైతన్యం అణగారిపోకుండా ఎలా ఉంటుంది? ఎవరికోసం ఉంటుంది?

చట్టంలో స్త్రీకి ఆస్తి హక్కుని కల్పిం చాలి 18 ఏళ్ళు దాటింతర్వాత తల్లి దండ్రులు పిల్లల్ని స్నేహితులుగా చూసి వాళ్ళ భావాలకు విలువనివ్వాలి తల్లి దండ్రులు ఉన్నత విద్యలకు మగపిల్ల లతోపాటు ఆడపిల్లలను కూడా పంపి, కుటుంబంలో సమాన స్థానాన్ని కల్పిం చాలి వివాహం విషయంలో పిల్లల నిర్ణయాలకు ప్రాముఖ్యతనివ్వాలి యువతీ యువకులు స్వయం నిర్ణయాలతో సమా జంలో తరతరాలుగా నరనరాల్లో జీర్ణించు కునిపోయిన మూఢాచారాలు మూఢవిశ్వా సాలకు స్వస్తిపలికి అభ్యుదయ పథంలో అడుగిడాలి విద్యను కట్నానికి ఎరగా పెట్టగూడదు వివాహం వ్యాపారం కాకూడదు □

సీరియల్



# మనిషికేం కావాలి?

— కొమ్మూరి వేణుగోపాలరావు

విశ్వం బలిష్టమైన చేతులు నా బుజాలను ప్రేమతో నిమిరాయి

"భయపడకు ఇక్కడే వుంటాను"

"విశ్వం" అన్నాను బేలగా

---

**జరిగిన కథ**

కృష్ణమూర్తి బారినుంచి తప్పించుకుని పారిపోతున్న సునీతిని ఆదుకొన్నారు రాజారావుగారు పిల్లల్లేని రాజారావుగారు సునీతిని దగ్గరుంచుకొని చదివిస్తున్నారు సునీతి కాలేజి చదువులో ప్రవేశించింది రాజారావుగారికి వేరే మరో భార్యా, సంసారం ఉన్నదన్న విషయం తెలిపి ఆయనంటే అసహ్యం కలిగింది సునీతికి కాని రాజారావు ఏ పరిస్థితులలో తాను అలా చేయవలసి వచ్చిందో చెప్పినప్పుడు ఆయనలోని మంచితనం తెలిసొచ్చింది సునీతికి మద్రాసులో క్రికెట్ మాచ్ చూడటానికి వెళ్ళినప్పుడు శ్రీకాంత్‌తో పరిచయమయింది సునీతికి వీరిద్దరిమధ్య చనువేర్పడింది నారీద్వేషి అయిన తన ప్రాణస్నేహితుడు విశ్వందగ్గరకు సునీతిని తీసికెళ్ళాడు శ్రీకాంత్ విశ్వానికి స్త్రీలపైగల హీనమైన అభిప్రాయాలకు అసహ్యించుకుంది సునీతి తన ప్రేమో, విశ్వం స్నేహమో తేల్చుకోమని హెచ్చరించింది శ్రీకాంత్‌ను శ్రీకాంత్ తల్లడిల్లిపోయాడు రౌడీలబారినబడ్డ సునీతిని రక్షించాడు విశ్వం శ్రీకాంత్‌ని పెళ్ళిచేసుకునే ఉద్దేశ్యం అతని దగ్గర వ్యక్తపరచింది సునీతి బార్‌లోంచి బయటికి పంపేయబడ్డ విశ్వాన్ని తన కారులో తీసుకొని అతని రూంకెళ్ళింది దింపెయ్యడానికి విశ్వానికి యాక్సిడెంటయితే శ్రీకాంత్‌తో కలసి హాస్పిటల్‌కెళ్ళి అతన్ని చూసొచ్చింది సునీతి ఒంటరిగా పెళ్ళికెళ్ళివస్తూ వర్షానికి తలదాచుకొనేందుకు దగ్గర ఇంటి వరండాలో కెళ్ళిన సునీతి, ఆ ఇంట్లో విశ్వాన్నిచూసి ఆశ్చర్యపోయింది 'సునీతీ ఐ లైక్ యూ' అన్న విశ్వం కొంచెం త్రాగటంతోనే 'నో ఆడదాన్ని నమ్మకూడదు' అన్న అభిప్రాయం వ్యక్తపరిచాడు రాజారావుగారు అనుకోకుండా తీసుకున్న నిర్ణయం మేరకు విశ్వం ఆయన ఆస్తిలో కొంత భాగానికి వారసుడయ్యాడు హఠాత్తుగా రాజారావు మరణించడంతో ఆ వేదనలో విశ్వం దగ్గర ఓదార్పు కోరింది సునీతి

---

"చెప్పు" అన్నట్లు నా శరీరాన్ని నిమురుతున్నాడు

"ప్రేమించిన వాళ్ళనూ, చేరదీసిన వాళ్ళనూ పోగొట్టుకోవటమే నా జీవిత లక్ష్యంలా కనిపిస్తోంది ఇంకా ఇరవై ఏళ్ళయినా నిండలేదు ఒకరొకరుగా అందర్నీ పోగొట్టుకుంటున్నాను, ఇంక భరించలేననిపిస్తోంది"

"భరించగల వాళ్ళకే యిలాంటివి జరగటంలో ఏదో ఫిలాసఫీ వుందనిపిస్తుంది సునీతి!"

ఇహ మాట్లాడలేక పోయాను కదలకుండా, ముడుచుకుపోయిన పావురంలా అలా వుండిపోయాను

"సునీతీ! పద! కాసేపు పడుకుందువుగాని"

"ఉహూ నిద్రరాదు అమ్మనిచూస్తూ కూర్చుంటాను"

"వొద్దు నిద్రరాకపోయినా పడుకో కొద్దిపాటి విశ్రాంతి అవసరం నీకు"

నా భుజాలు పట్టుకొని నడిపించుకొని మంచందగ్గరకు తీసికెళ్ళాడు. మధ్యలో ఓసారి ఆపి అమ్మవైపు తదేకంగా చూశాను ఆ దృశ్యం ఎక్కువసేపు చూడలేక పోయాను

ప్రక్కమీద పడుకొన్నాక విశ్వం నాకంఠం వరకూ పల్చటి దుప్పటి కప్పి అమ్మదగ్గరకు వెళ్ళాడు

కళ్ళు మూసుకున్నాను నిద్రరాలేదు, రాదుకూడా కాని విపరీతమైన మానసిక అలసట వల్లనో, బలహీనత చేతనో బాహ్యప్రపంచం స్పష్టంగా ఏమీ తెలియటం లేదు మసక మసగ్గా ఏవేవోదృశ్యాలు, యింతలో దుఃఖపుతెర మళ్ళీ మసక ఇలా జరిగిపోతున్నది

బుజంమీద బరువైన చెయ్యి మెత్తగా పడింది

"ఊఁ" అన్నాను కళ్ళు విప్పకుండానే

"లే"

"ఏమిటీ?"

"అమ్మ వెళ్ళిపోయింది"

ఒక్క ఉదుటున లేచి కూర్చున్నాను "అమ్మా!" అని ఓ గావుకేకపెట్టి అమ్మ మంచం దగ్గరకు పరిగెత్తాను

# 17

ఆ అధ్యాయంకూడా ముగిసిపోయింది

ఎంత వలదనుకున్నా ఆ జ్ఞాపకాలు మాత్రం తరమటం మానటంలేదు

ప్రేమ అనేది ఎంతగొప్పది! సృష్టి ప్రారంభంలోని అనాగరికపు రోజుల్నించే నాగరికతతో నిండిపోయిన ఈ యంత్రబద్ధమైన రోజులవరకూ——వంచనలు వుండనీ కలతలు వుండనీ, దుర్మార్గాలు, ద్వేషాలు వుండనీ, నిష్కపటమైన ప్రేమ కూడా తన ఉనికిని సుస్థిరం చేసుకుంటూనేవుంది

చరిత్రలో అమ్మప్రేమని మించిన నిజాలు ఎక్కడవున్నాయి?

మానవుడు బేల అతడు స్వార్థబుద్ధి కావటమూ, క్రూరుడు కావటమూ,

విశృంఖలంగా జీవించటమూ—యివన్నీ బయటకు పులుముకున్నరంగులు. లోలోన అతడు నిజంగా వొట్టి బేల

* * *

ఆ తర్వాత పదిపదిహేను రోజులు ఎట్లాగడిపానని! విశ్వం రోజూ వస్తున్నాడు. నేను మంచం మీదనుంచి లేవకపోతే బలవంతంగా పట్టుకుని కూర్చోబెడుతున్నాడు కాఫీ తయారుచేసి తీసుకొచ్చి నాతో త్రాగిస్తున్నాడు దగ్గరకూర్చుని అన్నం తినిపిస్తున్నాడు

చదువు, కాలేజీ ఏమయిపోయినాయో

ఒకరోజు కారులో బయటకు తీసుకెళ్ళాడు

"ఎక్కడకు వెడదాం?"

"ఎక్కడా దిగద్దు కారులో విసుగుపుట్టేదాకా త్రిప్పండి "

అతను వేగంగా డ్రయివు చేస్తుంటే, ప్రక్కన పావురంలా వొదిగి కూర్చున్నాను

ఈ వేగం, అందులో ఓ భాగంగా ఎక్కడపడితే అక్కడ ప్రజలూ, రకరకాల జీవితాలూ—మళ్ళీవీటిని విడిచి ఎక్కడకూ పోవాలనిపించటం లేదు

"ఇదే కావాలి యిదే కావాలి" అనిపిస్తోంది

కాలం మనిషిని మామూలువాడ్నిచేస్తుంది మనిషి కాలాన్ని గతంలోకాల్చేస్తూ వుంటాడు

ఎక్కడెక్కడికో తిరిగివచ్చి రాత్రి పదిగంటలకు యిల్లుచేరుకున్నాం

కారు దిగి "లోపలకు రండి" అన్నాను

"ఇంటికి పోవద్దు?"

"ఎవరున్నారు అక్కడ?"

"నా ప్రేయసి"

"ఎవరామె?"

"వంటరితనం"

"కాసేపు విడాకులివ్వండి"

కారు దిగి నావెంట లోపలకు వచ్చాడు అతన్ని సోఫాలో కూర్చోమని చెప్పి లోపలకు వెళ్ళి బట్టలు మార్చుకువచ్చాను

ఎదురుగా పేము కుర్చీలో కూర్చున్నాను

విశ్వానికీ, పేముకుర్చీకీ అవినాభావ సంబంధమున్నదనిపిస్తుంది అతనున్న చోటల్లా, ఆ చోటు అతనిది అయినా కాకపోయినా పేముకుర్చీ తప్పటల్లేదు

"అయితే మీరు వంటరితనాన్ని ప్రేమిస్తున్నారా?" అడిగాను

"అది నా జీవితంతో పెనవేసుకుపోయింది మీరు?"

"అంటే?"

"వంటరితనాన్ని "

"కోరుకుంటాను కాని భరించలేను"

"ఎందుకని?"

"బహూశా మనసారా కోరుకున్నవి లభిస్తే భరించేశక్తి మనుషులకు వుండదేమో "

అతనేం మాట్లాడలేదు

"మనసారా ద్వేషించినవి కూడా అనుకోకుండా దగ్గరకు వస్తూవుంటే భరించటం కష్టమనుకుంటాను "

కళ్ళెత్తి నావంక చూశాడు కనుబొమలు మెరుపుతీగల్లా కదిలాయి నేను చూపు మరల్చుకోలేదు

అతను మళ్ళీ ఏం మాట్లాడలేదు

"చెప్పండి "

"చెప్పటానికేమిలేదు మనం నడవమన్నట్లు నడిస్తే అది జీవనం మనల్ని నడిపించుకు వెళ్ళేది జీవితం "

అతని మాటల్లో నిజం కాసేపు ఆలోచించకుండా వుండలేకపోయాను

"కమలనిగురించి నాకు పూర్తిగా చెప్పనేలేదు "

"అవసరమని కూడా అనిపించటంలేదు "

"ఎందుకని?"

"కమలని నేను మనస్పూర్తిగా ప్రేమించాను ఆమె నన్ను మోసంచేసింది చేసిందో లేదో చేసిందని నేననుకున్నాను ఆ పరిస్థితుల్లో మనిషి యిరుక్కున్నప్పుడు మనిషి అలా ప్రవర్తిస్తాడేమో తెలీదు మనం మోసం, వంచన - అని యిన్ని పేర్లు పెట్టుకుంటాంగాని మానవత్వపు విలువలు వున్నవాడు కూడా అలా ప్రవర్తిస్తూ వుంటాడనీ వాటికి మనం అప్పుడప్పుడూ వేరే అర్థాలుగా కూడా చెప్పుకోవాలనీ తెలుసుకున్నాను "

"అయితే మీరిప్పుడు నారీద్వేషి కాదా?"

"కాదు?"

"మరి ఎవరు?"

"చెప్పమంటావా?"

"చెప్పండి "

"ఝడుసుకోకూడదు "

"ఉహూ "

"లేచి నిలబడండి "

అతని ఆజ్ఞను శిరసావహిస్తున్నట్లుగా కుర్చీలోంచిలేచి నిల్చున్నాను అతనూ లేచి నా కభిముఖంగా నడిచివస్తున్నాడు

రెప్ప వెయ్యకుండా చూస్తున్నాను.

మంచు కొండలా. శ్వేతదేవతలా. భూలోకపు చక్రవర్తిలా ఠీవిగా వచ్చి నా కెదురుగా నిలిచాడు.

"సునీతీ!"

"ఊఁ."

"నేనిప్పుడు...నారీద్వేషిని కాను. మారువేషగాడ్ని. సునీతీ ప్రేమ బంధితుడ్ని."

అతడి బలమైన చేతులు నన్ను చప్పున దగ్గరకు లాక్కొని అతని గుండె మీదకు తీసుకుపోయాయి.

"వొద్దలండి. ప్లీజ్!"

అతనివైపు చూడటానికి ముఖం పైకెత్తాను.

అదేసమయంలో అతని ముఖం నా వైపుగా క్రిందకు వొంగింది.

అతని పెదవులు నా పెదవుల దగ్గరకు వచ్చి నిలిచాయి. నిలబడలేదు. వాటితో కలిసిపోయినాయి.

ఎన్నో సందర్భాలలో అతను నా శరీరాన్ని తాకాడు. ఏ పురుషుడూ, ఏ స్త్రీని తాకటానికి వీల్లేనంత దగ్గరగా తాకాడు. కాని అపుడెప్పుడూ యిలా జరగలేదు.

ఇందులో—యీ కావాలని దగ్గరకు రావటంలో యింత తేడావున్నదా! అనుభవంవేరు. అనుభూతివేరూనా? ఈ రెండూ దగ్గరకి జరిగినప్పుడు ...ఆశక్తి మిరుమిట్లుకొల్పుతుందా?

అతడి పెదవులు నా పెదవులతో మాట్లాడుతున్నాయి.

"సునీతీ!"

"ఊఁ."

"నువ్వు నాకు కావాలి."

"                    "

"నిన్ను నాతో తీసుకెళ్ళిపోతాను నా కొత్త జీవితాన్ని నీ పాదాలముందు పరుస్తున్నాను "

"                    "

"మాట్లాడవేం?"

"తెలియటంలేదు!"

"ఏమిటి?"

"ఏమి చెప్పాలో అని "

"నేను క్రూరంగా అడిగానని నాకు తెలుసు కానీ నేను క్రూరుడ్ని కాను సునీతీ! నా జీవితంలో దుష్టపుదినాలు గడచిపోయాయి ఏది హాలాహలమో యేది అమృతమో గ్రహించాను ప్లీజ్, కాదనకు "

"విశ్వం" అన్నాను వణుకుతున్నట్లుగా అవును, కాదు——కేవలం ఈరెండు మాటలేకాదు పరిష్కరించ బోయేది వీటి వెనక ముడివడి, చిక్కులుపడి, ఆ చిక్కులు తీయడానికి వీల్లేనంత ప్రళయంగా వుంటాయి కొన్నిబంధాలు "

"నాకు తెలుసు"

"తెలిసే ప్రళయాన్ని ఆహ్వానిస్తున్నావా?"

"ఎంతటి ప్రళయాన్నయినా చల్లబరిచి, చక్కబరిచేశక్తి నాకుంది?"

"విశ్వం! నీవెంతో బలవంతుడివి కావచ్చు కానీ నీచుట్టూ క్రమ్ముకువచ్చే బలహీనతలు అంతకన్నా బలమైనవి "

"సునీతీ! నేను పిరికివాడ్నికాదు "

"ధైర్యం ఒకటే జీవితాన్ని జయించే సాధనంకాదు "

"నువ్వు నాతో సహకరిస్తే, ఏమయినా జయిస్తాను "

ఆలోచనలో పడిపోయాను

"సునీతీ! సునీతీ! ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"విశ్వం! ప్లీజ్! నా మనస్సుకు కొంచెం విశ్రాంతి కావాలి ఇవాళ్టికి విడిపోదాం "

అతడు నన్ను నెమ్మదిగా వదిలేశాడు. ఊపిరాడినట్లయింది

"నీ యిష్టం సునీతీ! రేపు కలుస్తాను "

కారు స్టార్టయి వెళ్ళిపోయిన చప్పుడు ప్రక్కమీద పడిపోయి వెక్కివెక్కి ఏడ్చేశాను

ఏం చేస్తున్నాను? ఎందుకిలా ప్రవర్తిస్తున్నాను? నిజంగా నాలో బలహీనతలున్నాయా? ప్రలోభాలున్నాయా? దృఢంగా ఎందుకు వుండలేకపోతున్నాను?

అసలు నాకేం కావాలి?

ఓ గంటసేపు అలా ఏడుస్తూ గడిపాను మెల్లగా ప్రక్కమీదనుంచి లేచి బీరువాతీసి, అందులోంచి శ్రీకాంత్ రాసిన ఉత్తరం తెచ్చుకున్నాను అది నాన్నగారు పోయేముందు అతను రాసినది

సోఫాలోకివెళ్ళి కూర్చొని ఆ ఉత్తరం వొళ్ళోపెట్టుకొని చదువుకోసాగాను

సునీతీ!

నీతో నాకు దాగుడుమూత లాడాలనివుంది ఎందుకోచెప్పనా? నీమీద నాకెంత ప్రేమవుందో పరీక్షించుకునేందుకు

నామీద నీకున్న ప్రేమగురించి పరీక్ష అనవసరం ఎందుకంటే నీగుండెల లోతులు నాకుతెలుసు అక్కడ ఒకే మాట, ఒకే ఆలోచన, ఒకే మనిషి

ఇహ నాగురించి

కంగారుపడకు నేను యింకాక అన్నట్లుగా స్ప్లిట్‌పర్సనాలిటీని కాను. ఇలా నిన్నువిడచి రావటంలోని బాధని నావైపుగా త్రిప్పుకుని ఊరడించుకున్నాను

అనుకోకుండా చిన్నగురుతర బాధ్యత ఒకటి నెత్తినపడింది.

ఇక్కడికి కొంతదూరంలోవున్న కదిరి అనే చిన్నవూళ్ళో మానాన్నగారు స్థాపించిన అనాధాశ్రమంవుంది. ఆయన పోయాక అనాధాశ్రమం పోషణబాధ్యత నేనే వహించాను.

అక్కడ యీమధ్య చిన్న అరాజకం చెలరేగింది. ప్రస్తుతం దాని నిర్వహణకు జీతం తీసుకుంటూ మేనేజరు పదవిలోనున్న సాంబయ్య చాలా అక్రమాలు చేస్తున్నాడనీ, అక్కడున్న యువతులపట్లకూడా అమానుషంగా, అవినీతికరంగా ప్రవర్తిస్తున్నాడని తెలిసింది. కేవలం తెలియటంకాదు అక్కడవున్న ఓ బాలిక ఆత్మహత్యచేసుకుంటూ, తను గురయిన అత్యాచారాలను నాకు వివరిస్తూ ఓ జాబురాసి, తర్వాత తన జీవితాన్ని అంతం చేసుకుంది. ఆ ఉత్తరం చదివాక నాగుండె కదిలింది. పెళ్ళయాక నీతో గడిపే మధురక్షణాలలో, ఆకాలం తెలియని ఉద్రేకాలలో, సమ్మోహన సంరంభాలలో వీటినిగురించి నేను పట్టించుకోలేక పోవచ్చు. అందుకని యిప్పుడే వెళ్ళి అనాధాశ్రమ పరిస్థితుల్ని చక్కబరచి, నా బాధ్యతని పూర్తిచేసుకుని వస్తాను. నేను తిరిగి రావటానికి ఓ రెండునెలలు పట్టవచ్చు.

ఈ రెండునెలల వియోగంలో మనప్రేమ ఎంతపరాకాష్టకి చేరుకుంటుందో చూడటమే నా ఆకాంక్ష.

నీ
శ్రీకాంత్.

# 18

తెల్లవారింది.

తెల్లవారకపోతే బాగుండు ననుకున్నాను.

నా కిష్టంలేని సూర్యోదయం.

దిగులుగాలేచి ముఖం కడుక్కుందామని వెడుతూండగా గోడనున్న నిలువుటద్దంలో నా ప్రతిబింబం కనిపించి అప్రయత్నంగా ఆగిపోయాను.

నేను వెనకటి సునీతినేనా?

అసలు నేను సునీతినేనా?

ఎందుకలా వున్నాను?

అందంగా లేనా?

అందంగానే వున్నాను. కాని అందులో ఏదో లోపించింది. అంతేగాని నేను సైతం యిష్టపడనిదేదో అధికంగా వుంది.

నాలో యిన్ని విభిన్నభావాలా?

ఇహ చూసుకోలేక అక్కడ్నుంచి వెళ్ళిపోయాను.

స్నానంచేశాక పూజచేసుకుందామనిపించింది. నేను నాస్తికురాల్ని కాకపోయినా

ఎప్పుడోగాని పూజమీదకి మనసుపోదు. చికాగ్గా వున్నానేమో తలారా స్నానంచేశాను. పూజకు అర్హురాలిననిపించింది. సరస్వతి నా యిష్టదైవం.

దాదాపు ఓ అరగంటసేపు సరస్వతీ విగ్రహం ముందు ధ్యానచిత్తంతో గడిపాను.

తర్వాత యివతలకివచ్చి కారిడార్‌లో అటూ యిటూ తిరగసాగాను.

నాకు ఎంతో యిష్టమైన నా సైకిలు గోడవార్న దిగులుగా పడివుంది. చక్రాల్లో గాలిలేదు. దుమ్ము కొట్టుకునివుంది. జాలిగావుంది.

ఎన్నాళ్ళయింది. సైకిలు త్రొక్కని నా జీవిత గమనమే మారిపోయినట్లుంది.

పాడు మనసు.

విశ్వం మాటలు చెవుల్లో రింగుమంటున్నాయి. "రేపువస్తాను. రేపువస్తాను."

శ్రీకాంత్ ఉత్తరం వెంటాడుతోంది.

అతను తన మనస్సుకన్న నా మనస్సుకి విలువనిచ్చాడు. నేనేంచేశాను? నన్ను నేను కనుక్కోలేకపోతున్నాను.

కాని యిప్పుడు నేను నిర్ణయించుకోవాలి. కఠినంగా వుండాలి. సందిగ్ధం వుండకూడదు.

ఒక తాడును తెంచెయ్యబోతున్నాను.

మరో తాడును మెడకు తగిలించుకోబోతున్నాను.

నాలో ఎందరో సునీతులు. నాలో ఎన్నో గొంతులు. నాలో ఎన్నో ఆక్రందనలు.

మనసు మసులుతోంది. మెదడు పిచ్చెక్కిపోతోంది.

నిర్ణయం చేసుకోవాలి. నాదారి రాజమార్గం చేసుకోవాలి.

చిన్న వెలుగు. ఆ వెలుగుతో నా గుండె నిండిపోతోంది. అంధకారం తొలగిపోతోంది.

విశ్వం! విశ్వం!!

అతనికి చెప్పేస్తాను. "నేను నీదాన్నే" అని చెప్పేస్తాను.

"శ్రీకాంత్! నన్ను క్షమించు."

నా కళ్ళనుండి నీళ్ళు కారిపోతున్నాయి.

"శ్రీకాంత్! శ్రీకాంత్! నామీద నమ్మకంతో నువ్వు పరీక్షపెట్టావు. నీ నమ్మకాన్ని వమ్ముచేసి పారేస్తున్నాను."

బయట హారన్ మ్రోగింది. కారాగిన చప్పుడు.

అటు తిరిగి గేటుదగ్గరకు పరిగెత్తాను. తల తిరిగినట్లయింది. నిశ్చేష్ఠురాలనై నిలబడిపోయాను.

(సశేషం)

# పలురంగాలలో

# ఆంధ్ర ప్రముఖులు



శ్రీ బి. కృష్ణమూర్తి

"విజ్ఞాన సముపార్జన అనంతమైనది. ఆవలిగట్టు చేరలేని అనంత సాగరమున్న జ్ఞానమనే సముద్రంలో వీలైనంతదూరం పయనించేందుకు అనుభవాలు పడవలై సహకరిస్తాయి" అంటారు శ్రీ భైరవభట్ల కృష్ణమూర్తి.

31 సంవత్సరాలపాటు రకరకాల హోదాలలో ఆంధ్రాబ్యాంకులో పనిచేసిన శ్రీ కృష్ణమూర్తి 1976లో రిటైరయేనాటికి రీజినల్ మానేజర్‌గా వున్నారు. పేరు పొందిన రెండు సంస్థలకు చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఫైనాన్షియల్ ఎడ్వయిజర్‌గా మద్రాసులో వున్నారాయన ఇప్పుడు.

ఇంగ్లీషు, సంస్కృతము, తెలుగు భాషలలో పండితులైన శ్రీ కృష్ణమూర్తి ఆంగ్లకవులు మిల్టన్, షేక్స్పియర్, కీట్స్ షెల్లీలగురించీ, కాళిదాస శాకుంతలం బాణభట్టుని ఉత్తరరామచరిత్రం, భాసుని నాటకం ప్రతిమ గురించి ఎన్నో వ్యాసాలు రాశారు.

బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన శ్రీ కృష్ణమూర్తి, మద్రాసులో ప్రముఖ సాంస్కృతికసంస్థ 'కళావాహిని'కి స్థాపకాధ్యక్షులు కళావాహిని ఆడిటోరియం గ్రంధాలయం, స్కూలు భవనాలను తమిళనాడు ప్రభుత్వం ఉచితంగా స్థలం ఇవ్వడం అప్పటి రాష్ట్రపతి శ్రీ వి.వి.గిరి శంఖుస్థాపన జరపడం-తను కళావాహినికి అధ్యక్షుడిగాఉన్నప్పుడుజరగటంతనకెంతో ఆనందాన్ని కలిగించిందంటా రాయన.

యువతరానికి శ్రీ కృష్ణమూర్తిసలహా: నేర్చుకొన్న కొలదీ మనకు తెలిసింది చాలా తక్కువని తెలిపే చిత్రమైన విజ్ఞానం. కేవలం పరీక్ష పాసయేందుకు పాఠ్యగ్రంధాలు చదువుతూనే కాలం గడపొద్దు. క్రీడలు, సాంస్కృతిక పరమైన ఇతర వ్యాపకాలు మీ వ్యక్తిత్వాలకు మెరుగుపెట్టుకునేందుకు ఉపకరిస్తాయి.

"ఎంతో విలువైన సాంస్కృతిక చరిత్ర గలవారు ఆంధ్రులు. ఆ సాంస్కృతిక పరమైన విలువలను కాపాడుకొంటూ వాటికిప్రచారంకల్పించుకొంటూ మరింతగా ఆ విలువలను పెంచుకొంటూ ముందుకు సాగవలసిన బాధ్యత ప్రతి తెలుగువాడిపైనా ఉంది" అంటారు శ్రీకృష్ణమూర్తి.

—పి. సరళా సూర్యారావు

# శ్రీశ్రీ నిర్వహించు పదబంధ ప్రహేళిక




ఆధారాలు నవంబరు '77

అడ్డం

1. నాకు జూతో చెలగాటమా? ఎంత వాటం.
4. ఆ జోరు ఈవూరు.
7. సరస్వతి మహల్ లైబ్రరీలో దొరక వచ్చు.
9. చెప్పి వెళ్ళడం.
11. 21 అయితే వెళ్ళకు.
12. భ్రమించు మరలు.
14. చింతలకు ముందు పుట్టేయా.
15. షష్టి (60, LX)
16. బ్రతుకు, బ్రతికేచోటు.
17. ఇందత ఐదా?
19. ఉదాహరణకు నర్మద.
22. సంగీత సాంకేతికం.
23. పి. ఆర్. కాలేజీలోని ఊరు.
25. కన్నం వేసిన పాతనాణెం.
26. దంచినమ్మకు బొక్కిందే—

నిలువు

2. పులి ఆడదు. ఆడిస్తుంది.
3. తయారుచేస్తా. చొక్కాయి
4. ఆనన
5. ఇల్లా (లేక అల్లా)
6. ఆడు పక్షి
8. చెట్లకి. బండి చక్రాలకి ఉత్తరాలు
10. తమిళనాయకుడు (అతని ఉచ్ఛారణలో)
11. ఎప్పుడని తురకసాయిబునా అడగటం
13. నిగమాంత శర్మ
16. చెయ్యడానికి సీపీ. నావి
18. కవిత్వానికి. పైత్యానికి
20. పోలీసు స్టేషన్ కాదు పాడటానికి
21. ఇది తీరడానికి 11 అడ్డు
23. దీన్ని ఆమ్రేడిస్తే మూగడానికి అనుకరణ
24. జల—మేఘం

అక్టోబరు సమాధానాలు

అడ్డం: 1. ఖివాగో; 4. సంకరం; 7. కపిలవాయి; 9. కామా; 11. వార; 12. సంబంది; 14. ఉస్కోలు; 15. నగము; 16. కరణి; 17. సృగాలం; 19. కుక్క; 22. మాగా; 23. బంకిం నవల; 25. బూడిద; 26. నిక్కచ్చి.

నిలువు: 2. వాక; 3. గోపిక; 4. సంవాదం; 5. కయి; 6. వికాసం; 8. మరలు; 10. మా బంగారక్క; 11. వాస్కోడిగామా; 13. తగరు; 16. కకుప్పు; 18. లంగాలు; 20. ర కింద; 21. యువని; 23. బండి; 24. లక్క.

---

## నిబంధనలు గమనించండి!

పదబంధ ప్రహేళిక కొట్టివేతలు, దిద్దుబాట్లూ లేకుండా పూర్తిచేసి నవంబర్ 1 తేదీలోపు మాకు చేరునట్లు పంపండి. తెల్లకాగితం మీద గళ్ళుగీసి పూర్తిచేసి పంపిన ఎంట్రీలు చెల్లవు. ఎంట్రీలు పంపువారు వారి పూర్తి చిరునామా ఎంట్రీపైనే వ్రాసి పంపాలి. ఆల్ కరెక్ట్ ఎంట్రీకి రు. 50/- బహుమతి. ఒకటికి మించి ఆల్ కరెక్ట్ ఎంట్రీ వొచ్చినప్పుడు బహుమతి సొమ్ము విజేతలకు సమానంగా పంచబడుతుంది. ఆల్ కరెక్ట్ ఎంట్రీ ఒకటీ రాకపోతే బహుమతి సొమ్ము పైనెల బహుమతి సొమ్ముకు కలిపి అందజేయబడుతుంది.

---

అక్టోబరు పదబంధ ప్రహేళిక ఫలితం :

ఆల్ కరెక్ట్ ఎంట్రీ ఒక్కటీ రాలేదు (వివరణ తొలిమాటలో...)

ఈ నెల బహుమతి

జాక్ పాట్ రు. **100/-**

# సినిమా

## సెప్టెంబర్ 15కు విలువొచ్చింది!

మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ కళాసాగర్, సెప్టెంబర్ 15న విలువ కట్టలేని ఘనకార్యం చేసింది. తెలుగు సినిమా ప్రేక్షకుడు ఎప్పటికీ మరచిపోలేని నటనను ఎన్నో చిత్రాలలో ప్రదర్శించిన 'నటనకు మరోపేరు సావిత్రికి సన్మానం చేసి తన స్థాయిని పెంచుకొంది సంస్థ. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి జలగం వెంగళరావు అధ్యక్షతన జరిగిన ఆ సభలో పరిశ్రమలోని పలువురు ప్రముఖులు సావిత్రిని అభినందిస్తూ మాట్లాడారు.

'సావిత్రి మాట్లాడిందంటే తెలుగు భాషకు మరింత మాధుర్యం వచ్చినట్లుంటుంది' అన్న దర్శకుడు బి. ఎన్. రెడ్డి మాటలు అతిశయోక్తులు కాదనడానికి సావిత్రి నటించిన ఏచిత్రమైనా ఉదాహరణకు తీసుకోవచ్చు. ప్రముఖ రచయిత ఇచ్ఛాపురపు జగన్నాధరావు 'నటిగా. రెండు దశాబ్దాలపాటు తనదైన ప్రత్యేక



'సన్మానితురాలు' సావిత్రి

స్థానాన్ని కాపాడుకోగలగటం నటిగా సావిత్రి ప్రతిభకు నిదర్శనంగా నిలుస్తోంది' అన్నారు సావిత్రిని ప్రశంసిస్తూ. అంతేకాదు సావిత్రిలాటి మహానటి చిత్రరంగానికి దూరం కావడం కళారంగానికే పెద్దనష్టం....ఆ నష్టం భర్తీచేస్తూ తిరిగి సావిత్రి ఎన్నో మంచి పాత్రలకు ప్రాణంపోస్తూ నటిగా మళ్ళీమళ్ళీ ప్రేక్షకులకు కన్పించాలని ఆశిస్తున్నానన్నారాయన.

'కళ అనంతమైనదన్న అవగాహన ఉన్ననటి. అభినయం, హావభావం ప్రదర్శించడంలో తనకుతానే సాటి' అయిన సావిత్రిని అభినందిస్తూ 'మహాత్మాగాంధీ ప్రస్తావనలేని భారతదేశ చరిత్ర ఉండనట్లుగానే, సావిత్రి ప్రస్తావనలేని దక్షిణభారత ఫిలిం పరిశ్రమ చరిత్రకూడా ఉండదు'అన్నారు నిర్మాత ఎం. ఎస్. రెడ్డి.

నటుడు కృష్ణంరాజు సావిత్రిని కోహినూర్ డైమండ్‌గా వర్ణించారు. ఇంకా సావిత్రిని గురించి జి. ఆర్. రావు, పి. వి రమణయ్య (రాజా), డా॥ సి. ముద్దు కృష్ణారెడ్డి మాట్లాడారు.

సినీనటి వాణిశ్రీ సావిత్రికి అభినందనలందజేస్తూ నటీనటుల నటన నేర్చుకొనేందుకు....మామూలు విద్యార్థులకు ఉన్నట్లు పాఠ్యపుస్తకాలులేవు. ప్రతిభావంతులైన సినియర్ నటీనటులేనటులుగా పైకొస్తున్న వారికి పాఠ్యగ్రంథాలు. నటిగా నేనింతటి స్థానానికి చేరుకోక ముందు-అలా ఆ స్థాయికి చేరే ప్రయాణం మొదలైన తొలి రోజుల్లో-మహానటి సావిత్రి నటన నాకు ఎంతో ఇన్స్పిరేషన్ ఇచ్చింది. ఆమె నా దృష్టిలో దేవత" అన్నారు

మంగళవాయిద్యాలు మ్రోగుతుండగా



'మనుషులు చేసిన దొంగలు'లో
కృష్ణంరాజు, సంగీత

కన్నులపండువగా ఎప్పటికైనా మహానటిగానే వర్ణించవలసిన శ్రీమతి సావిత్రిని సన్మానించారు కళాసాగర్ తరపున



'గోరంతదీపం' కథానాయకుడు శ్రీధర్, దర్శకుడు బాపు

సావిత్రి తనకు జరిగిన సన్మానానికి కృతజ్ఞతలు తెలుపుతూ "సన్మానం అంటే నటిగా మరింత బాధ్యతలు మోయవలసి రావడం. నాకే తెలియని కారణాలవల్ల తాత్కాలికంగా నటనకు దూరమయ్యాను. ఆ కారణాలు ఫలానా అని ఎవరు చూపించినా సరిదిద్దుకొనేందుకే ప్రయత్నిస్తాను. మీ అందరి ఆశీర్వాదబలంతో తిరిగి నటిగా మీ ప్రశంసలు అందుకోగలననే ఆశిస్తాను. 'దేవదాసు మళ్ళీపుట్టాడు'లో నటిస్తున్నాను. ఆ చిత్రం 'సావిత్రి మళ్ళీ పుట్టింది' అనేలా నా ప్రయత్నాలకు



'నాయుడు బావ'లో శోభన్‌బాబు



'లవ్ మ్యారేజ్'లో జయచిత్ర

పునాది అవుతుందని ఆశిస్తాను" అన్నారు.

ఎవరెలా అన్నా, వాటికి సావిత్రి ఏమని సమాధానం చెప్పినా-తాత్కాలికంగా



కన్నవారిలు'లో [illegible]



'సతీ సావిత్రి' జమున

నటనకు దూరమైన కారణాలు ఏవైనా— ఎలాటివైనా....ఒకటి మాత్రం నిజం. సావిత్రి ఒక సామాన్యమైన స్త్రీగా గాక ఎప్పటికీ తెలుగుప్రేక్షకుల హృదయాలలో



'యమగోల' రామారావు, జయప్రద



'మల్లెపూవు' లక్ష్మి, శోభన్‌బాబు



లక్ష్మీకాంత్, రజని 'గడుసు అమ్మాయి'

---



'మా యిద్దరికథ'లో ఒక దృశ్యం



'నా ప్రాణం లో ప్రాణం'
జయచిత్ర, శోభన్ బాబు



'భలే అల్లుడు'లో శారద, కృష్ణంరాజు



'పంచాయితీ'లో చంద్రమోహన్, విజయనిగ



'కరుణామయుడు'లో విజయచందర్

విజయమాధవి వారి చిత్రంలో నాగేశ్వరరావు

మీ ప్రశ్నకు మా
మా ప్రశ్నకు మీ **జవాబు**

నిర్వహణ ధనికొండ హనుమంతరావు

సి ఎ శాస్త్రి, పార్వతీపురం

అన్ని అవలక్షణాలు, దురలవాట్లు కల ఒక బ్రాహ్మణ కులమందు పుట్టినవాడ బ్రాహ్మణుడా? లేక అతి తక్కువ కులములో పుట్టి అన్ని మంచి లక్షణాలు కల్గిన వ్యక్తి బ్రాహ్మణుడా? దీనికి సమాధానం ఏమిటి?

(ఉత్తమ ప్రశ్నగా రు. 25/- బహుమతి పొందినది)

కేవలం ఒక కులంలో పుట్టినంత మాత్రాన ఆ వ్యక్తికి ఏ విధమైన గొప్ప తనాన్నీ అంట గట్టలేము ఒకవేళ అలాటి గొప్పతనం వుందని అనుకున్నా ఆ కీర్తి అతని తల్లిదండ్రులకు చెందుతుందికాని, అతనికి మాత్రం కాదు ఉత్తమ కులం హీన కులం అనేవి యీనాడు మరిచి పోవలసిన మాటలు ఉత్తమంగా బతుకు తున్నవాడే ఉత్తముడు, కులంతోపోల్చక, గుణంతో పోల్చటం సమంజసం

ఐ నరసింహమూర్తి, హైద్రాబాద్-16

హాస్య, వ్యంగ్య, శృంగార, విషాద కథా రచనలో ఏ రకం కథ రాయటం కష్ట తరం? ఏ తరహా కథ సమాజానికి ప్రయోజన కరం?

ఏ రకం కథ రాయటమన్నా కష్ట తరమే! రచయిత నిశితంగా ఆలోచించి సమస్య స్వరూపాన్ని విశదీకరిస్తూ తార్కికంగా రాయగలగటమనేది పైన చెప్పిన అన్ని తరహాల కథలకూ అనువర్తిస్తుంది

---

ఈ శీర్షికలో పాఠకుల ప్రశ్నలకు ప్రముఖ రచయిత శ్రీ ధనికొండ హనుమంతరావు సమాధానాలిస్తారు సీరియస్ ప్రశ్నలకు సీరియస్ సమాధానాలతో పాటు, చిలిపి ప్రశ్నలకు చురకలంటిస్తారు కూడా (నో అఫెన్స్ ప్లీజ్) ఉత్తమ ప్రశ్నకు రు 25/- బహుమతి ఉంది అంతేకాదు, ప్రతినెలా పాఠకులను శీర్షికా నిర్వాహకులు ఒక ప్రశ్న వేస్తారు ఆ ప్రశ్నకు వచ్చిన సమాధానాలలో ఉత్తమమైనదానికి రూ 25 బహుమతి వుంది ఒకటికి మించి సంతృప్తికరమైన సమాధానాలున్నచో బహుమతి సొమ్మును పంచి ఇవ్వడం జరుగుతుంది

ప్రశ్నలూ, జవాబులూ కూడా వీలయినంత వరకూ పోస్ట్‌కార్డ్ మీదనే రాసిపంపండి మీ పూర్తి చిరునామా ఇవ్వటం మరువకండి ప్రతినెలా ఒకటోతేదీ వరకూ వచ్చే ఎంట్రీలు పరిశీలనకొస్తాయి ఆ తర్వాత వచ్చే ప్రశ్నలు మాత్రం తరువాతి నెలకు పరిశీలిస్తాము

వచ్చే నెల జవాబుకోసం ప్రశ్న!
ఎట్టి పరిస్థితుల్లోనూ నీవు మోసం చెయ్యలేని వారెవ్వరు?
ఎందుకని?

అక్టోబర్ జ్యోతిలో ఇచ్చిన ప్రశ్నకు 'ధనికొండ' జవాబు

సమస్య లన్నిటినీ పరిష్కరించే మహత్తర శక్తి కాలము

కాలప్రవాహంలో ఓడలు బళ్ళు, బళ్ళు ఓడలూ అవుతూంటవి కాలం జరిగే కొద్దీ పరిస్థితులు మారి, సమస్యల స్వరూపమే మారుతుంది సమస్య పరిష్కరించబడట మంటే కేవలం అనుకూలంగా పరిష్కరించబడటమే నన్నేది సరైన అభిప్రాయం కాదు ఒకవేళ కాలం సమస్యల్ని పరిష్కరించ లేకపోతే ఆ సమస్యలు వేధిస్తున్న వ్యక్తిని శాశ్వతంగా యీ ప్రపంచంనుంచి విరమింపజేసి, ఆ విధంగా నన్నా ఆ వ్యక్తిని బాధించే సమస్యల్ని పరిష్కరిస్తున్నది

సరైన జవాబు వంద మందికిపైనే రాశారు ఈ వందమందికీబహుమతి మొత్తం రూ 25/- పంచటం హాస్యాస్పదంగా ధ్వనిస్తుంది అందుకని కేవలము 'కాలము' అని మాత్రమే గాకుండా కొంత విశదంగా రాసిన జవాబుల్లో ఐదింటిని ఏరి, యీ కింది ఐదు మందికీ తలా రూ 5/- పంపేందుకు నిర్వాహకులు నిశ్చయించారు

1 యం శమంతకమణి నూజివీడు 2 పి విశ్వేశ్వరరావు, హన్మకొండ
3 జి నాగరాజకుమారి, కాకినాడ 4 అన్నపూర్ణ, మానేపల్లి
5 కె సామ్రాజ్యం, కొత్తగూడెం

---

పోతే రచయిత దృక్పథాలను ఆకళింపు చేసుకునే సమాజమేఏకథ ప్రయోజనకరం అనేది నిర్ణయించుకుంటుంది

వి యల్ చంద్రరావు, హైద్రాబాద్-32

మీరు ఒకసారి ఉత్తమ ప్రశ్నగా ఎన్నుకొన్న దానిని ఒకనెల పత్రికలో ఒక్కసారి చూడంగానే - దానినిబట్టి నాకు ఏ రకమైన ప్రశ్నలంటే ఇష్టమో అంచనా వేయవచ్చునా?

ప్రయత్నించి చూడండి—విష్‌యూ బెస్ట్ ఆఫ్ లక్!

షేక్ ముబారక్ అలీఖాన్, చిట్టివలస

జోతిషాన్ని (జ్యోతిష్కులను) ఎంత వరకూ నమ్మవచ్చు?

మీకు నమ్మకం వున్నంతవరకూ!

డి వి యస్ వరప్రసాద్, గుంటూరు-2

మన ఎదురుగా మాట్లాడుతున్న వ్యక్తి నిజం మాట్లాడు తున్నాడో అబద్ధం మాట్లాడు తున్నాడో తెలుసుకోవడం ఎలా?

ఆ 'ఎదురుగా మాట్లాడుతున్న వ్యక్తి' తప్ప వారెవ్వరూ నిజమో అబద్ధమో తెలుసుకో గలిగిన శక్తిగలవారు కారు

కె. నాగేశ్వరరావు, బరంపురం-2

సాహిత్యం పైన మత ప్రభావం ఎంత వరకూ వుంది?

ఒక్క సాహిత్యం పైనే నేమిటి? నిత్య జీవితంమీద కూడా వున్నది కదా!

ఎన్. ఎ. శ్రీనివాసులు, శ్రీకాకుళం.

చట్టానికి చెవులేకాని కళ్ళు లేవని, చుట్టానికినోరేకాని చెవులులేవని అంటారు ఎందుకని?

నేరాన్ని విచారించేప్పుడు న్యాయ వాదులు చేసే వాద ప్రతివాదాలను అను సరించి, చట్ట స్వరూపం మా రు తూ ఉంటుంది. ఆ వాద ప్ర తి వా దా న్ని వింటున్న న్యాయాధిపతి తాను వింటూన్న దాన్ని అనుసరించి తన నిర్ణయాన్ని ఏర్ప రుచు కుంటాడు. కనుక చట్టానికి చెవులే కాని, కళ్ళు లేవని అనవొచ్చు. ఇక చుట్టా నికి తిండి మెక్కేందుకు నోరు అన్ని వేళలా సిద్ధంగా ఉంటుంది. ఇంట్లో వాళ్ళు విసుక్కుంటున్నా కూడా వినిపించుకునే స్థితిలో ఉండడు కనుక అతనికి నోరు పని చేసినంత బాగా చెవులు వినిపించవు కనుక—చుట్టానికి నోరేకాని, చెవులు లేవని అంటారు.

జంగా శివప్రసాద్, పొట్టెపాలెం.

దేవుడిచ్చిన ఈ జీవితానికి అర్థం ఏమిటి?

అది కనుక్కునేందుకే యీ జీవితం!

బి. రాధాకృష్ణమూర్తి, బొమ్మూరు.

అందమైన ఆడవాళ్ళ సంఖ్య ఎక్కువ వుంటుందంటారా? అందమైన మగవాళ్ళ సంఖ్య ఎక్కువ వుంటుందంటారా?

'అందమైన' అనే దానికి ఎవరి కొలత బద్దలు వారివే. మొత్తం మీద అందమైన వారు తక్కువ. అందుకనే అందానికి ఆ విలువ మొగవారిలోను, ఆడవారిలోనూ కూడా అందమైనవారు సరిసమానంగానే ఉంటారని అనుకోవచ్చు.

చెట్లపల్లి సుబ్బారావు, హకారా.

కులాంతర మతాంతర వివాహాలు (ప్రభుత్వము, స మా జ ము ప్రోత్స హిస్తున్నా).ఆదర్శదాంపత్యానికీ అవరోధా లుగానే వుంటున్నాయి, ఎందుచేత?

ఏదెలావున్నా చిన్నతనంనుంచీ జీర్ణిం చుకు పోయిన పద్ధతులూ, ఆచార వ్యవహా రాలూ మొదలైనవాటితో బాటు, ఆహార విహారాల్లో ఉన్న భేదాలూ మొదలైనవి కూడా కలవక, ఒకరితో మరొకరు సరి పెట్టుకో లేకపోవడంలో మధ్య ఏర్పడే భేదం అతుకు పడకుండా పోతున్నవి.

ఐ. వి. పార్వతీశం, వరంగల్

రామాయణ, భా ర త, భాగవతాది గ్రంథములు వందలకొలది ఏండ్లయినను మరుగున పడలేదు గదా! అదే విధముగా నేటికాలపు గ్రంథము లేవైనను భావి కాలమున మరుగున పడకుండుటకు నవ కాశము ఎంతవరకు కలదు?

ఏ రచనలో human drama ఉంటుందో అది మానవుడు భూమిమీద ఉన్నంత కాలమూ కాలచక్రానికి ఎదురీది నిలబడగలదు. అలాటి రచనలు బహు కొద్దిగానే ఉంటవి. ఏది నిలబడుతుందన్నది కాలమే నిర్ణయిస్తుంది.

సుంకరవ్యాసులు. గజపతినగరం

కొన్ని సమయాల్లో వెన్నెల వేడి

గానూ, ఎండ చల్లగానూ అనిపిస్తుందట! ఎప్పుడంటారు?

మీ మనసుపొందే రసానుభూతి అది. ఆ పరిణామాన్ని బట్టి అలా అనిపిస్తూం టుంది.

ఎన్. రమేష్‌బాబు. మద్రాసు.

జాతీయ అంతర్జాతీయ స్థాయిలలో తెలుగు రచనలకు ఖ్యాతి లభించేందుకై హిందీ, ఇంగ్లీషు భాషలలోకి తెలుగు రచనలను మీరు ఎందుకు అనువదించ కూడదు?

నాకు హిందీరాదు. ఇంగ్లీషులో అను వదించ గలననే ఆత్మ విశ్వాసంకూడా లేదు. ఇంకెవరైనా చెయ్యవలసిన, చెయ్య దగ్గపని. ఎవరు అనేదే నిర్ణయం కావటం కష్టం.

వి. వి. యస్. మూర్తి. చొడిమెళ్ళ

రచయిత(త్రు)లు కలంపేరు ఉపయో గిస్తూంటారు. కాని కాగితంపేరు ఉపయో గించ రెందుకని?

కాగితం మీదనే కదా కలంపేరు ఉపయోగించేది?

శ్రీమతి మోహన్‌రావు, మద్రాసు-54.

మీ రిచ్చే ప్రశ్నకు మే మిచ్చే జవా బులు నచ్చకపోతే మీరు వాటిని డస్ట్ బిన్‌లో పడేస్తారు. మరి మేమిచ్చే ప్రశ్న లకు మీరిచ్చే జవాబులు నచ్చకపోతే ఏం చెయ్యమంటారు?

నేను చేసేపనే చెయ్యండి. ఎవరు అడ్డు పోగలరు కనుక!

బి. రాజారెడ్డి. అనంతపురం-2.

మందోపదేశం అంటే ఏమిటండీ?

మందు కొట్టినవాడుచేసే ఉపదేశం!

వి. కృష్ణారావు. కొత్తగూడెం.

ప్లీజ్! మీ చివరికోరిక ఏమిటో చెప్పండి. సెకనులో మిమ్మల్ని షూట్ చేయ బోతున్నాను?

మీరు ఉరికంబం ఎక్కకుండటమే!

కె. కన్నయ్య. కరిచేడు.

ఒక నవలనుగాని, కథనుగాని చదివే టప్పుడు ఒక సామాన్య పాఠకుడు పొందే రసానుభూతిని రచనానుభవం గలవారు పొందగలరంటారా?

తప్పకుండా పొందగలరు. టెక్నికల్ దృష్ట్యాకూడా చూస్తాదే తప్ప. రసాను భూతిని ఎందుకు పొందదు? అలా పొంద లేకపోతే రచయిత మీద ద్వేషమైనా కారణం;లేకుంటే ఆ రచన రసానుభూతిని సృష్టించ లేనిదైనా అవటం మరో కారణం.

కె. సులోచనరాజు. గుంటూరు

మీకు శ్రీ కృష్ణుదే కనిపించి గీతోప దేశం మొదలు పెట్టబోతే?

'స్వామీ! నీకెందుకీ శ్రమ? గీతను గూర్చి విన్నాను. నా గీత ఎలా ఉందో చూసుకోవలసివుంది! సరిచేసుకోవలసిన పని బోలెడుంది. నీవుకూడా ప్రబోధాలు కట్టిపెట్టి చేయవలసిన మంచి పనులేమన్నా ఉంటే చేసుకో!' అంటాను.

ఎ. గోవిందరాజులు, ఖరగ్‌పూర్

మాంగల్యానికి మూడు ముళ్ళెందుకు?

సర్వసామాన్యంగా మాంగల్యం బంగారంతో చేయబడి వుంటుంది. ఇప్పటి బంగారం ఖరీదు తెలుసు కదా! ఇది కాస్తా ఎక్కడన్నా పడిపోకుండా, మూడుముళ్ళు బిగించి వెయ్యటం అవ సరమే మరి!

గంగ,యమున, సరస్వతుల సంగమం
త్రివేణి
రుచి,సువాసన,పరిమళాల సమ్మేళనం
"త్రివేణి" వక్కపొడి









తయారుచేయువారు..
PHONE-270
త్రివేణినట్ పౌడర్ మాన్యుఫ్యాక్చరింగ్ కంపెనీ
మేనేజింగ్‌పార్ట్నర్.... దౌసు వెంకటసుబ్బారావు....
ఘోర్పురోడ్ ............ మచిలీపట్నం.(ఆంధ్ర)

బ్రాంచీలు హైదరాబాద్, సికింద్రాబాద్, ఏలూరు, కాకినాడ, గుడివాడ, విజయవాడ

# పాపాయిని ఫారెక్స్‌తో పెంచుతున్నందుకు నిజంగా నేను గర్విస్తున్నాను.



## మా డాక్టర్ అన్నారు: "పాపాయికి 3 నెలలు వచ్చాక కేవలం పాలు మాత్రమే ఇస్తే చాలదు. వానికి కావాలి ఫారెక్స్."

**డాక్టర్లు ఫారెక్స్ ఎందుకు సిఫార్సు చేస్తారు?**

అందుకు రెండు కారణాలున్నాయి. పెరిగే మీ పాపాయికి కావలసిన మొట్టమొదటి సంతులిత ఘన ఆహారాన్ని ఇది పూర్తిగా సమకూరుస్తుంది. సున్నితమైన పాపాయి జీర్ణకోశానికి ఇది సరిగ్గా సరిపోతుంది కూడా.

**ఫారెక్స్ ఏ విధంగా పాపాయికి తగిన సంతులిత ఆహారం?**

పాపాయి మెదడు, శరీరం పెరుగుదల కోసం ఫారెక్స్ సులభంగా జీర్ణమయ్యే ప్రొటీన్లను తగినంతగా అందిస్తుంది. పాపాయికి శక్తినిచ్చేందుకు కార్బొహైడ్రేట్లను కూడా సమకూరుస్తుంది. ఫారెక్స్‌లో పాపాయి రక్తాన్ని ఆరోగ్యంగా ఉంచేందుకు తగినంత ఐరన్ ఉంది. మరో విషయం. ఫారెక్స్‌లో మీ పాపాయికి దృఢమైన ఎముకలు, గట్టి పళ్ళు పెరిగేందుకు తోడ్పడే కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ డి తగినంతగా ఉన్నాయి.

**3 నెలలు వచ్చాకనే ఎందుకు?**

ఈ వయస్సులో పాపాయికి నమలడం అలవాటు కావాలి. ఇప్పటినుంచే ఫారెక్స్ ఇచ్చినట్టయితే పెద్దవాడయ్యాక తినే ఆహారాన్ని సరిగ్గా నమిలి చక్కగా జీర్ణం చేసుకోగలడు.

**బంగాళ దుంపలు ఉడికించి మెత్తగా చేసి ఇస్తే కాదా?**

మీ పాపాయికి ఏదైనా ఘన ఆహారం పెట్టే ముందు పాపాయి జీర్ణశక్తి గురించి కూడా కొంచెం ఆలోచించండి. 3 నెలలప్పుడు పాపాయి జీర్ణకోశం ఇంకా సున్నితంగా ఉంటుంది. అందుచేత, అతడు సులభంగా జీర్ణం చేసుకోగలిగే ఘన ఆహారమే ఇవ్వాలి. పైగా, మామూలుగా ఇచ్చే ఆహారాలు సంతులితమైనవి కావు. మీ పాపాయికి అతి ముఖ్యంగా కావలసిన ఐరన్, కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ డి మొదలైన వన్నీ అవి సమకూర్చలేవు. అందుకే 3 నెలలు వచ్చాక మీ పాపాయికి ఫారెక్స్ తప్పని సరిగా ఇవ్వాలని డాక్టర్లు చెప్పడంలో ఆశ్చర్యం లేదు.

**"పెద్దలు తినే ఆహారాన్ని" ఎప్పటి నుంచి ఇవ్వవచ్చు?**

మొదటిసారిగా పాపాయి తప్పటడుగులు వేసినప్పుడు అతడికి పళ్ళు, కూరగాయలు, పప్పు, గుడ్లు ఇవ్వండి. అయితే ఫారెక్స్‌ను మాన్పించకండి. మీ పాపాయికి మూడేళ్ళు వచ్చేవరకు, కొంచెం ఆలోచించి! అతడు తినేవాటన్నిటిలో ఫారెక్స్ కలిపి పెట్టండి.




**సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదలకోసం పాపాయి మొట్ట మొదటి ఘన ఆహారం**

గ్లాక్సో

లింటాస్ GF 57 1710 TL

Edited&Published by V. Leelavathy Raghavaiah, at 17B Rajaram Colony Kodambakkam, Madras 600 024, & Printed by D Hanuman tha Rao, at Kranti Press, 12, Francis Joseph Street, Madras 600 001